## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## రామకృష్ణ మఠ్ వారి వెబ్ సైట్

**http://www.rkmath.org**

Archives

www.rkmath.org/prabhaarchives

Home | Universal Temple | Activities | Languages | Human Excellence | Health | Publications | Downloads

Magazine | Telugu Books, CDs & Posters | Online Shopping

About | Archives | Subscription

What's New | Our Location

Would you try to wash dirt with dirt? Will sin cure sin, weakness cure weakness? Strength, O man, strength, say the Upanishads, stand up and be strong.

- Swami Vivekananda

Donate | Serve with us | Contact Us

Universal Temple
- Temple
- Arathi
- Bhajans
- Festivals
- Rama Nama
- Worship

Activities
- Weekly discourses
- Relief
- Library
- Retreats
- Anna Danam
- Balanarayana Seva
- Vidya Danam
- Jnana Danam
- Satsangas
- Diksha

Ramakrishna Prabha Magazine Archives

2012

2011

Click to read

Click to read

Click to read

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీ రామకృష్ణ ప్రభ

౧౯౫౨, ఆగస్టు—నందన, శ్రావణము

సంపుటము ౯ సంచిక ౨





శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు
చెన్నపురి

# వి ష య సూ చి క



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మాకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగాఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరఁదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులోఁగాని మా పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

3. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఏదైనమార్పు కలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకు దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతి నెల మొదటి తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

3. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీ రామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూర్, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయునచోఁ దగు పోస్టేజి చేర్చి




# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౯౫౨ - ఆగస్టు : నందన - శ్రావణము { సంచిక


శ్రీమత్పరమహంస స్తుతి రాజమ్

## నవరత్న హారః


కవిత్రయమిత్ర, విమర్శకశిరోమణి, కవితాకళానిధి, విద్యారత్న,

శ్రీ గొ. రమాకాంతాచార్యః కాశ్యపః, బి. ఏ.


శ్లో॥ శ్రీలోకమాతృ కరపీడన హేతుభూత దుర్గాప్రసాదపరితోషిత వాసుదేవ!
శ్రీరామభక్తిపర భూసురవంశజాత! శ్రీరామకృష్ణగురుదేవ! నమోనమస్తే! 1

శ్లో॥ గంగాతరంగ నవరంగనదన్మృదంగ సంగీతభంగిమ రసార్ద్రనిజాంతరంగ!
అంగీకృతాఖిల మతాంబుజ రాజభృంగ! శ్రీరామకృష్ణగురుదేవ! నమోనమస్తే! 2

శ్లో॥ యోగాదిసాధన వశీకృతనైజకాయ బాహ్యాంతరింద్రియనికాయ ప్రబోధకేంద్ర!
త్యాగామృతాంబునిధిచంద్ర! సుకీర్తిసాంద్ర శ్రీరామకృష్ణగురుదేవ నమోనమస్తే! 3

శ్లో॥ శక్తిఃపరాభగవతః పరమేశ్వరస్యజ్ఞానక్రియాబలమయీ విధుచంద్రికేవ,
త్వాం హ్లాదయత్యమృతవజ్జగదేకమాతా, శ్రీరామకృష్ణగురుదేవ! నమోనమస్తే! 4

శ్లో॥ కాళీవసంహరతిదైత్యగణాన్ సమస్తమాంగళ్యదైవతమణీవ నిజాంఘ్రిభక్తాన్
దీనాన్ సముద్ధరతిసంసృతి వార్ధిమగ్నాన్ శ్రీరామకృష్ణగురుదేవ! నమోనమస్తే! 5

శ్లో॥ తస్యాస్త్వనంధయవరః ప్రథితప్రభావః, లోకేభవాన్ వివిధవైదికతాంత్రికాద్యైః
ఉద్ధర్తుమేవజనతాంకృతవాన్ ప్రయత్నాన్ శ్రీరామకృష్ణగురుదేవ! నమోనమస్తే! 6
మాయాగుణత్రితయవర్ణవిలాస భాసాసమ్మోహయన్ సకలజీవకుమారకాన్ స్వా
కర్మానుగుణ్యపథితాన్ నయతీహవిశ్వే, శ్రీరామకృష్ణగురుదేవ! నమోనమస్తే!

శ్లో॥ యే, తేషు, సత్త్వగుణినోజగదీశ్వరస్య పాదాబ్జయుగ్మశరణైకపరాయణాశ్చ
తే గాంచదర్శయతిసైవవిముక్తిమార్గం శ్రీరామకృష్ణగురుదేవ! నమోనమస్తే! 8
సర్వేపిదైవతగణా నరజంతు సంఘాః స్యుస్త్వాః కళాజగదీశ్వరస్య
యోగీశ! సంప్రతి జగద్గురు లక్షణస్త్వం, శ్రీరామకృష్ణగురుదేవ! నమోనమస్తే!

ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

## దక్షిణేశ్వరమున భక్తులతో శ్రీరామకృష్ణ గురుదేవుడు

శుక్రవారము

14 డిసెంబరు, 1883.

సుమారు ఉదయము తొమ్మిదిగంటలయినది. శ్రీరామకృష్ణగురుదేవుడు తనగదికి ఆగ్నేయపువసారాయందు నిలుచుకొని యుండెను. రామలాల్ శ్రీవారియొద్ద నిలుచుకొని యుండెను. రాఖాల్, లాటు, శ్రీవారి సమీపముననే యటునిటు పచారుచేయుచుండిరి. ఆసమయమున శ్రీరామకృష్ణులవారికి 'మ.' వచ్చి సాష్టాంగప్రణామముగావించెను.

శ్రీరామ:—వచ్చితివా! అట్లయినచో ఇది మిగుల సుదినము, వీరు ('మ.') కొన్నాళ్లు భగవానునియొద్దనుందురు, సాధనలు గావింతురు. కొన్నాళ్లు సాధనచేసినచో భగవంతుడు వీరికి సరియైన మార్గమును జూపును.

కొన్నాళ్లకుమునుపు 'మ.' తో శ్రీరామకృష్ణగురుదేవు డిట్లు చెప్పియుండెను: 'నీ విక్కడ అతిథిశాలయం దన్నము ప్రతిదినము పుచ్చుకొనరాదు. అది సాధువులకొఱకు బిచ్చగాండ్రకొఱకును ఏర్పఱచబడినది. నీకు వండిపెట్టుటకు నెవరినైన కూడ దీసికొనిరమ్ము' అందువలన 'మ.' తో వంటమనిషికూడ వచ్చియుండెను. వంటచేసికొనుటకు స్థలమును పాలనొసగుటకు పాలవానిని ఏర్పాటు చేయమని శ్రీరామకృష్ణులవారు రామలాలున కాదేశించిరి.

కొంతసేపటికి రామలాలు అధ్యాత్మరామాయణము చదువదొడగెను. శ్రీరామకృష్ణగురుదేవుడు, 'మ.' వినుచుండిరి:

"శ్రీరామచంద్రుడు సీతను వివాహమాడి అయోధ్యాపురికి వచ్చుచుండెను. మార్గమున పరశురాముని కలసికొనెను. శ్రీరాముడు హరధనుస్సు విఱచుటనువిని భార్గవుడాతని కష్టపెట్టదలచెను. దశరథుడు మిక్కిలి చింతాగ్రస్తుడయ్యెను. అంతట పరశురాముడు మరియొకధనుస్సు విసరి దీనికి గుణమును సంధింపుమనెను. శ్రీరాముడు చిఱునవ్వునవ్వి ఎడమచేతితో విల్లునుబట్టి గుణమును సంధించి బాణమునుబట్టి 'దీని నెందు ప్రయోగింపమందు' వని యడిగెను. పరశురాముని గర్వమణగెను. అతడు శ్రీరాముని పరబ్రహ్మముగా దెలిసి స్తుతింప నారంభించెను." ఈ స్తోత్రమును వినినంతనే శ్రీరామకృష్ణగురుదేవుడు భావావిష్టుడయ్యెను. అపుడపుడు 'రామ్, రామ్' అని అత్యంత మధుర కంఠస్వరముతో బలుకుచుండెను.

పిదప శ్రీగురుదేవుడు రామలాలునుజూచి 'గుహుని వృత్తాంతమును జదువు'మనెను.

శ్రీరామచంద్రుడు పితృవాక్య పరిపాలనార్థము వనమునకు బయలుదేరి పయనించుచుండ గుహుడు చకితుడయ్యెను. అతనికన్నులవెంట నీరు ప్రవహించెను. కొయ్యబొమ్మవలె నిచ్చేష్టుడయ్యెను. పిమ్మట రామచంద్రుని సమీపించి తనయింటికి ఆహ్వానించెను. శ్రీరాముడతనిని ప్రేమతో ఆలింగనముచేసికొనెను. గుహుడు శ్రీరామచంద్రునకు ఆత్మసమర్పణము గావించుకొని యిట్లు విన్నవించెను:

'నీవు నావాడవు. నీకు నాప్రాణము, ధనము, రాజ్యము సమస్తము సర్పించితిని. నీవే నా భక్తివి,ముక్తివి. నా శుభకార్యమవుగూడనీవే. నీకు నా శరీరమునుగూడ సర్పించితిని.

శ్రీరామచంద్రుడు పదునాలుగేండ్లు జటావల్కలధారియై కందమూలములనే తప్ప మరి దేనినీ భుజింపడయ్యె. పదునాల్గుసంవత్సరముల యనంతరము రాముడింకను రాకపోవుటవలన గుహుడు అగ్నిప్రవేశముచేయ నిశ్చయించెను. ఆసమయమున హనుమంతుడువచ్చి శ్రీరామచంద్రునిరాకను దెలిపెను. ఈ పలుకువిని గుహుడు మహానందమునందెను. కొంతసేపటికి శ్రీరామచంద్రుడు సీత — పుష్పకవిమానమున వచ్చిరి.

"దయాళువు పరమానందపు ప్రేమాధీన రామచంద్రుడు భక్తవత్సలగుణధాముడు నయిన శ్రీరామచంద్రుని జూచి ప్రేమభక్తశ్రేష్ఠుడు గుహుడు పులకాంకితుడయ్యెను. గాఢాలింగనము చేయునపుడు ప్రేమాశ్రువులతో శ్రీరామచంద్రుని శరీరమును తడిపెను. నలుదిశల జయజయ నినాదములు విన వచ్చెను."

మధ్యాహ్నభోజనానంతరము శ్రీరామకృష్ణ గురుదేవుడు కొంచెము విశ్రమించెను. ఈ సమయమున డాక్టర్ శ్యాము, మరికొందరు అక్కడకు వచ్చిచేరిరి. శ్రీరామకృష్ణగురుదేవుడు వారితో సంభాషింప మొదలిడెను.

శ్రీరామ :— కర్మ ఎల్లప్పుడును చేయనవసరములేదు. ఈశ్వరదర్శనానంతరము కర్మ తనంతట నదియే సమాప్తమగును. కాయ తయారయిన పిదప పువ్వుయొక్క ప్రయోజనములేదు. అది తనంతటనే రాలిపోవును.

ఎవనికి భగవద్దర్శనమయినదో వాడు సంధ్య గూడ వార్వ నవసరములేదు. సంధ్యావందనము గాయత్రియందు లయించును. అప్పుడు గాయత్రీజపమే చాలును. ఆగాయత్రి ఓంకారమున లయించును. అపుడు గాయత్రీజపము గూడ అనవసరము. ఓంకారోచ్చారణమే చాలును. ఆహ్నికకృత్యము లెన్నాళ్లు? హరినామము లేక రామనామజపమునందు పులకాంకితుడుగాని యంతవఱకే. ధనోపార్జనము కొఱకో లేక వ్యాజ్యెములందు జయించుటకొఱకో పూజచేయుట మంచిదికాదు.

ఒక భక్తుడు:— అందఱు ధనముకొఱకే పాటుపడుచున్నట్లు చూచుచున్నాను నేను. కేశవచంద్రసేనుడు తనకుమార్తెనురాజుగారి కిచ్చి వివాహము చేయింపలేదా?

శ్రీరామ:— కేశవునివిషయము వేఱు. నిజమయినభక్తి డేప్రయత్నమును జేయకపోయినను భగవానుడతనికొఱకు సమస్తమును సిద్ధము చేసియుంచును. రాజకుమారుడు అడుగకపోయినను అతనికి ప్రతిమాసము సొంత ఖర్చులకు ధనమొసగబడును. ధనసముపార్జనార్థము పాటుపడుచున్న ఉద్యోగస్తులమాట నేను చెప్పుటలేదు. సరియైన రాజపుత్రుని విషయమే చెప్పుచున్నాను. సరియైన భక్తునకు కోరికలేయుండవు. అతనికి వలయునవన్నియు తమంతట తామే లభించును. భగవద్గీతయందు 'యదృచ్ఛాలాభుడు' అని చెప్పబడియున్నది.

సద్బ్రాహ్మణుడు, కామనారహితుడునగు వాడెట్టి యవస్థయందయినను సంతుష్టుడుగనే యుండును.

ఒకభక్తుడు:— చిత్తము. సంసారమునందెట్లుండవలయును?

శ్రీరామ:— బురదలోని చేపవలెనుండి, సంసారమునువిడిచి దూరముగానుండి కొన్నాళ్లు

నిర్జనస్థలమున భగవద్ధ్యానము గావించిన భక్తి జనించును. అపుడు అతడు నిర్లిప్తుడై యుండ గలడు. బురదలోనున్నను చేపకు బురద అంటు కొనదు. ఇట్లు భక్తుడు అనాసక్తుడై సంసార మున నుండగలడు.

'మ.' తనపలుకులను గమనించివినుటను గ్రహించి శ్రీగురుదేవుడిట్లుపలుక నారంభిం చెను. తీవ్రవైరాగ్యముకలిగిననే భగవానుడు లభించును. సంసారము దావానలమువలె జ్వలించును. స్త్రీపుత్రాదులు పాడుపడ్డ బావి వలె గనుపింతురు. అట్టివైరాగ్యము కలిగిన యెడల నతడు గృహమును త్యజించును. అనా సక్తుడైయుండుట మాత్రమే కాదు, కామినీ కాంచనములే మాయ. ఎవరైనను మాయను సరిగా గుర్తించినచో అది వారినుండి పలాయన మగును. పులితోలు గప్పుకొని యొకడు భయ పెట్టుచుండెను. తాను భయపెట్టుచున్న వ్యక్తి 'ఇకచాలు నీవెవరవో నే నెఱుగుదునులే. నీవు మాహరివిగదా' అన్నంతనే ఆ వ్యక్తి వానిని వదలి మరియొకనియొద్దకు బోయెను.

స్త్రీలందరును శక్తిస్వరూపిణులే. ఏది ఆది శక్తియో అదియే స్త్రీరూపిణియై యున్నది. ఆధ్యాత్మరామాయణమున నిట్లున్నది: 'శ్రీ రాముని నారదాదులు స్తుతించుచు 'ఓ రామా! పురుషులందరును నీవు. ప్రకృతి యెన్నిరూప ముల ధరించినదో ఆరూపములన్నియు సీతయే ధరించినది. నీవింద్రుడవు, సీత ఇంద్రాణి. నీవు శివుడవు సీత శివాణి, నీవు నరుడవు సీత నారి. మరి ఇంకేమిచెప్పవలయును? పురుషు డున్నచోటంతయు నీవు. ఎచ్చట స్త్రీయో అచ్చటంతయు సీతయే.'

(భక్తులతో) మనము తలచుకొన్నచో సమస్తమును త్యజింపజాలము. ప్రారబ్ధము, సంస్కారములు— ఇవన్నియునున్నవి గదా! ఒకయోగి ఒకరాజుతో నిట్లు చెప్పెను. 'నీవు నాదగ్గర కూర్చొని భగవంతుని ధ్యానింపుము' అంతటరాజు 'అవన్నియుజరుగవు. నేనునీదగ్గర కూర్చొనవచ్చును, కాని అనుభవనీయము లగు నాభోగము లింకనుగలవు. అడవిలో నున్నను అచ్చటను రాజుగావచ్చును. నాకిం కను భోగేచ్ఛగలదు.'

నటవరపాండ్యా చిన్నప్పు డొకతోటలో ఆవుల మేపుచుండెను. కాని అత డెన్నియో భోగము లనుభవింపవలసియుండెను. అతడు పెద్దవాడయినపిదప ఆముదపుగానుగ పెట్టి ఎంతో డబ్బు సంపాదించి, చివరికి ఆలంబజా రులో పెద్ద వర్తకుడయ్యెను.

ఒక మతానుసారము స్త్రీలతోగూడి ఆధ్యా త్మిక సాధనలు చేయవచ్చునని యున్నది. కర్తాభజులు వారి స్త్రీలమధ్యకు నన్ను దీసికొని పోయిరి. వారందరు నా చుట్టును గూర్చొనిరి. వారందఱను 'తల్లీ తల్లీ' యని పిలువ నారం భించితిని. అపుడు వారు నన్నుజూచి 'ఈయన ప్రవర్తకుడు. ఈయన కింకను దారితెలియ లేదు' అని చెప్పుకొనిరి. వారి మతానుసారము ప్రవర్తకుడు ప్రారంభదశలోనివాడు. అటుపై సాధకుడు. తరువాత సిద్ధుడు. అటుపిమ్మట సిద్ధు లలో సిద్ధుడు. ఒక స్త్రీ వైష్ణవచరణునియొద్దకు బోయి కూర్చొనెను. దానినిగూర్చి పిమ్మట అతని నడుగగా అత 'డా స్త్రీ బాలికాభావము గలది' అని చెప్పెను.

భార్యా భావమున మనుష్యుడు పతనము నందును. మాతృభావమే శుద్ధభావము.

అచటికి వచ్చిన భక్తులు కొందరు కాళికా దేవిని ఇతర దేవుళ్లను జూచివచ్చెదమని చెప్పి వెళ్లిపోయిరి.



# నిశ్శ్రేయసము

శ్రీ రామకృష్ణదాసు

శ్రీ రామానుజులు గురువువద్ద రహస్యమంత్రోపదేశం పొంది, వెంటనే ఎత్తైన గోపురమెక్కి విన్నవారందరికీ ఆ మంత్రాన్ని ఘట్టిగా ఉపదేశించారట. అలాంటి గోపురమే ఎక్కి, అంత ఘట్టిగానూ చాటవలసివస్తే నేననేదిది: "ఉన్నాడు. పరమేశ్వరుడున్నా"డని. "నువ్వు చూశావా?" అని అడుగుతారా? లేదు. ఇంతవరకూ చూడలేదు. అయితేనేం? నేనే చూడాలా? చూచినవారెందరో మహానుభావులు—ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుకశౌనక ఋషీశ్వరులూ; దర్శనకారులూ; ఉపనిషద్దేశికులూ; జీససు, జొరాస్టర్, మహమ్మద్, నానకు ప్రవక్తలూ; నాగార్జున, శంకర, రామానుజ, మధ్వగురుశ్రేష్ఠులూ; అప్పర్, తిరుజ్ఞానసంబందర్, కబీర్, రామానంద, చైతన్య, రామకృష్ణ పరమహంసులూ; రామదాస, పురందర, దీక్షిత, శ్యామశాస్త్రి, త్యాగరాజాది వాగ్గేయకారులూ—కీర్తించి చెప్పినారే! వారిసాక్ష్యము చాలదూ? మనము నమ్మే ఏ విషయానికి మాత్రము ఇంతమంది సాక్షులున్నారు? వారు సూచించిన దారుల్లో సాగిపోయినట్లయితే మనముకూడా పరమేశ్వరుని ప్రత్యక్షముగా చూడగలమనడములో పొరపాటేమిటీ? మరి అయితే వారు చూచిన పరమేశ్వరుడున్నాడనడానికి సందేహమెందుకూ?

సందేహం లేదు. "ఉన్నాడు. పరమేశ్వరుడున్నాడు." "ఇప్పుడు మళ్లీ ఎందుకంటున్నావూ? ఇంకా క్రొత్త సాక్ష్యము ఏది దొరికిందీ?" అని అడుగుతారా? చెప్తున్నా. వినండి. దివ్యదర్శనం పొందినవారి అనుభవాలు—వారు వర్ణించినవే—పోల్చిచూస్తే అవన్నీ ఒక్కలాగున్నాయి. ఇంతకంటె బలమైన సాక్ష్యమేముంటుందీ? చిత్తగించండి రామకృష్ణస్వామి సాక్ష్యము. "ఒకనాడు మరీ మరీ కుంగిపోయాను. ఇక జగన్మాత దర్శనము కాదనుకున్నాను. ఈ జన్మకు ఆ అమృత గడియలు లేవుగాబోలనిపించింది. అకస్మాత్తుగా దేవి హస్తములోని ఖడ్గముమీద దృష్టిపడింది. ఆ కత్తితో ఈ వృథాజీవితాన్ని ముగించవచ్చుననే ఊహ మెరుపులాగ తగిలింది. ఒక్క ఉదుటున ఆ కత్తి పట్టుకున్నాను...దృశ్యమాన ప్రపంచమంతా,—ద్వారాలూ, కిటికీలూ, దేవాలయమూ అదృశ్యమైపోయినై. సర్వమూ మాయమైపోయింది. దానికి బదులు అనంతమూ, దీప్తివంతమూ అయిన చైతన్యసముద్రము కనబడింది. ఏవంక చూచినా ఉత్తుంగ కాంతితరంగాలే లేస్తున్నాయి. గంభీరఘోషముతో నన్ను ముంచెత్తడానికి మీదమీదకి వచ్చాయి. క్షణంలో నామీదే విరిగి నన్ను ముంచేశాయి. నాకు ఊపిరి ఆడలేదు. బాహ్యస్మృతి నశించిపోయి పడిపోయినాను. ఆనంద

సాగరము నా చుట్టూ తరంగితమైంది. అంతరాంతరాలలో జగన్మాత దివ్యస్ఫురణ నిండిపోయింది'' అని చెప్పారు రామకృష్ణస్వామి.

థెరిస్సా యోగినికి కూడా యిక లాభము లేదని నిరాశచేసుకున్న ఘడియలలో ఇలాంటి ఉప్పెనే కనబడిందిట. బ్రహ్మాండమైన వెల్లువ—అదృశ్యమహాశక్తి దండయాత్ర, సరిగ్గా ఇటువంటి సముద్రమే—ఆమెనుకూడా ముంచెత్తింది. ఆ తరువాత సాల్సెడో, ఊజాల బండబలవంతమువల్ల ఆమె——ఎంత బాధపడుతూనేనా——పరమాత్మను జీససుయొక్క శరీరములో బిగించుకోవలసివచ్చింది.

దివ్యదర్శనము కాంతివెల్లువలాగు కనబడడముకూడా పురాతనానుభవమే. ప్రెసిడెంటు ఫిన్నీ పొందిన దర్శనమును గురించి చెప్తాడు జోన్సు: ''అది కరిగిన ప్రేమతరంగాలుగా మీదపడినది. ఈ కెరటాలు నామీదనించి, ఇంకా మీదనించి, ఇంకా మీదనించి, ఒకటి తరవాత ఒకటి వచ్చి ముంచెత్తినయ్...''

నాకు చూడగా ఈ సముద్రము మన పురాణాల్లోని క్షీరసాగరమే అనిపిస్తోంది. అది పాలసముద్రము కాదు. చైతన్యకాంతిసముద్రమంటాను. చరిత్రలనే ఉన్నది వున్నట్టుగా లిఖించక ఆలంకారికముగా ప్రచారముచేసిన ప్రాచీన భారతీయులు దివ్యదర్శనమును పాలసముద్రముగానూ, అందున్న (ట్లుగా వారు నిర్మించుకున్న) భోగీంద్ర భోగమణిరాజిత పుణ్యమూర్తిగానూ వర్ణించినారంటే వింత ఏమున్నది? పురాణోక్త క్షీరసాగరము పరమాత్మదీప్తితరంగితానందసముద్రమే నంటాను. ఎందరో మహానుభావులు దీనిని దర్శించినారు. ఇది నిత్యము, సిద్ధము, అనుభవైకవేద్యము.

గురుమహారాజు సచ్చిదానందసాగరమును దర్శించి తృప్తిపడి ఊరుకోలేదు. సనకసనందనులూ, నారద అంబరీషులూ, శ్రీ రామానుజులూ సాధించిన సవికల్పకసమాధిని తరించి ఆయన పైమెట్టుకెక్కి నిర్వికల్పసమాధిని పొందినారు. వినండి ఆయన మాటలు: ''నా మనస్సును, అన్ని బంధాలూ తెంపి ఆత్మలో లీనము చెయ్యమన్నాడు దిగంబర గురుస్వామి తోతాపురి. తక్కినరూపాలన్నీ సులువుగా తోసివేసినాను. కాని ఉజ్జ్వల నీలదేహ జగన్మాతృ సుందరరూపము మాత్రము నా కంటికెదురుగా నిలిచినప్పుడు నేనశక్తుడనైపోయినాను. అన్నానుగదా ''స్వామీ! ఇక లాభములేదు. ఇది వృథాప్రయాస. మీరు చెప్పే నిర్గుణబ్రహ్మమును నేను గుర్తించలేను'' అని. ఆయన నన్ను వదలిపెట్టలేదు. ''ఏమన్నావు? చేతకాదనా? నువ్వు చేసితీరాలి'' అని చుట్టూ చూసి ఒక గాజుముక్కను తెచ్చి, నా భ్రూమధ్యమునగుచ్చి 'ఈ బిందువుమీద మనసు నిల్పు' మన్నాడు. నా శక్తినంతటినీ కూడదీసుకుని మనస్సు నిలిపాను. జగన్మాత సుందరరూపము ఎదుట నిలిచినప్పుడు నా వివేకమును ఖడ్గముగా ఉపయోగించి రెండుగా నరికినాను. ఆఖరి అడ్డు తప్పుకున్నది. సగుణతలమునుండి జారి ఆత్మ నిర్వికల్పసమాధిని చేరినది'' అని గురుమహారాజు సాక్ష్యము. ఈ కడపటి విగ్రహధ్వంసమెంత యుదాత్తము?

థెరిసా పరమాత్మను బైబిలు వర్ణించిన జీసస అల్పశరీరములో ఇముడ్చుకున్నట్లే భారతీయ సిద్ధపురుషులూ, పరమభక్తులూ, పరమాత్మను కవులు వర్ణించిన భోగీంద్రభోగమణిరాజిత పుణ్యమూర్తిలోనో, సాయంకాలనటన్మహానటవిద్యుమ్మూర్తిలోనో ఇముడ్చు

కున్నారు. ఇష్టదైవమనే సుందరవాతాయనము లోనుంచి అనంతుని విశ్వవిభూతిని గుర్తించినవారు, ఎందరో మహానుభావులు, తమ పరమానుభవాన్ని మళ్లీ మళ్లీ పొందడానికి ఆ పరమరూపమునే మోడ్పుకరములతో శరణు జొచ్చినారు. శ్రీ రామానుజులవలె భక్తకోటికి ఆ రూపమునే పరమగమ్యముగా కేలెత్తి చూపినారు. అంతమట్టుకది న్యాయమే. రామకృష్ణులకు తోతాపురివలె రామానుజులకు శంకరులు తారసిల్లియుంటే?—ఇరువురూ దర్శించిన భోగీంద్రభోగమణిరాజిత పుణ్యమూర్తి నావరించియున్న బృహదాత్మానందసముద్రమును గుర్తించి సగుణతలమునుండి జారి నిర్వికల్ప సమాధిని చేరకుందురా?

గురుమహారాజు నిర్వికల్పసమాధిని అనుభవించీకూడా తోతాపురివలె మాయామోహవిదగ్ధులైన జనసామాన్యమునకు దూరమైపోక తిరిగి సగుణబ్రహ్మారాధన జరిగే భజనలో చప్పట్లు చరిచినారు. "బ్రహ్మమనే కలకండకొండనుచేరి నోటికందినంత ముక్కను కరిచి పట్టుకుపోతూ బ్రహ్మమును పూర్తిగా తెలుసుకున్నామనుకుంటారు ఎందరో! ఎంత అసందర్భమూ?" అని నవ్వుకుని రామకృష్ణులు కాళీమాతద్వారానే కాక సిద్ధులు పూర్వము అవలంబించిన మార్గాలన్నిటిద్వారాను బ్రహ్మను తెలుసుకోవాలని సమకట్టినారు. క్రైస్తవుల పద్ధతీ, మహమ్మదీయుల పద్ధతీ కూడా ఆయన సాధకముచేశారని వింటాము. దివ్యమార్గాలన్నిటా నడచి ఈ వింత బాటసారి కలకండకొండ రుచిని పెక్కువిధాల రుచిచూచినారు. ఈ దివ్యానుభవాలకోసమే రామకృష్ణులు కొంచెపాటి 'నా'త్వమును మిగుల్చుకొని లోకసంగ్రహము చేసినారు.

ఈ దశలో స్వామి ఉపదేశాలు దివ్యదర్శనముచేసి సారూప్యతనందిన సిద్ధుని ఉపదేశాలలాగ కనపడతాయి. నిర్గుణబ్రహ్మమునుగురించి ఆయన ఎక్కువగా చెప్పలేదు. మీదుమిక్కిలి "నిప్పూ దహనశక్తీ వలెనే బ్రహ్మమూ శక్తీ ఒక్కటే. పాలూ తెలుపూ వలె బ్రహ్మమూ శక్తీ వొక్కటే. రత్నమూ ప్రకాశమూ వలె బ్రహ్మమూ శక్తీ వొక్కటే" అని ఈ సంతత యాత్రికుని ఉపదేశము. అవసానదశలో మాత్రము పరమహంసస్వామి నావరించియుండిన 'నా'త్వపు ఘటము బీటలువారినది. కంఠములో రణములేచి ఆహారమేదీ తీసుకోడానికి వీలుదొరకని కష్టసమయములో "ఆహారము తీసుకునేందుకు వీలుకలగజేయమని జగదంబను కోరరాదా?" అని బ్రతిమాలే శిష్యులతో ఆయన అన్నమాటలు: "'ఇన్ని నోళ్లద్వారా తింటున్నావు చాలదా? ఆ వొక్కనోటితో తినకపోతేనేమి?' అంటుంది అమ్మ." ఈ సర్వభూతాత్మసమత్వము స్వామిలో చివరిరోజులలో వేయిదళాలుగా విరిసిపోయింది. ఉప్పుబొమ్మ తాను వేయిదారుల్లో నడిచి చూచిన సముద్రపులోతు నెరుగుటకు మునిగినది, 'నా'త్వపు ఘటము భగ్నమై జీవాత్మ పరమాత్మతో ఏకమైనది. ఇది నిశ్శ్రేయసము. జీవితానికి పరమగమ్యమిది. మనమంతా నడవవలిసినది దీనివైపు.



# శ్రీ రామకృష్ణ పరమేశ్వరుడు

శ్రీ దేవరకొండ నారాయణశాస్త్రి

(గతసంచిక తరువాయి)

ఇక, శ్రీ రామకృష్ణుడు సర్వాశ్రమీయులకును అనుసరింప దగిన మాదిరి పురుషుడని చెప్పబడియెనే, ఊర్ధ్వ రేతస్కుడగు ఆయన నడవడిని గృహస్థులు ఆదర్శముగ స్వీకరించుటయెట్లు? 'అస్ఖలిత బ్రహ్మచర్య వ్రతులై మోక్షమార్గమున ఒకరి కొకరు సహాయ భూతులై భగవచ్చింతా పరాయణులై మనుటయే దంపతుల మహోచ్చాదర్శము.' అని శ్రీశారదా రామకృష్ణులు తమ ఆచరణ మూలమున లోకమునకు బోధించియుండుట నిజమే. మహాగృహియగు శ్రీ నాగమహాశయుని వంటి వారును ఈగృహస్థ ధర్మ విశేషమును అనువర్తించి యుండినట్లు తెలియవచ్చు చున్నది. కాని యీ గృహస్థాదర్శము గృహవ్రతులెల్లరును పాటింప దగిన దని యంగీకరించుటకు ఎన్నియో సంశయములు అడ్డము వచ్చుటయు నిజమే. ప్రధాన సందేహమిది: ఈగృహస్థ ధర్మావలంబనమున "ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః" ప్రజోత్పత్తి పరంపరను ఛేదింపవద్దు" అను ఉపనిషదాదేశము పరిపాలింపబడదే? దీనికి మా సంక్షిప్త సమాధానమిది: పై ధర్మాదేశము ఏయుపనిషత్తు నందుగలదో, ఆ యుపనిషత్తునందే యిట్లుగూడ ఉపదేశింపబడినది: "యది తే కర్మవిచికిత్సా వా వృత్త విచికిత్సా వా స్యాత్, యే తత్ర బ్రాహ్మణా స్సమర్శినః...ధర్మ కామాస్యుః యథా తే తత్ర వర్తేరన్, తథా తత్ర వర్తేథాః, ... యథా తే తేషు వర్తేరన్, తథా తేషు వర్తేథాః" "మీకు ఏ సందర్భములలోనైన ధర్మసందేహము కలిగెనేని అట్టి సందర్భములలో విచారశీలురు ధర్మకాములు నగు బ్రాహ్మణులు ఎట్లు ప్రవర్తింతురో మీరును అట్లే ప్రవర్తింపుడు." (తైత్తిరీయోపనిషత్తు. శిక్షావల్లి. 11 వ అనువాకము.) కాబట్టి శ్రీరామకృష్ణునివోలె—శ్రీ నాగమహాశయునివగిది—వివాహితులయ్యు అఖండ బ్రహ్మచర్య పరిపాల నేచ్ఛులు—అకామ స్వభావులు - * వారివలెనే వర్తించుట అధర్మము కానేరదు కదా. మఱియు శ్రీరామకృష్ణ నాగమహాశయుల వంటి బ్రహ్మజ్ఞుల ప్రవర్తనము ఉత్తమ ధర్మ సంయుక్తమైన దనియే తీర్మానింప బడవలయును. ధర్మశాస్త్ర కారులకు గూడ మహాత్ముల యాచరణయే ప్రమాణమని వాదించు విబుధులునుకలరు. "మహా జనోయేన గతాస్స పంథా" "మహనీయులు ఏ మార్గమున బోయిరో, అదియే అనుసరణీయమగు ధర్మ

* శ్రీ నాగమహాశయుడు జన్మముచే బ్రాహ్మణుడు కాకున్నను, "య ఏతదక్షరం గార్గి విదిత్వాఽస్మాల్లోకాత్ ప్రైతి స బ్రాహ్మణః" (బృహదారణ్యక) అను యాజ్ఞవల్క్య ప్రవచనమునుబట్టి యతనిని బ్రాహ్మణుడని భావింపవచ్చును.

పంథ" అనియు ఆర్య నిర్ణయము కలదు. శ్రీశారదా రామకృష్ణుల దాంపత్యాదర్శమును ధీరప్రకృతి కలవారు మాత్రమే పూర్తిగ పాటింప గలరుకాని, వారిని ఆదర్శముగ ఎన్నుకొనినంత మాత్రమున అందఱును వారి అసిధారోపరిగమనమును అనుకరింపజాలరు. "ఆదర్శమును పాటించువాడు వేయితప్పులు చేసినయెడల, ఏ యాదర్శమును లేని వాఁడేబది వేల తప్పులు చేయునని నేను నిశ్చయముగా జెప్పగలను" అని శ్రీవివేకానంద మస్కరీంద్రుడు వచించినట్లు, గేస్తులు శ్రీ శారదారామకృష్ణులను ఆదర్శముగ గ్రహించుట తమ తప్పులను తగ్గించుకొనుటకు బాగుగ ఉపకరింపగల్గదు. ఆమధ్యలో దైవానుగ్రహ మున్నచో "ప్రజాతంతుం..." అను ధర్మ పరిపాలనము కూడ జరిగి, "ఒకరిద్దరు సంతానము కలుగగనే భార్యయు మీరును సోదర భావముతో జీవింపవలయును" అని శ్రీ రామకృష్ణులవారు మాటలచే దెలిపిన గృహస్థాదర్శమును పూర్తిగా అనువర్తించు సమర్థత లభింపవచ్చు. శ్రీ వారి కఠోర బ్రహ్మచర్య వర్తనమునటుంచి, యితర విషయములలో వారు సహధర్మిణి పట్ల వహించినవైఖరి అతి సామాన్య గృహస్థులు సైతము అనుసరింప దగినది. అర్థాంగియెడగల వారి సముత్కట ప్రేమమును శ్రీ శారదాదేవి చరిత్ర వేనోళ్ల దెలుపుచున్నదికదా.

ఇక శ్రీ రామకృష్ణ ప్రభావమును గూర్చి కొంచె మరయుదము. శ్రీరామకృష్ణ మహాదేవునకు ఆత్మసమర్పణ మొనర్చియు శ్రీ గిరీశ చంద్రుడు తన మునుపటి పాపవృత్తులను స్మరించి దుఃఖాక్రాంతుడై కలవర పడుచుండ ఆ భగవానుడు "ఓయీ, మతిహీనుడా! నిన్ను పట్టుకొనినది బురద పామనుకొను చుంటివా? కాదది విషసర్పము. పరుగెత్తి నీవింటికి పోయినను మరణింప వలసినదే." అని అంతరార్థగర్భితముగా బలికియుండెనట. అది నిక్కము. త్రాచుపాముయొక్క కాటుపడి దాని విషమెక్కినచో జీవునకు స్థూలశరీరమునుండి మాత్రము విడుదల కావచ్చును. శ్రీరామకృష్ణ కృష్ణసర్పముయొక్క కాటుపడి తద్విషమెక్కనేని, జీవుడు అనేక యుగముల పర్యంతము తన్ను వెన్నంటి తిరుగు సూక్ష్మకాయమునుండి విడువబడి తన సహజ సర్వగతత్వమును * గురుతించును. శ్రీరామకృష్ణ కృప ప్రసరించిన వారికి ప్రథమమున లభించునది భగవత్పరితాపము – లేక భగవదున్మాదము. అదియే శ్రీరామకృష్ణుడు అను నాగుబాముయొక్క విషము. దాని ప్రభావము అనిర్వాచనీయము. అది యధికము గలవాడు ఏసాధనయు జేయనక్కఱలేదు. అన్ని సాధనలును అందే యిమిడియున్నవి. ఆదుర్భర విషము సర్వదేహమునను వ్యాపించి బాధపడుచున్న వాని దివ్యసన్నిధికి భగవంతుడే పరుగెత్తివచ్చి వానిని గాఢాలింగన మొనర్చుకొని పరమానందమయుని జేయగలడు. అట్టి మహాభాగ్యమును బ్రసాదించు ఆ సర్వారాధ్యుని యొక్క–ముక్తడగు వఱకు తన భక్తుని విడువని పరమ ప్రేమ

* "నిత్య స్సర్వగత స్థాణు రచలోఽయం సనాతనః" అను గీతావచనమున 'అయః' అను పుంలింగ సర్వనామము వెనుకటి 22 వ శ్లోకమునందలి "దేహీ" అను పదమునకు సంబంధపఱచబడి 'జీవేశ్వరైక్యసిద్ధాంతము' స్పష్టీకరింపబడినది.

మూర్తియగు శ్రీరామకృష్ణ దేవునియొక్క — మాహాత్మ్యమును సాంతముగ నెవరెఱుగగలరు? ఆతని మహత్త్వమును అతడు మరణావస్థలో నున్న సమయమున గూడ పరిశీలించిన యాతని ప్రియతమ శిష్యుడు ఇట్లు పల్కియున్నాడు: "రామకృష్ణపరమహంస కంజలి ఘటించు వారా క్షణముననే దివ్యులై వెలయుదురు." ఆ పురుషోత్తముని సంబంధముగల గ్రంథములు సహితము మహామహిమాన్వితములై యున్నవని క్రింద దెలుపబడు వృత్తాంతములవలన గ్రహింపవచ్చును: సుమారు ఇరువదిమూడు సంవత్సరములుగల ఒక యువకుడు శ్రీ రామకృష్ణ వివేకానంద గ్రంథావళిని చదువుట సంభవించెను. 'శ్రీ రామకృష్ణ ప్రభ' అతనికి సోకుటచే గాబోలు వెంటనే అతని మనస్సు మార నారంభించెను. అప్పుడప్పు డతడు శ్మశానమున కరిగియు ధ్యానప్రార్థనలు సలుపుచుండినట్లు తెలియవచ్చుచున్నది. శ్రీ రామకృష్ణ గురుదేవుడు 'హోమపక్షి' దృష్టాంతముతో వచించియున్న విషయము అతని హృదయమున గాఢముగ నాటుకొనెను. అతడు సన్న్యసింపదలచెను. కాని అప్పటికి సంవత్సరము క్రితమే పెండ్లియైయుండి భార్య కాపురమునకువచ్చి యేడెనిమిది నెలలు మాత్రమే యైయుండెను. పదునాలేండ్ల వయస్సుగల అతనిభార్యకూడ సుశీలయు భక్తియుక్తయు నైయుండెను. "నిరపరాధియైన ఆ సుగుణవతిని వీడి ఆమె జీవితమును దుఃఖమయము గావించుట ధర్మమా? అయ్యో! నేనేల పెండ్లి చేసికొంటిని?" ఇట్టి ఆలోచనలతో అతని హృదయమున పెద్ద కలత రేగెను. అప్పుడతడు "సంసారము త్యజింప నిశ్చయించుకొన్నా"ననియు "అది పాపకృత్యమా కాదా?" అనియు ఒకరిద్దరి మిత్రులతో యోచించినాడు. అంతట ఆ వార్త ఆనోట ఈనోట బడి ప్రాకిపోయి ఆ యూరంతయు వ్యాపించెను. అతని స్నేహితులు, హితాభిలాషులు ఒకరొకరు వచ్చి అతనికి బుద్ధిచెప్ప దొడగిరి. ఆ సందర్భమున అపుడపుడు వా రుభయులును ఒకరిపై నొకరు 'ఏకాక్షర ప్రయోగములు' చేయుటయు సంభవించినది. బుద్ధి చెప్పవచ్చినవారి ఏకాక్షరము 'ఛీ'. అతనిది 'థూ'. హితోపదేశపరంపరలచే అతడు విసిగి కొంచెము వేదాంతము నెఱిగిన యొక బంధువునకు తాను నిశ్చయించుకొన్న కార్యముయొక్క ధర్మాధర్మముల నిర్ణయము నభ్యర్థించుచు ఒక యుత్తరము వ్రాసెను. కొన్ని కారణములచే ఆ బంధువు సమాధానమీయలేదు. ఎట్లో అతడే సమాధానపడి తనయింటిలో ఒక భాగమున అడ్డగోడ గట్టించి గదిగాజేసి, అందు ఒక పెద్ద కాళీమాత పటమును కోదండరాముల పటమును తెచ్చియుంచి, వానికి పూజాదుల నొనర్చుచుండెను. అతడు, అతనిభార్య, అతని తల్లి, ఈ ముగ్గురే అతని కుటుంబమున గల వారు. ఆ యింటి కతడే యజమాని. ఎవ్వరైనను తనకోసము వచ్చి అడిగిన ఇంటిలో లేడని చెప్పుడని భార్యతోను, తల్లితోను చెప్పి, తలుపులువైచుకొని ఆ గదిలో గూర్చుండి ధ్యానప్రార్థనలు, ఆధ్యాత్మిక గ్రంథపఠనము, రామకోటి లేఖనము, వీనితో అతడు దినమున చాలకాలము గడపుచుండెను. ‡ ఏడెనిమిది మాసము లిట్లు జరిగిన పిమ్మట ఒకనాడు ఏ యుద్దేశముచేతనో అతడెవ్వరికిని చెప్పక వారణాసికి వెడలెను. మార్గమధ్యమున గనబడిన యొక స్వగ్రామవాసికి 'నేను కాశికి

‡ ఈ యుదంతమునందలి కాలపరిమాణము అంచనాగా తెలుపబడినది.

పోవుచున్నా'నని యతడు తెలిపియుండ ఆ సంగతి తెలిసి అతని తల్లియు భార్యయు దుఃఖించుచుండిరి. భగవంతు డతని బుద్ధిని మరలించుటచే అతడు కాశీ గయా క్షేత్రయాత్రలను ముగించుకొని ఒకటిన్నర నెలకు స్వగ్రామమునకు మరలివచ్చెను. అప్పటికిని అతని తిక్క తక్కువకాలేదు. ఆ గ్రామమున గల రామదేవునకు రథోత్సవము జరుప సంకల్పించి తనకు 'ఖాతా' ఉన్నవారియొద్ద ప్రాంసరులు వ్రాసియిచ్చి కొంతపైకమునుదెచ్చి కఱ్ఱలు వగైరా సామానులు కొని తెచ్చి పనివారిని బిలిపించి రథముచేయింప నారంభించెను. "అప్పుగొని సేయువిభవము...దెప్పరమై మీద గీడుదెచ్చు" నని అతని హితాకాంక్షులు అతని నా పని నుండి వారింపదలచియు, అందులకు వలయు సామానులు తెచ్చినాడు కనుకను, భగవత్కార్యము కాబట్టి దాని నాటంకపఱచిన ఏమి కీడు మూడునో యను భయమువల్లను, అతని నాటంకపఱచుట కెవ్వరును సాహసింపలేదు. కాని ఆ యూరు అతివీరావేశముకల కక్షల కొంప. కావున రథోత్సవ సమయమున పోట్లాటలు జరిగి యెవరికేమి యాపద సంభవించునో యని యెల్లరును భయపడుచుండిరి. అయిదారు నెలలలో తేరు తయారై ఆపదాపహర్తయగు శ్రీరాముని దయచేత ఎట్టి యల్లరులును జరుగక సీతారాముల రథోత్సవము మహోత్సాహముతో జరుపబడెను. ఈ కార్యమునకు అతనికి ఖర్చయినది రెండువేలరూపాయలకు పైగా. కాని భగవదనుగ్రహమువలన ఒక భక్తురాలు అయిదువందలరూపాయలును మఱియొక భక్తు డొక నూరు రూప్యములును అయాచితముగ అతనికి చందాగా నొసగియుండిరి. మఱియు, ఒకపత్రికలోని 'అంకెల పజిలు'ను చూచి యతడు వేడుకగా దానిని పూర్తిచేసి పంప, అది 'ఆల్ కరెక్ట్' గా నుండుట సంభవించి అతనికి అయిదునూర్ల రూపాయలు (ప్రథమ బహుమతి) పంపబడెను. ప్రస్తుత మతని 'దేవుని పిచ్చి' కొంచెము శమించినట్లున్నది. లోకుల హేళనకు గుఱియై యీ వ్యక్తి భక్తి గంభీరస్వరూపము దాల్చియుండవచ్చు. ఇతనిది తాత్కాలికాధ్యాత్మిక విజృంభణమే యని భావించినను, అయ్యది ఉన్న తాధ్యాత్మికావస్థయొక్క ఉపలబ్ధికి హేతువు కాజాలి బీజప్రాయమై యుండుటవలన అది ప్రశంసనీయమైనదియే కాని పరిహాసనీయమైనది కాదు కదా. "పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపిసః" అతని కర్మరాశికి శ్రీ రామకృష్ణుడు చిచ్చు ముట్టించినాడు. అది రగుల్కొనుచున్నది.

శ్రీ రామకృష్ణ ప్రభావము అణుమాత్రము స్పృశించిన మఱి యిరువురున్నారు. వారిలో ఒక వ్యక్తి బ్రహ్మచారి. అతడు చిన్నతనమునందే తల్లి చనిపోవ మామగారి సంరక్షణలో పెరిగిన నిరుపేద. మామగారు ఆస్తిని పంచుకొనునపుడు అతనికిగూడ కొంత ఆస్తి నిచ్చియుండిరి. శ్రీ రామకృష్ణ సంబంధ గ్రంథములలో అతడు చదివినది ఒక్క వివేకానంద జీవిత చరిత్ర మాత్రమే. "శ్రీ వివేకానంద జీవిత చరిత్ర జదువుటవలన నేను ధన్యుడనైతి. నా అనేక జన్మార్జిత పుణ్యఫలమువల్లనే నేను దానిని పఠించుట తటస్థించినది." ఇవి యతడు పదేపదే నొక్కివక్కాణించుచుండినవాక్కులు. 'వివాహితుడవు కమ్మ'ని యెందఱు చెప్పినను ఒప్పుకొనక తన యావదాస్తిని ఎనిమిదివేల రూపాయలకు విక్రయించి, ఒకపట్టణమున జేరి ప్రత్యేకముగా నొక బోధకు నేర్పఱచుకొని

ఆంగ్లము నభ్యసించుచున్నాడు. అతడు గంభీర ప్రకృతి కలవాడు కాబట్టి యతని సంగతి విశదముగ దెలిసికొన వీలులేదు. అతడేవో గొప్ప 'ప్లానులు' వేసికొన్నాడని తోచుచున్నది.

ఇంకొకడు గృహవ్రతుడు. అతడు శ్రీరామకృష్ణ సంబంధములగు పొత్తముల జదివి శ్రీరామకృష్ణోపాసకు డయ్యెను. శ్రీరామకృష్ణ భగవానుడు భగవత్పరితాప యజ్ఞేశ్వరుని అతని హృదయవేదికపై సుప్రతిష్ఠితము కావించియున్నాడు. ప్రజ్వలించుచున్న ఆ అగ్నిదేవుని వేడిని సహింపజాలక యతడు "ఇది నాపుణ్య కర్మముల ఫలితమా పాపకర్మముల ఫలితమా?" అని పలుమారు ప్రశ్నించుకొనుచుండును. "ఇది నా ఉన్మాదావస్థకు ప్రారంభమా ఉన్నతస్థితికి మొదలా?" అను శంక యతని మనమున పదేపదే ఉత్థితమగుచుండును. "కౌంతేయ ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి" అను భగవదభయవచనస్మరణముచే ధైర్యము నెలకొల్పికొన ప్రయత్నించుచుండును. వీరి భవిష్యత్తు ఎట్లున్నదో! శ్రీరామకృష్ణ కటాక్ష వీక్షణము ప్రసరించిన యిట్టి ప్రచ్ఛన్నులు ప్రపంచమున నెందఱు కలరో!

ఇక శ్రీరామకృష్ణావతార ఫలితమును గుఱించి యొకింత విచారింతము. శ్రీరామకృష్ణావతారము వలన సర్వమత ధర్మములును సముద్ధరింపబడి, మన వేదశాస్త్ర పురాణములే కాక సకల మతస్థుల పూజ్యగ్రంథములును పునరుజ్జీవితములై పూర్వాధిక గౌరవ విశ్వాసముల బడయు అవకాశము లభించెను; ఈశ్వరాస్తిత్వభావము ఇంచుమించు సర్వుల హృదయములందును నెలకొల్పబడెను; ఆస్తిక జనకోటికి నూతనోత్సాహశక్తి లభించి వారి భక్తిలత చిగురింప పుష్పింప ఫలింప నవకాశము దొరికెను; పరమ దుర్లభమగు మోక్షమును అనేకులు సులభముగ బొందిరి; అనేకుల హృదయక్షేత్రములలో ముక్తిబీజములు * నాటబడెను; వేదాంతజ్యోతియొక్క దివ్య తేజము ఖండఖండాంతరములలో వ్యాప్తమై భారత మహర్షులయొక్క గురుత్వము ప్రపంచమున చాటబడియె; "పరమతసహనమువహించి నీ మతధర్మమునే నీ వనుసరింపుము." అను శాంతి సందేశము నరలోకమునకు దొరికెను; పలుమాటలేల? - శాశ్వతముగా సర్వవిధముల ప్రపంచ సేవసలుప సంసిద్ధములుగనున్న శ్రీరామకృష్ణమఠ సేవాసంఘములు ప్రపంచమున స్థాపితములయ్యెను. ఈ సేవాసంఘము నామమాత్రధారికాక శ్లాఘనీయ స్వీయ సేవాపరంపరలచే ప్రపంచమునకు సుఫలముల నందించుచుండుట అభిజ్ఞుల కెల్లరకు విదితమేకదా.

ఈ సేవాసంఘము "గ్రహింపదుస్తరమగు నద్వైతము కళాసంశోభితమై దైనందిన జీవితమున సజీవమై యొప్పవలయును." అను శ్రీ వివేకానందుల సూత్రము ననుసరించి జీవసేవ సలుపుచున్నది. అద్వైతమును గ్రహించుట యెంతదుస్తరమో, అంతకంటె ఎంతో దుస్తరము దాని ననుష్ఠానమున నుంచుకొనుట. శ్రుతిస్మృతి పురాణ క్షీరసాగర మథనమొనర్చి అద్వైతసుధాకలశమును గొనివచ్చి ప్రపంచమునందలి జీవచ్ఛవముల కందించిన మహామేధావీర్యశాలియగు శ్రీ శంకరభగవానుడు కూడ అద్వైతానుష్ఠానశక్తి సముపార్జనార్థమై చాల ప్రయాసపడినట్లు తెలియుచున్నది. శ్రీ

---

* "జపో వాసుదేవేతి ముక్తిబీజమనుత్తమమ్" (2 అంశము. 6 అధ్యా.) అని విష్ణుపురాణమున జెప్పబడినట్లు, 'భగవన్నామ జపతత్పరత' అనికాని, భక్తి, లేక భగవజ్జిజ్ఞాస, అని కాని ముక్తిబీజ మనుట కర్థము చేసికోవలెను.

శంకరులు ఒకనాడు స్నానాహ్నికముల నిర్వర్తనార్థమై జాహ్నవికి జనుచుండ, శివుడు చండాలవేషధారియై ఆచార్యులవారిని సమీపింప, వారు "దూరముపొమ్ము" అని అతనితో బలుక, అపుడా కపట చండాలుడు "దూరము పొమ్మని దేహమునా లేక దేహధారినా నిరసించుట విద్వాంసుడా?" అని ప్రశ్నించి, సర్వశరీరములయందలి శరీరియొక్క ఏకత్వమును వారి జ్ఞప్తికిదెచ్చి, యిట్లు తన అక్కజమును వెలిబుచ్చెనట: "శ్లో॥ విద్యామవాప్యాపి విముక్తిపద్యాం—జాగర్తి తుచ్ఛా జనసంగ్రహేచ్ఛా — అహోమహాంతోఽపి మహేంద్రజాలే - మజ్జంతి మాయావివరస్య తస్య" "మోక్షసాధన భూతమగు విద్యను పొందినను తుచ్ఛమైన జన సంగ్రహేచ్ఛ * ఉత్థితమగుచున్నదే, ఆహా! మహామహులు సహ మాయావిశ్రేష్ఠుడగు మహేశ్వరుని మహేంద్రజాలమున మగ్నులగుచున్నారే! (శంకరవిజయము)

విద్యావినయ విరాజితుడగు విప్రుడు, సాధుస్వభావ సమన్వితమగు గోవు, మదమాంద్యములచేగూడిన యేనుగు, ఎంగిలి యెముకలకై తారాడు కుక్క, శునక భక్షకుడగు చండాలుడు,—ఇట్లు నానావిధ న్యూనతాధిక్యతలతో— విభేదములతో— గూడియున్న జీవకోటిని భగవద్భావముతో సేవించుటకు సాధనభూతమగు సమబుద్ధి లబ్ధమగుట మిక్కిలి కష్టము. కాబట్టియే "సమబుద్ధిర్విశిష్యతే" "సమంపశ్యన్ హి సర్వత్ర" "బుద్ధియోగముపాశ్రిత్య..." ఇత్యాదిగ అనేకపర్యాయములు శ్రీకృష్ణుడు సమబుద్ధియొక్క సమధిక యోగ్యత నుద్ఘాటించుటయు, "సర్వత్ర దైత్యాస్సమతాముపేత - సమత్వ మారాధన మచ్యుతస్య" (విష్ణుపురాణము) అని ప్రహ్లాదుడు రాక్షసబాలుర కుపదేశించుటయు. సుదుర్లభమగు బుద్ధియోగమును ఆచరణమున ప్రదర్శించుచున్న శ్రీరామకృష్ణమఠ సేవాసంఘములకు జయమగుగాక.

అనంతమహిమోపేతుడగు శ్రీరామకృష్ణ పరమేశ్వరుని గురించి నాబోటి యల్పజ్ఞుడు ఎంతవ్రాసినను విషయము సశేషముగనే యుండుట సహజమే. ఐనను "ఎవనిస్మృతిచేతను నామోచ్చారణచేతను తపఃపూజా క్రియాదులయందలి న్యూనత సంపూర్ణతను బొందునో..." అను మన శిష్టుల ప్రవచనము ప్రకారము ఈ వ్యాసము సంపూర్ణమైనదని యనుకొనవచ్చును. జయ శ్రీరామకృష్ణ గురుదేవ!

* ఇక్కడ 'జనసంగ్రహేచ్ఛ' యనగా "నార్హామి శుద్ధమపి లోకవిరుద్ధకృత్యం కర్తుం" "తత్త్వదృష్ట్యా శుద్ధమైనదైనను, లోకవిరుద్ధముగనున్న కార్యమును జేయజాలను" (శంకరవిజయము. 7-వ సర్గ) అని భట్టుపాదులు వచించినట్లు, 'జనులలో కలతరేగుట కాస్పదమొసగనియట్లు, ప్రపంచమునందు ఏర్పడియున్న పద్ధతుల కనుగుణ్యముగా నడువవలయునను ఇచ్ఛ' అని యర్థము, ఇదియే లౌక్యము అనబడునది. లౌక్యము అద్వైతము, మున్నగు తాత్త్వికాశయముల నాచరణయందుంచుకొనుటకు అడ్డంకుగా ఉండును. కావుననే, "'లౌక్యము' మహాదుర్గుణము, దానిని దొలగించుకొనుట దుర్లభము." (2 భా. 49 లేఖ) అని శ్రీ వివేకానందస్వామివారు పలికియుండుట.



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణము

ప్రియ...

ఈశ్వరేచ్ఛయే జరుగును. మనము తెలిసి కొన్నను తెలిసికొనకపోయినను మంగళమయ స్వరూపుడు దేనినొనర్చినను మంగళమయము గనే ముగియును. అందుల కావంతయు సందియములేదు. తెలిసికొన్నచో నందువలన మనకు గలుగగల యానందమునకు మేరయే లేదు.

భగవంతుడు నీకెంత చక్కని బుద్ధి నొసగెను—అన్ని విషయముల దెలియగల శక్తిని ప్రసాదించెను—ఇది చూచి యెంతయో సంతోషించుచున్నాను. సాత్త్వికబుద్ధి ఈ రీతిగనే ప్రభవించును. అది అసద్భావము నిసుమంతయేనియు మన హృదయము నంటనీయదు. ప్రపంచమున మంచిచెడ్డలలో నేదియున్నను సాత్త్వికబుద్ధిగలవాడు మంచినిదప్ప తద్విపరీతము నింతయు గనజాలడు. భగవానుని విశేషకృప కలిగిననే యిట్టిభావ ముదయించును. ఈ భావము సంపూర్ణమయినచో సమస్త దుఃఖములును కడముట్టును. భగవద్విషయానందమును తదాలోచనయు నెంతవఱకు గలుగుచుండునో అంతవఱకును శుభమే. ఈ సంసారమున సారము భగవానుడొక్కడే. ఈ మాటనే శ్రీ రామకృష్ణభగవానుడు పలుసార్లు ప్రవచించియున్నాడు. ఒకానొక కవి 'సుఖములన్నియు కల్పితములు, దుఃఖములన్నియు భయోత్పాతములు...' అని పలికియున్నాడు. అది యెంతయుసత్యము. మనమే అతిదీర్ఘచింతల వలన కష్టములపాలగుచున్నాము. లేనిచో సమస్తమును సహింపబడగలదు. శ్రీ రామకృష్ణ భగవానుడు ఇట్లుపలికెడువాడు: "శంఖమునఒక వైపున నీరుపోయుచుండ మఱియొకవైపునుండి ఆ జలము బయటికివచ్చుచుండును. అట్లే ఎవరి యర్థము సద్విషయార్థము వినియోగింపబడుచుండునో వాడెన్నటికిని బద్ధుడు గాజాలడు. అర్థముతో సదా యతడు వ్యవహరించుచున్నను అతడెన్నటికి బద్ధుడుగాడు." శ్రీ వివేకానంద స్వాములవారును నిట్లు పలికెడివారు: 'ఒకడు తనగదిని తెఱచియుంచినచో ఆ గదియందలి వాయువు ఏ విధమునను మలినముగాదు. అట్లే ఎవని యర్థము సద్విషయమున వినియోగింపబడునో వానినెన్నడును మాలిన్యమంటనేరదు.'

భగవానుడు మనల నుంచిన స్థితియే యుత్తమమయినది. తన చరణారవిందముల యందే మన మనస్సు సుస్థిరమైయుండునట్లు భగవంతుడు గావించినచో ఎట్టిస్థితియందున్నను పరవాలేదు. ఘోరాతిఘోరమయిన శరీర పీడయందును శ్రీ రామకృష్ణభగవాను డిట్లు పలికియున్నాడు: "శారీరకబాధను శరీరమే గమనించుకొనును. మనసా! నీ వానందమున నోలలాడుము." ఇది నేను వినియున్నాను. మనస్సు ఆనందమున—అనగా భగవానుని సన్నిధియందు — నిలిచినయెడల దుఃఖము, కష్టము శరీరమునకు గలిగిన నేమి? మానసిక కష్టమే భయంకరమయినది; సహింపరానిది.

భగవంతుడు కరుణించి మన మనస్సును తన పాదపద్మములయందు లగ్నముగావించినయెడల నెంతటి దుఃఖమయినను దుఃఖముగా గనుపింపదు.

శ్రీ శ్రీమాతాదేవి (శారదామాతృదేవి) కలకత్తాకు వచ్చుచున్నారన్న వార్త చాల సంతోషదాయకము. ఎందఱు శ్రీవారి పాదపద్మముల సాన్నిధ్యమును బడయుదురో! వారి సంఖ్య బహుళము. వారు ధన్యులు. ఆహా! వారికెంతటి సహనము. విసుగన్న మాటయే లేదు. ఉదయాది అస్తమయమువఱకును జనులు వచ్చుచునేయున్నారు. అందఱికోరికలను శ్రీవారు నెఱవేర్చుచున్నారు. వారు వచ్చినచో నీవు నీకుమారుని కలకత్తాకు దీసికొనిపోవ నిశ్చయించితివి. ఇది శుభదాయకము. ''గోరస—వేచన హరమేళన ఏక్ పంత్ దో కాయ్'' అగును.* గోపికలందఱును తమతమ గృహములనుండి గోరసము—అనగా పాలు—అమ్ము నెపముతో బయటికివచ్చి హరమేళ్ (శ్రీకృష్ణుని) తో కలసికొనెడివారు. అందువలననే 'ఏక్ పంథా' ఒకేమార్గమున 'దోకాయ్' రెండుకార్యము లాచరించెడివారు. ఎంత చక్కటి భావము? ఒకమార్గముననే రెండు కార్యములను ముగించుకొనెడివారు. సమస్తమును ఆయనకొఱకే. మొట్టమొదట ఆయన, ఆపిదప మిగిలిన సమస్తమును. గోపికలవలె అంతటి తదేకనిష్ఠ ఎవరికిని కలుగజాలదు. మనస్సు సంపూర్ణముగ నిర్మలమయినకొలదిని మన మీ భావమును తృణ్ణముగా పరిపూర్ణముగా గ్రహింపగలము. భగవానుని కృప మీయందు ప్రసరించియున్నది. క్రమక్రమముగా మీ రీ విషయములను గ్రహింపగలరు. ఆయన యనుగ్రహమున్నచో ఎందును కొఱత యుండదు.

శ్రీ రామకృష్ణులవారు తమ గృహస్థభక్తులతో నిట్లు పాడుచు చాల ఆనందించెడివారు. ఎట్లయినను చివరికి 'తద్గతాంతరాత్ములు' గావలయును. అది యింటనున్నను సరియే, అడవులలోనున్నను సరియే. ఆయనను బడయనియపుడు అడవిలోనుండిమాత్రము ప్రయోజనమేమి? ఆయనను హృదయస్థుని గావించుకొనియెందున్నను పరవాలేదు. మనము కోరవలయునది భగవానుడొకడే. లేచినను, కూర్చున్నను, భుజించుచున్నను, పరుండియున్నను గూడ ఆయననే మననముచేయవలయును. ఆయన కృపవలన సమస్తమును చక్కబడును. శ్రీ రామకృష్ణులవారు 'సాధువు, సర్పము—వీరిరువురు తమకొఱకు ఇండ్లు గట్టుకొనరు; పరగృహవాసముగలవారు' అని పలికెడివారు. అదియే యుత్తమమయినది. గృహనిర్మాణము అత్యంతము దుఃఖకరమైనది అన్న విషయము నే నిపుడు చక్కగా గ్రహించితిని.

భగవద్భక్తులకు భయవిచారము లేమియు లేవు. ఇదియే భగవద్గీతయందు 'కౌంతేయ ప్రతిజానీహి, నమేభక్తః ప్రణశ్యతి' అని ప్రవచింపబడియున్నది. భగవంతుడు అర్జునునితో 'ఓ అర్జునా! నా భక్తుల కెన్నటికిని వినాశము కలుగదని ప్రతిజ్ఞాపూర్వకముగ వచింపుము' అని పలికియున్నాడు.

శుద్ధభక్తి దేవదుర్లభమైనది. శుద్ధభక్తి గలవానికి భగవానుడు వశీభూతుడు. అది అంత సులభముగా లభించునా? శ్రీ రామ

* 'చలో సఖీ! కాఁహ జాయ్ఏ జాఁహామ్ మిలే వ్రజరాజ్ గోరసవేచన హరమేళన ఏక్ పంత్ దో కాయ్.

కృష్ణభగవాను డిట్లు పాడెడివాడు: "నాకు ముక్తినొసగుటయం దాగ్రహము లేదు. శుద్ధ భక్తిప్రదానమునందే ఆగ్రహము గలదు." రామప్రసాదు, 'అన్నిటికి మూలకారణము భక్తి. ముక్తి దాని దాసి'-యని పలుకుచుండెడివాడు. నిజముగా భగవత్ప్రేమ గలిగినచో నేమియు కొదువగాబోదు.

శాస్త్రయుక్తమయిన ధర్మాలాపమే గృహస్థుని కర్తవ్యము. కావున భార్యతో నీవు శ్రీ రామకృష్ణవచనామృతమును జదువుచుండుము. అందువలన నీకు మంచియే కలుగు ననుటకు సందియము లేదు. మీ రిరువురును అన్యోన్య మానసికైక్యత కలిగియున్నచో సమస్తవిధముల సుఖములనుభవించెదరు. మీ రిరువురును భగవానుని ఆదర్శగృహస్థభక్తులగుదురు. ఇంతకంటె మీ జీవితమున మీరు కోరగలదెద్ది? 'కాళీభక్తుడు జీవన్ముక్త నిత్యానందమయుడు' అను పాటను శ్రీ రామకృష్ణ గురుదేవు డపుడపుడు పాడుచుండెడివాడు. భగవద్భక్తుడవై యెందున్నను సరియే. పెంట పోగులోనున్నను బంగారము బంగారమే గదా? 'కౌంతేయ ప్రతిజానీహి న మే భక్త ప్రణశ్యతి' —ఇది భగవద్వాక్యము.

ఇట్లు,
నా శుభాశీస్సులతో
శ్రీ తురీయానంద



పేదలదుఃస్థితియే హిందూదేశమునందలి చెడుగుల కన్నింటికిని బుట్టినిల్లు. పశ్చిమఖండమునందలి పేదలు కేవలరాక్షసులు; వారితోఁ బోల్చిచూచినచో, మనవారు దేవతలని చెప్పవచ్చును, అందుచే మన పేదలను లేవనెత్తుట యంతకష్టసాధ్యమైన పనికాదు. విద్యనేర్పుట, వారు కోల్పోయిన వ్యక్తిత్వమును వెలువడఁజేయుట—ఇదియే పేదలకు మనము చేయవలసిన సేవ. దేశీయప్రభువులు జనసామాన్యమునుద్ధరించుటకుఁగాను జేయవలయు మహాకార్యమిది. ఇంతవఱకు నీ విషయమునఁ గలుగజేసికొనినవా రెవ్వరును లేరైరి. మతాచార్యుల నిరంకుశాధికారముచే నేమి, విదేశీయుల వలని యోటమిచే నేమి, యనేక శతాబ్దములనుండియు జనసామాన్యము అధఃపతితమైయున్నది. తుదకుఁ దాము మానవులమను సంగతినే మఱచిపోయినారు మన పేదలు. వారికి మనము సదాశయములను దెలుపవలసియున్నది; తమచుట్టును లోకమున నేమి జరుగుచున్నదో కన్నులు విప్పి చూపవలసియున్నది. అపుడు స్వయముగనే వారు తమ విమోచనమును సాధించుకొనఁగలరు. ప్రతిజాతియుఁ బ్రతిపురుషుఁడును బ్రతిస్త్రీయును దన విమోచనమును దానే సాధించుకోవలయును. జనులకు సదాశయములను దెలుపుఁడు—వారికి వలయు సాయ మిదియే, మిగిలినదంతయుఁ దన్మూలముననే జరిగితీరును.

—శ్రీ వివేకానందస్వామి



# శ్రీ వాసుదేవ మననము

## ద్వితీయ వర్ణకము

### శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

"కం॥ మదమెచ్చును ధనమెచ్చిన। మద మెచ్చిన దుర్గుణములు మానక హెచ్చున్। మదముడుగును ధనముడిగిన। మదముడిగిన దుర్గుణములు మానకయుడుగున్॥" ధనసంపత్తితో దుర్గుణసంపత్తియు అనుసరించియే యుండును. "బధిరయతి కర్ణవివరం వాచం మూకయతి నయనమంధయతి వికృతయతి గాత్రయష్టిం సంపద్రోగోఽయమద్భుతో రాజన్॥" విత్తసంపత్తి యనెడి వ్యాధి మిక్కిలి యద్భుతమైనది. చక్కని ఇంద్రియపటుత్వము గలపురుషుని బధిరునిగను, మూకగను, అంధునిగను, ఆమయుని (రోగిని) గను జేయుచున్నది. "అర్థసంపద్విమోహాయ విమోహో నరకాయ చ। తస్మాదర్థమనర్థాఖ్యం శ్రేయోర్థీ దూరతస్త్యజేత్। యస్య ధర్మార్థ మర్థేహా తస్యానీహైవశోభనా। ప్రక్షాళనాద్ధిపంకస్య దూరాదస్పర్శనం,వరమ్॥" అర్థసంపత్తి అత్యంత మోహకారణము. మోహము నరకహేతువు. అందువలన అర్థము అనర్థాఖ్యము – హానియొక్క మూర్తీభావము. ఏతాదృశ ధనమును ముముక్షువు దూరముగ పరిత్యజింపవలయును. ఒకవేళ ధర్మకార్యాచరణముకొఱకు ధనకాంక్ష ముముక్షువునకు తగునని చెప్పెదమో! ముముక్షువున కర్థమునం దనహాయే (నిరపేక్షయే) శ్రేయోదాయకమగును. అడుసు త్రొక్కనేల కాలు గడుగనేల? పంకము త్రొక్కి పాదప్రక్షాళనము చేయుటకంటె అడుసును స్పృశింపక దూరముగనుండుట మేలుగదా! అట్లే అనర్థాభిధేయమగు నర్థము నార్జించి ధర్మార్థము వినియోగించుటకంటె ధనమునందు సదా నిస్స్పృహతయే శ్రేష్ఠమైనది. "అపరిణామోపశమో దారుణో లక్ష్మీమదః। కష్టమనంజనవర్తి సాధ్యమైశ్వర్య తిమిరాంధత్వం॥" (కాదంబరి.) మహాదారుణ – భయంకర – మైన ధనమదము పరిణామావస్థయందు (ధనమెంత పెరిగినను) ఉపశమించునది కాదు. ఐశ్వర్యమదమువలన సంభవించిన తిమిరాంధత్వము అంజన – కాటుక – ప్రయోగముచేత నివర్తింపబడుటకు సాధ్యము కానిది. "అసతః శ్రీమదాంధస్య దారిద్ర్యం పరమాంజనం। సంపద్రోగ స్స్వల్పబుద్ధిః వికారాయ ప్రకల్పతే॥" (స్కాంద. పు. ధర్మ. ఖం.) ధనమదాంధుడైన దుర్మార్గునకు దారిద్ర్యమే పరమాంజనము. సంపద్రోగమనెడి అల్పబుద్ధి యనేకవికారముల కారంభకమగును. "శా॥ సంపన్నుం డొరుగాన లేడు తనువున్ సంసారమున్ నమ్మి హిం। సింపంజూచు దరిద్రుడెత్తు

వడి శుష్కీభూతుడై చిక్కి హిం । సింపం డన్యుల నాత్మకున్ సములుగా జింతించు నట్లాట డ । త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారి ద్ర్యమూహింపగన్॥" (భాగ. 10-1-394.) కనుక "మూఢజహీహి ధనాగమతృష్ణాం। కురుసద్బుద్ధిం మనసివితృష్ణాం। యల్లభసే నిజ కర్మోపాత్తం। విత్తంతే నవినోదయచిత్తం॥" (శంకరః.) మూఢుడా! అర్థసంపాదనమందలి యాశను పరిత్యజింపుము. చిత్తమునందు ఆశ లేని సద్భావమును గలిగియుండుము. నీ పురా కృతకర్మకొలది ప్రాప్తమైన విత్తముతో నీ చిత్త మును తృప్తిబొందించుము—సంతృప్తుడ వగుము. "ఆశానామ మనుష్యస్య కాచిదా శ్చర్యశృంఖలా। యయాబద్ధాః ప్రధావంతి ముక్తాస్తిష్ఠంతి పంగువత్॥" ఆశ యనునది మనుష్యునకొక ఆశ్చర్యమైన శృంఖలము అనగా శృంఖలముగాని శృంఖలము. ఆశా శృంఖలితులు బహుభంగుల పరుగులిడుదురు. ఆశాపాశవిముక్తులు కుంటివారివలె గూర్చుండె దరు. అదెట్లన ఇనుపసంకెళ్లచే బంధితులైన వారు స్వేచ్ఛగ మసలజాలక కుంటివారివలె గూర్చుండెదరు. ఆ శృంఖలాబంధమునుండి విడు వబడినయంతట వారు యథేచ్ఛం సంచరించె దరు. ఇందుకు విరుద్ధముగ ఆశ యనెడి శృంఖ లములచేత బంధితులైనవారు విసుగు విరామ ములను విసర్జించి సకల శ్రమలను సహించి రేయింబవళ్లనక సదా పరుగులిడుచునే యుండె దరు. ఆశాశృంఖలములనుండి విముక్తులైన వారు కుంటివారిభంగి నొకచోట గూర్చుని యుండెదరు. "అర్థస్య పురుషో దాసో దాస స్త్వర్థో నకస్యచిత్ । ఇతిసత్యం మహారాజ బద్ధోస్మ్యర్థేన కౌరవైః॥" (భారతము.) పురు షుడు ధనమునకు దాసుడు. ధనము మాత్ర

మెవ్వరికిని దాసీ కానేరదు. ఇది సత్యము. ధర్మరాజా! అర్థసంబంధముచేతనే (పోష్య పోషకసంబంధముచేతనే) కౌరవపక్షమున కట్టు వడితిమని భీష్మాదులు ధర్మజునితో నుగ్గడిం చిరి. "ఆశాయై దాసాయే దాసాస్తే సర్వలో కస్య। ఆశాయేషాం దాసీతేషాం దాసాయతే లోకః॥" ఆశకు వశుడగుచు దాసుడైన పురు షుడు సకలలోకమునకును వశుడగుచు దాసుడే యగును. ఆశ యెవనికి వశమగుచు దాసీ యగునో అనగా ఆశను జయించి స్వాధీనపఱచు కొనినవానికి సమస్తలోకము జయింపబడినదే యగుచు స్వాధీనమై దాస్యముచేయుచుండును. "ఆశాధిగతి తృష్ణయో రితికోశః" = ఆశ యనగా నమితమైన యభిలాష యని కోశము. "అంగం గళితం పలితం ముండం। దశనవిహీనం జాతం తుండమ్। వృద్ధోయాతి గృహీత్వా దండం। తదపి నముంచత్యాశాపిండమ్॥"(హస్తా మలకాచార్యః.) దేహేంద్రియపాటవము దిగ జాఱిపోయినది, తల నెఱసినది, దంతము లన్నియు నూడిపోయినవి. జరాభారముచే శరీరము క్రుంగ దండము నూతగగొని వృద్ధుడు తిరుగుచున్నాడు. అట్లయినను ఆశమాత్రము శరీరము నంటిపెట్టుకొని విడువకున్నది. "వలిభి ర్ముఖమాక్రాంతం పలితై రంకితం శిరః। గాత్రాణి శిథిలాయంతే। తృష్ణైకా తరుణా యతే॥" (భర్తృహరి.) ముఖమును ముడుత లాక్రమించినవి. నరసినశిరోజములుశిరము నలం కరించినవి. అవయవములన్నియు దుర్బలము లైనవి. ఇట్లు శరీరము శిథిలమగుచున్నది కాని ఆశకుమాత్రము యౌవనము వచ్చుచున్నది. అనగా నిరపాయముగ విజృంభించుచునే యున్నది ఆశ. ఆశకు పరిమితిలేదు. "ఆశా పాశముదాగడున్ నిడుప లేదంతంబు రాజేం

స్త్రీ వా। రాశి ప్రావృత మేదినీవలయ సామ్రాజ్యంబు సేకూరియుం। గాసింబొందిరిగాక వైన్య గయభూకాంతాదులున్నర్థకా। మాశన్బాయగ నేర్చిరే మును నిజాశాంతంబులన్ జూచిరే॥'' (భాగ. 8-575.) ఆశాపాశము చాల పొడవైనది. దానికంతములేదు. వైన్యుడు గయుడు మున్నగు పృథివీపతులు చతుస్సముద్రముద్రితమైన యఖండసామ్రాజ్యము చేపడియు నర్థకాంక్షయం దాశను విడువజాలరైరి. తమ ఆశకు అంతమును జూడజాలకపోయిరి. శ్రమను మాత్రము పొందిరి. "నిస్స్వోవష్టిశతం శతీదశశతం లక్షం సహస్రాధిపో। లక్షేశః క్షితిపాలతాం క్షితిపతి శ్చక్రేశతాం వాంఛతి। చక్రేశస్సురరాజతాం సురపతి ర్బ్రహ్మాస్పదం వాంఛతి। బ్రహ్మా విష్ణుపదం హరి శ్శివపదం హ్యాశావధిం కోగతః॥'' నిర్ధనుడు నూఱునిష్కములగోరును. నూఱు నిష్కములు గలవాడు వేయి నిష్కముల గాంక్షించును. వేయి నిష్కములు గలవాడు లక్ష నిష్కముల నభిలషించును. లక్షాధికారి భూపాలకత్వమును కామించును. భూపాలకుడు చక్రవర్తిత్వమునకు దోహదము చేయును. చక్రవర్తి సురపతిత్వమును, సురరాజు బ్రహ్మత్వమును, బ్రహ్మ విష్ణుపదమును, విష్ణువు శివపదమును వాంఛించుచుండును. ఇట్లుండ ఆశయొక్క అవధిని ఎవ్వడధిగమింపగలుగును? "ఆశాపాశ శతైర్బద్ధాః కామక్రోధ పరాయణాః। ఈహన్తే కామభోగార్థ మన్యాయే నార్థ సంచయాన్॥'' (గీ. 16-12.) అనేకములైన ఆశాపాశములచే బంధింపబడినవారును, కామక్రోధములే పరమాశ్రయముగాగలవారును, దానధర్మములకొఱకు గాక కేవల స్రక్చందన వస్త్రవనితాది విషయములయొక్క భోగార్థమే అన్యాయముచేత శాస్త్రవిరుద్ధమైన కపటవంచనాదిరూపమైన మార్గమున అర్థసంపాదనము నపేక్షించుచున్నారు. "ఆశైవ రాక్షసీ పుంసా మాశైవ జీర్ణమందిరా। ఆశైవ విషమంజరీ నైరాశ్యం పరమం సుఖం॥'' ఆశ మనుష్యులకు రాక్షసియే. ఆశయే ప్రమత్తకమైన మద్యము. ఆశయే మనుష్యులకు విషవల్లరి. అసురాదులవలె నాశయు నత్యంత హానికరమైనది కావున మనుష్యులకు నైరాశ్యము (నిరాశతనము) పరమసుఖము. "న విత్తేన తర్పణీయో మనుష్యః॥'' (కఠ. 1-1-27.) ధనమెంత ప్రభూతముగ ప్రాప్తించినను మనుష్యుడు తృప్తిని బడయజాలడు. "అసంతుష్టస్య విప్రస్య తేజోవిద్యా తపోయశః। స్రవంతీంద్రియ లౌల్యేన జ్ఞానంచావకీర్యతే॥'' (భాగ. 7-15-9.) అసంతుష్టుడగు విప్రుని యొక్క తేజోవిద్యాతపోయశములు, ఇంద్రియ లౌల్యముచేత ఛిద్రఘట మునందలి జలము భంగి స్రవించిపోవును. వివేకజ్ఞానముకూడ వికలంబగును. "సంతుష్టస్య నిరీహస్య స్వాత్మారామస్య యత్సుఖం। కుత స్తత్కామలోభేన ధావతోఽర్థేహయాదిశః'' (భాగ. 7-15-16.) తన ప్రాక్తన జన్మకర్మానుసారముగ ప్రాప్తమైన విత్తముచేత పరితృప్తుడును, నిష్కాముడును, స్వాత్మారాముడునైన మహాత్మునకుగల యట్టిసుఖము, కామలోభములచే గట్టువడి ద్రవ్యసంపాదనార్థము దశదిశల పరిధావనము సేయు పామరలోకమున కెటుల పట్టువడును? స్వప్నమునందైన స్మరింపబడదు. "అంతో నాస్తి పిపాసాయాస్తుష్టిస్తు పరమం సుఖం। తస్మాత్సంతోష మేవేహ ధనం పశ్యంతి సూరయః'' (భారత. శాంతి. 330-21.) ధన తృష్ణకు (దాహమునకు) అంతములేదు. సంతుష్టియే పరమసుఖము. అందువలన సంతృప్తియే

లోకమునందు పరమైశ్వర్యమని—గొప్పధనమని—పండితులు అంగీకరించుచున్నారు. "కం॥ వ్యాప్తిం బొందక వగవక। ప్రాప్తం బగు లేశమైన బదివేలనుచున్। దృప్తిం జెందని మనుజుడు। సప్తద్వీపములనైన జక్కంబడునే॥" (భా.) "సీ. సంతుష్టుడీ మూడుజగములబూజ్యుండుసంతోషికెప్పుడు జరుగు సుఖము। సంతోషిగాకుంట సంసారహేతువు సంతసంబున ముక్తిసతియు దొరకు। బూటపూటకు జగంబుల యదృచ్ఛాలాభతుష్టిని దేహంబుదోనపెరుగు। బరితోష హీనత బ్రభ సెడిపోవును జలధార ననలంబు సమయునట్లు॥" అని భాగవతమునందు త్రివిక్రమవచనము. సంతుష్టుడనగా.— "నాభివాంఛత్య సంప్రాప్తం ప్రాప్తం భుంక్తే యథాక్రమం। యస్తు సౌమ్య సమాచార సంతుష్ట ఇతి కథ్యతే॥" (మహా. ఉ. 4-37.) అసంప్రాప్తముల నాకాంక్షించనివాడును, అయాచితప్రాప్తములను యథాక్రమముగ (శాస్త్రమర్యాద నతిక్రమింపక) అక్కఅక్కొలది యనుభవించువాడును, స్వధర్మప్రవర్తకుడునగు పురుషుడు సంతుష్టుడని చెప్పబడును. "సంతోషామృతపానేన యేశాంతాస్తృప్తిమాగతాః। ఆత్మారామ మహాత్మానస్తే మహాపదమాగతాః॥" (మహా. ఉ. 4-35.) ఆత్మ సంతోషమనెడి అమృతసేవచేత శాంతులై తృప్తిని బొంది యనవరత మాత్మారాములై యుండు మహాత్ములు మహాపదమును బొందినవారే యగుదురు. పదమనగా—"పద్యతే జ్ఞానేన ప్రాప్యతే ఇతిపదం॥" బ్రహ్మాత్మైకత్వజ్ఞానైకగమ్యమైన స్వస్వరూపము పదమనబడును. "ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా। కామరూపేణ కౌంతేయ దుష్పూరేణా నలేన చ॥" (గీ. 3-39.) కామమె—కోరికయె—రూపమైన ఆశ అలంభావము (చాలును అనెడి భావము) లేనిది. పూరింప శక్యముకానిది. లేక దుఃఖముతో నింపునది. మఱియు కామరూపముగలదియగుటచే ఆశ జ్ఞానికి నిత్యశత్రువు. బురదచేత జలమువలెను, రాహువుచేత చంద్రబింబమురీతిని, ఆశచేత జ్ఞానము అనగా సర్వత్ర బ్రహ్మగ్రాహకమైన బుద్ధి వృత్తి, ఆవరింపబడియున్నది. "నసాం పరాయం ప్రతిభాతిబాలం ప్రమాద్యంతం విత్తమోహేనమూఢమ్। అయం లోకోనాస్తి పరఇతిమానీ పునః పునర్వశమాపద్యతేమే॥" (కఠ. 1-2-6.) ధనమోహము చేత మూఢుడు పరమార్థప్రాప్తియే ప్రయోజనముగాగల శాస్త్రీయమగు సాధనవిశేషమును గ్రహింపజాలడు. స్త్ర్యన్నపానాది విశిష్టమైన నీ సంసారమే లోకమనియు నింతకంటె పరమెద్దియు లేదనియు భావించు బాలుడు అనగా అజ్ఞుడు ("బాలోఽజ్ఞే ఇతి సర్వధరః") జననమరణరూప సంసారము నవిచ్ఛిన్నముగ పొందుచునేయుండును. ఇట్లు ధనైషణ ఆదిమధ్యావసానములయందంతటను దుఃఖమయము దుఃఖప్రదము సర్వానర్థముల కాలవాలమును ముముక్షుత్వమునకు ముఖ్య ప్రతిబంధకము నగుట పూర్తిగా గ్రహించి ముముక్షువు లవశ్యము దీనిం బరివర్జింపవలయును.

"ప్రమదామదిరాలక్ష్మీ విజ్ఞేయా త్రివిధాసురా। దృష్ట్వైవ మోహయత్యేకా పీతాచాన్యాఽతిసంచయాత్॥" — (క్షేమేంద్రకవి. ప్రమద-మదిర-లక్ష్మియని సురను మూడుతెఱగులుగ నెఱుగునది. అందు స్త్రీ మొదటి రూపము. ఇది దర్శనమాత్రముననే లోకమును మోహమునముంచును. మద్యము రెండవ రూపము. ఇది త్రాగుటచేత పురుషుని విశత్వము నొందించును. ధనము మూడవ

రూపము. ఇది విశేషసంశయమువలన మనుజునకు మదాంధతను గలుగజేయును. "గౌడీ మాధ్వీ తథా పైష్టీ విజ్ఞేయా త్రివిధా సురా। చతుర్థీ స్త్రీసురా జ్ఞేయా యయేదం మోహితం జగత్॥ గుడాసవము, మధ్వాసవము, పిష్టాసవము నని మత్తునుకలుగజేయు ద్రవ్యములు మూడురకములుగనున్నవి. కాని వీనికంటె అధికముగ ప్రమత్తకమైనది మఱియొకటి నాల్గవ మత్తుపదార్థముగ జెప్పబడుచున్నది. అది యంగనయే. అదెట్లన మొదటి మూడురకములను సేవించిన అనగా పానము చేసినపురుషుడు మాత్రమే మత్తుగొని వివశుడగుచు దుఃఖములపాలగుచున్నాడు. ఈతురీయ రకముచేత లోకమంతయు వివశత్వము నొందుచున్నది. ఎట్లన స్మృతా భవతి తాపాయ దృష్టా చోన్మాదకారిణీ। స్పృష్టా భవతి మోహాయ సా నామ దయితా కథం॥" (భర్తృహరి.) స్త్రీ, స్మరణమాత్రమున తాపమును బుట్టించును. దర్శనమాత్రమున ఉన్మాదము (చిత్తవిభ్రమము)ను ఆపాదించును. స్పర్శమాత్రమున మోహము (మూర్ఛ)ను పొందించును. అట్టి స్త్రీని ప్రియురాలనుటయెట్లు? "నామృతం న విషం కించిదేకాం త్యక్త్వా నితంబినీం। సైవామృతలతా రక్తా విరక్తా విషవల్లరీ॥" (భర్తృహరి.) "ఆ॥ పడతినొక్కదాని విడిచి యించుక యమృతంబు లేదు భువి విషంబు లేదు। అమృతలత లతాంగి యనురాగవతియైన। గాక మెలగెనేని గరళవల్లి॥" (ఏనుగు లక్ష్మణకవి.) అంగనకంటె నన్యముగ అమృతములేదు. విషమును లేదు. అతివయే అమృతమును విషమునుగూడ యగును. వనిత యనురాగవతియై ఆనుకూల్యవతియైన పక్షమున నాయువతి యమృతలత యగును. అనురాగరహితయై ప్రాతికూల్యవతియైన పక్షమున నా లతాంగియే విషవల్లరి (వత్సనాభము) అగును. "నన్వగ్నిః ప్రమదా నామ ఘృతకుంభః పుమానతః। సుతామపి రహో జహ్యాద్యావదర్థం హి భాషణం॥" (భాగ. 7-12-9) పొలతి దావవహ్ని. పురుషుడాజ్యఘటము. తనయకైన "యథా యథా సాంత్వయితా వశ్యస్త్రీణాం తథా తథా। యథా యథా ప్రియంవక్తా పరిభూత స్తథా తథా॥" (వా. రామాయణము. 5-22-2) పురుషుడు పడతులనెంత యుపలాలించునో (బుజ్జగించునో) అంత వారలస్వాధీనుడగును. వారల సంతోషముకొఱకు ఎంత ప్రియముగ మాట్లాడునో అంత వారలచేత తిరస్కృతుడగును. "వేధా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ। తాసు తేష్వప్యనాసక్తో సాక్షాద్భర్గో నరాకృతిః॥" వనజభవుండు వనితావిత్తముల రెండింటియందు రెండు విధములైన భ్రమను గల్పించెను. అత్యంతమోహజనకములగు కాంతాకనకముల రెండింటియందు నెవడు నిరీహుండై అనాసక్తుడుగనుండునో అతడు నరాకారమును బొందిన సాక్షాత్పరాత్పరుడే యని గ్రహింపవలయును. అత్యధికభ్రాంతికారణములును, విశేషమోహోత్పాదకములును, మమకారాస్పదములును, పరమసుఖరూపములు సౌఖ్యప్రదములుగ భావింపబడునవియునగు నీకామినీకాంచనములు కేవల దుఃఖమయములని బుద్ధిమంతులు గ్రహించెదరుగాక. "ఆదిమధ్యావసానేషు దుఃఖం సర్వమిదం యతః। స్త్రియం త్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వా సుఖీభవేత్॥" (మహో. ఉ. 3 అ.) ఆదిమధ్యావసానములయందంతట నీ వామాహేమరూప సంసారమంతయు దుఃఖమయమేయగుటం జేసి.

సర్వానర్థమూలమైన వ్యర్థమగు సంగనాయర్థై షణములను పరిత్యజింపవలయును. సుందరీసువ ర్ణైషణాపరిత్యాగమువలన సకల ప్రపంచము నందును ఆశవదలి వైరాగ్యమంకురించును. తీవ్రవైరాగ్య మలవడిన రమణీ హిరణ్యరూప సంసారమునందు వ్యామోహ మంతరించును. అంతట ఆత్మ జిజ్ఞాస యంకురించును. స్వాత్మ తత్త్వము నెఱింగి సుఖవంతుడగును. ఇట్లు దారై షణ ఆది మధ్యాంతములయందంతటను దుఃఖా త్మకము దుఃఖదాయకము సర్వానర్థనిలయము. ముముక్షుత్వమునకు ముఖ్య ప్రతిబంధకమును అగుట లెస్సగ గ్రహించి ముముక్షువు లవశ్య ము దారైషణను పరిత్యజింపవలయును.

అలభ్యమాన స్తనయః పితరౌ క్లేశయే చ్చిరం। లబ్ధోఽపి గర్భపాతేన ప్రసవేనచ బాధతే॥ జాతస్యగ్రహరోగాది కుమారస్యచ మూర్ఖతా। ఉపనీతేఽప్యవిద్వత్వ మనుద్వా హశ్చపండితే ॥ యూనశ్చపరదారాదిదారి ద్ర్యంచ కుటుంబినః। పిత్రోర్దుఃఖస్యనా స్త్యంతో ధనీచేన్మ్రియతేతదా॥ ఏవంవివిచ్యపుత్రాదౌ ప్రీతింత్యక్త్వా నిజాత్మని। నిశ్చిత్యపరమాంప్రీతిం వీక్షతే తదహర్నిశం॥'' (యాజ్ఞవల్క్య. ఉ.) పుత్రులు పుట్టకయుపుట్టియునుగూడ తల్లిదండ్రు లకుసదాక్లేశమునే కలుగజేయుచున్నారు. అదె ట్లన సంతతికలుగని గృహిణీగృహస్థులు సంతా నముకలుగలేదనెడి వ్యసనాక్రాంతులై సంతాన ప్రాప్తికొఱ కనేకములుగ మ్రొక్కులు ఉప వాసాది వ్రతములు జపములు హోమములు, తీర్థయాత్రలు, అశ్వత్థప్రదక్షిణములు చేసియు, భూతవైద్యములు గ్రహశాంతులు రుద్రాభి షేకములు చేయించియు, ఔషధములు సేవిం చియు విశేషముగ విత్తవ్యయమును శరీరా యాసమును పొందుటమూలముగ ననేకవిధ ముల దుఃఖితులగుచున్నారు. అప్పటికిని అపత్య లాభమును పొందనియెడల అనపత్యులై అన పత్యతచేత యావజ్జీవము దుఃఖభాగులగు చున్నారు. ఇది లోకమున గొందఱ యను భవమేకదా, కనుక అజాతపుత్రుడు మాతా పితరులకు సతతము వెత (దుఃఖము) ను కలుగ జేయుటయందు సంశయములేదు. అనగా సంతానహీనత సర్వదా దుఃఖహేతువు. ఇక పుట్టినపుత్రునివలన క్లేశమెట్టుల సంభవించు ననగా.—పుణ్యావశమున గర్భము కలిగిన యెడల గర్భపాతముగలిగెనేని తల్లిదండ్రులకు దుఃఖము. అట్లుకానిచో ప్రసవకాలమున దుః ఖము. భాగ్యవశమున సుఖప్రసూతియై పుత్రుడుకలిగిన ఆపుత్రునకు పురిటిదోషము పక్షిదోషము ముట్టుదోషము దృష్టిదోషము మున్నగు దోషములవలన శిశువు పొందెడి శ్రమనుగూర్చియు తమకుగలిగెడి వ్యయ ప్రయాసలగూర్చియు తల్లిదండ్రులకు దుఃఖము కలుగును. బాలారిష్టదోషములను దాటి బాల్యము నతిక్రమించి కౌమారావస్థను బొందిన యాపుత్రుడు మూర్ఖుడైనయెడల దానం దల్లి దండ్రులకు దుఃఖము. వానికి ఉపనయనము జేసి విద్య నభ్యసింపజేసిన వాడు మందబుద్ధియై పండితుడుగాకపోయిన తల్లిదండ్రులకుదుఃఖము. అటులగాక పండితుడేయైనను వాని వివాహ విషయమైన దుఃఖము. వివాహమైన, పుత్రుడు దుష్ప్రవర్తనుడైనచో దానం వానికి సంభ వించు శ్రమలవలన తల్లిదండ్రులకు దుఃఖము. అటులగాక సచ్ఛీలుడైన, బహుకుటుంబీకు డగుచు నిర్ధనుడయ్యెనేని దారిద్ర్యమువలన తమపుత్రుడు పొందు శ్రమలనుజూచి తల్లి దండ్రులకు దుఃఖము. తమతనయుడు దరిద్రుడు

గాక ధనవంతుడైనను ఒకవేళ తమకంటె ముందు దాటిపోయినయెడల ఆ పితరుల దుఃఖమున కంతమే లేదుకదా. ఇట్లు "చ॥ కొడుకులు గల్గుదాక నొక కొన్ని దినంబులు చింత నందనుల్। పొడమిన నాయువు న్బలము బుద్ధియు విద్యయు జాలగల్గగా। నుడుగనిచింతకల్గి తను నోలిభజింపని చింత తండ్రికై। ప్పుడు గడు చింత సేయుదురు పుత్రులు శత్రులుగాక మిత్రులే।" (కవిరాజమనోరంజనము) అను న్యాయమున జాతాజాతాత్మజులవలన జననీజనకుల కత్యంత దుఃఖ మనవరతము కలుగుచున్నది. ఈ ప్రకారము పుత్రాది విషయవ్రాతమునందుగల దోషములను విభజించి గ్రహించి, ఆదిమధ్యావసానములయందంతటను క్లేశభూయిష్టమగుచు- దుఃఖస్వరూపమగుచు-సర్వానర్థముల కాలవాలమై ముముక్షుత్వమునకు ముఖ్యప్రతిబంధకమైన విత్తాపత్యకళత్రాది విషయజాతమునం దనురాగమును పరిత్యజించి, స్వాత్మయందు పరమప్రేమను నిశ్చయించి నిరంతర మాత్మానుసంధానము నవలంబించియుండవలయును. అందువలన తీవ్రమైన ముముక్షుత్వము స్థిరముగ సిద్ధించును.

# గ్రంథసమీక్ష

## శ్రీ దేవీ పంచస్తవి

డిమ్మి 1/8 సైజు (40 + 44 + 16 = 100) పుటలు. అనువాదకులు: శ్రీ ఈశ్వరసత్యనారాయణశర్మ. ప్రాప్తిస్థానము: శ్రీ శివానందాశ్రమము - రాయవరము, రాయచోటితాలూకా, కడపజిల్లా.

ఇది మహాకవి కాళిదాస సంస్కృత కృతికి ఆంధ్రానువాదము. ఇందు అనువాదకర్త 'మక్కికిమక్కి'గా గాక శబ్దము, అర్థము, భావము మున్నగువిషయములందు మెలకువ గలిగి తనరచనను రసవంతమును సంపూర్ణ విషయవివరణప్రాయమును నగునట్లు ఆకర్షణీయముగ సాగించియున్నారు. ఇది ఉపాసక లోకమునకు మహోపకారిణి యనుటయం దావంతయు సందియము లేదు. భాషాంతరీకరణమయ్యు నీ గ్రంథము స్వతంత్రరచనయనపోలె స్వకోపకల్పితముభాతి చదువరుల నెంతయు నానందమున నోలలాడించుచున్నయది. ఆంధ్రభాషామర్యాదల నావంతయు కొఱతగాని తెలంగున గ్రంథకర్త ఉపాసకలోకమునకు తన గ్రంథమును ప్రసాదించుట యెంతయు ముదావహము. శైలీనిరూపనార్థము ఒండు రెండు నిదర్శనములు.

మూలము :

శ్లో. ఆయీపల్లవితైః పరస్పరయుతై
ర్ద్విత్రిక్రమాద్యక్షరైః
కాద్యైః క్షాంతగతైః స్వరాదిభిరథ
క్షాంతైశ్చతై స్సస్వరైః
నామాని త్రిపురే భవంతి ఖలు
యాన్యత్యంత గుహ్యాని తే
తేభ్యో భైరవపత్ని వింశతి సహస్రేభ్యః
పరేభ్యో నమః.

లఘుస్తవము - 19.

అనువాదము :

శా. ఆకారాదిక పల్లవ ప్రతతిచే
నన్యోన్య సంశ్లిష్టత
* నైకాకారమునంది కాద్యమయి క్షా
న్తమ్మైన వర్ణాళిచే

లోకంబందుఁ ద్వదీయనామములు పో
ల్చున్ వేనవేల్ గోప్యమై
యీ కల్యాణద నామకోటి కివె జో
హారుల్ మహాభైరవీ !

మూలము :

శ్లో. జగత్కాయే కృత్వా తదపి హృదయే తచ్చపురుషే
పుమాంసం బిందుస్థం తదపివియదాఖ్యేచ గహనే
తదే తత్ జ్ఞానాఖ్యే తదపి పరమానంద గహనే
మహావ్యోమాకారే త్వదనుభావశీలో విజయతే.
సకలజననీ స్తవము – 20.

అనువాదము :

మ. జననీ ! మూలమునుండి సక్రమముగాఁ
జక్రమ్ము లొండొంటిలో
ననుపాప్పంగఁ దదాత్మతం గనెడి య
ట్లభ్యాసియై యాతఁడ
ఘననైహాయసరూపమైన పరమా
నందాత్మకాచ్ఛాటవిఁ
నినుసేవించెడివాఁ డఖండ సుఖియై
(ముం జెందఁడే.

గ్రంథాంతమునందు వివరణమునుగూడ అనువాదకులు జేర్చియున్నందున ఈ గ్రంథము సాధకలోకము కెంతయు దోడ్పడగలదనుటకు సందియము లేదు. ఇట్టి పారమార్థిక గ్రంథరాజములే భారతదేశమునే కాక సమస్త ప్రపంచమును నేటి కల్లోలమునుండి తప్పింపగలవు. అనువాదకులు ఈ మార్గమున దేశసేవ చేసి దేవీయనుగ్రహమునకు బాత్రులగుదురు గాక !

### శ్రీ రామనామము

డబుల్ క్రౌన్ 1/16 సైజు (96 + 12) పుటలు. అనువాదకులు : శ్రీ చారాల నరసింహమూర్తి. ప్రాప్తిస్థానము : శ్రీ సీతారామ నామసంకీర్తన సంఘము, శ్రీ రామనామ క్షేత్రము, గుంటూరు.

ఇది శ్రీ మహాత్మాగాంధీగారి ఆంగ్లప్రబోధమున కాంధ్రానువాదము. గాంధీమహాత్ములు నవభారతము, హరిజన పత్రిక మున్నగువాని మూలమునను, స్వీయప్రార్థన మూలమునను ప్రబోధించిన రామనామ మాహాత్మ్యమును సేకరించి శ్రీ భరతన్ కుమారప్ప గ్రంథస్థము కావించెను. దాని యాంధ్రీకరణమే యిది. ఇందలి భాష నాతికఠినమై చదువరుల నానందింపజేయుచున్నది. వివిధ సమయములందు వివిధవ్యక్తులకు రామనామమునందు గలిగిన సందేహములకు శ్రీ గాంధీమహాత్ములు చేసిన వివరణమే ఈ గ్రంథము కావున ఇది నిజమగు సాధకలోకమునకు నిజముగా సహాయకారి కాగలదు. స్త్రీలకు బాలురకు సంసారులకు సన్న్యాసులకు— అందరకును శ్రీ రామనామ మెట్లు అవసరమో, సహాయకారియో ఈ గ్రంథము చక్కగా వివరించుచున్నది.

### శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము

డబుల్ క్రౌన్ 1/16 సైజు (58 + 6) పుటలు. ప్రకాశకులు : శ్రీ నిత్యానందగిరి స్వామి. ప్రాప్తిస్థానము : కైలాసాశ్రమము, కాళహస్తి, చిత్తూరుజిల్లా. (రూ. 0–4–9 పోస్టుబిళ్లలు పంపువారికిని, స్వయముగా కైలాసాశ్రమమునకువచ్చి కోరువారికిని ఈ గ్రంథము ఉచితముగా నొసగబడును.)

ఇది శ్రీమచ్ఛంకరాచార్యుల తత్త్వబోధకు ఆంధ్రవివరణము. శ్రీవారి శ్లోకములకు టీకయు, తాత్పర్యమును విశేషార్థరూపకమగు వ్యాఖ్యానమును నిందు గలవు. ఇది ప్రశ్నోత్తర రూపమున నున్నది. ముముక్షువుల కత్యంతోపయుక్తమగు గ్రంథము.

# సంఘ వార్తలు

### చెన్నపురి శ్రీ రామకృష్ణ మఠమున జరుపబడిన

## శ్రీ రామకృష్ణానందస్వాములవారి జన్మదినోత్సవము

క్రీ.శ. 1952–వ సం జూలై 19 న శ్రీరామకృష్ణానందస్వాములవారి జన్మదినోత్సవము చెన్నపురి శ్రీ రామకృష్ణ మఠమున జరుపబడినది. ఆనాడు విశేషపూజాహోమానంతరము సుమారు 200 భక్తులకును, 400 బీదలకును అన్నప్రసాదమొసగబడెను. సంధ్యాకాలమున దీపారాధనానంతరము మఠాధ్యక్షులు శ్రీ కైలాసానందస్వాములవారు శశిమహారాజుల (శ్రీ రామకృష్ణానందస్వాముల) వారి జీవితమునుగూర్చియు, అత్యద్భుతమగు శ్రీవారి గురుభక్తినిగూర్చియు వివరించిరి. శ్రీ కృష్ణభగవానుడు భగవద్గీతయందు ప్రవచించిన 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా' యన్న విషయము శ్రీ రామకృష్ణానందస్వాములయందు మూర్తీభవించినదనియును శ్రీవారు ఆదర్శసాధుపుంగవులనియును తెలిపిరి.

20 జూలై 1952 న మఠమున బహిరంగ సమావేశము జరుపబడెను. అందు శ్రీ నిశ్శ్రేయసానందస్వాములవారు, శ్రీమాన్ కె. బాలసుబ్రహ్మణ్య అయ్యర్, ఎమ్. ఎల్. సి.— వీ రిరువురును శ్రీ రామకృష్ణానందులవారి మహాత్త్వమును దెలుపుచు నుపన్యసించిరి.



## శ్రీ రామకృష్ణనాగ వైద్యశాల

చెన్నపురి శ్రీ రామకృష్ణమఠమువారిచే నడుపబడుచున్న వైద్యశాలా ప్రారంభకులగు డాక్టర్ శ్రీ బెనగల్ రాఘవేంద్రరావుగారును, ఈ వైద్యశాలకొఱకు పాతిక సంవత్సరములు కష్టించిన డాక్టర్ శ్రీ జి. యస్. కత్రే, ఎం. బి., బి. యస్.—వీ రిరువురును జూలై నెల 22 వ తారీఖున పరలోకగతులైరని తెలుపుటకు మే మెంతయు చింతిల్లుచున్నాము. సివిల్ సర్జన్ పదవినుండి విరమించిన డాక్టరు శ్రీ రాఘవేంద్రరావుగారు 1925 వ సంవత్సరము సెప్టెంబరు 27 వ తారీఖున వ్యాధిబాధితులకు సేవ సేయు నిమిత్తము స్థాపింపబడిన ఈ ధర్మవైద్యశాలా కార్యక్రమమును ప్రారంభించిరి. వారుచూపిన అనురాగమువలన నెందరో రోగులు సంపూర్ణ నమ్మకముతో మఠ వైద్యశాలకు వచ్చుచుండెడివారు. ఒక్క సంవత్సరమయిన పిదప డాక్టర్ శ్రీ కత్రేగారు ఈ సేవాకార్యమునందు పాలుపుచ్చుకొనిరి. వీ రిరువురి సేవాకైంకర్య మెన్నటికిని మరువరానిది. భగవంతుడు వీ రిరువురకు ఆత్మశాంతిని ప్రసాదించుగాక. వీరి కుటుంబీకులకు మా సానుభూతి.



# విజ్ఞాపన

## శ్రీ మాతృదేవి శతవార్షిక జన్మదినము

ప్రపంచమునందంతటను అనేకులు శ్రీ రామకృష్ణభగవానులయొక్కయు శ్రీ వివేకానందస్వామియొక్కయు జీవితములను ఉపదేశములను చక్కగా ఎరిగియే యున్నారు. కాని వారిలో అనేకులకు మాతృదేవి శ్రీ శ్రీ శారదాదేవినిగూర్చి ఎక్కువగా తెలియదు. ఏకాంత జీవితమని చెప్పదగిన ఆమె సామాన్యజీవితము పెద్ద యగాధమై విశ్వాత్మకముగా కన్పించుచు మానవకోటికి తగిన అమూల్యబోధనలను కలిగించుచున్నది.

ఐదుసంవత్సరముల ప్రాయమున శ్రీ రామకృష్ణుని వివాహమాడి ప్రశాంతమైన ఒక కుగ్రామమందలి తన ఇంటియందే పెరిగినది. ఆమె వయస్సు సుమారు పదునాలుగు సంవత్సరములున్నప్పుడు శ్రీ రామకృష్ణులు జబ్బుపడి ఆరోగ్యమునకై స్వగ్రామమునకు చేరిరి. అప్పుడు శ్రీ శారదాదేవిని దగ్గర కూర్చుండబెట్టికొని ప్రాపంచకమునకును ఆధ్యాత్మికమునకును సంబంధించిన అనేక అమూల్యవిషయములను ఆమెకు బోధించిరి. ఆ కొద్దిపాటి సంబంధమే ఆమె మనోఫలకమునందు మరపురానిదై హత్తుకొనియున్నది.

పై నుడివిన సన్నివేశముతప్ప వారెల్లప్పుడును పరాయివారివలె సంబంధములేక వేరు వేరుగా జీవించుచుండిరి. దీనికి ముఖ్యకారణము శ్రీ రామకృష్ణులు అప్పుడు దీర్ఘతరమును కష్టతరమును అగు ఆధ్యాత్మికనిష్ఠకు లోనై సదా దివ్యసమాధిలో మునిగి ప్రపంచమును దాని సంబంధములను పూర్తిగ విస్మరించుటయే.

1873 వ సంవత్సరమున శ్రీ శారదాదేవి 19 సంవత్సరముల నిండుయౌవ్వనమున నుండ, భర్త శ్రీ రామకృష్ణులకు పిచ్చిపట్టినదని లోకులు చెప్పుకొనుచున్న వార్తలు ఆమె చెవిని బడినవి. మిక్కిలి విచారించి దైన్యముతో గురుమహారాజుగారి ప్రక్కనుండి కావలసిన పరిచర్య చేయుటయే తన విధ్యుక్తధర్మమని ఆమె నిశ్చయించుకొనినది. కష్టనష్టములకోర్చి జయరాంబాటీనుండి బయలుదేరి 60 మైళ్లు నడచి దక్షిణేశ్వరమును చేరినది.

తరువాతి ఆమె జీవిత చరిత్ర అంతయు మహామాయగా కన్పించుచున్నది. శ్రీ రామకృష్ణుని ఎల్లప్పుడును దివ్యతన్మయత్వముననే ఆమె చూచెను. కాని ఆమెను చూచినప్పుడు శ్రీ రామకృష్ణులు ఆమె తన సహధర్మచారిణి యని ఒప్పుకొనియు తన ఆత్మ దివ్యాయత్తమని చూపెను. శ్రీ శారదాదేవియు ఆధ్యాత్మిక జిజ్ఞాసలో గురుమహారాజునకు తీసిపోలేదు. ఆమె కుటుంబజీవితమందలి తుచ్ఛవిషయసుఖములను వెంటనే వదలిపెట్టినది. భర్త పొందిన ఆధ్యాత్మిక ఉత్తాలశిఖరములను తానుగూడ


WHEN BUYING ASAFOETIDA
Specify
L.G
the Mark of Quality

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీ మద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసారప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

432 పుటలు పండిత పామర రంజకమైన శైలి. అందమగు 6-వ కూర్పు రూ. 3-0-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు ఇంటింటను ఉండతగిన దివ్యగ్రంథము. ముద్దులొలుకు రెండవ కూర్పు వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

186 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు ... | 2 | 8 | 0 | గురూపదేశములు ... | 0 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము ... | 2 | 4 | 0 | నాసంస్కరణ యుద్ధవిధానము ... | 0 | 6 | 0 |
| రాజయోగము ... | 2 | 4 | 0 | నా గురుదేవుడు ... | 0 | 6 | 0 |
| కర్మయోగము | 1 | 8 | 0 | శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | 0 | 4 | 0 |
| భక్తియోగము ... | 1 | 4 | 0 | నవీన భారతదేశము ... | 0 | 4 | 0 |
| వివేకానంద లేఖావళి (మొదటి భాగము) | 1 | 8 | 0 | ముక్తిమార్గము ... | 0 | 8 | 0 |
| వివేకానంద లేఖావళి (రెండవ భాగము) | 1 | 8 | 0 | సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | 0 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము ... | 1 | 4 | 0 | శ్రీ రామనామ సంకీర్తనము ... | 0 | 1 | 0 |
| వివేక సూర్యోదయము ... | 1 | 0 | 0 | యతిగీతము (పద్యకావ్యము) ... | 0 | 1 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | 0 | 12 | 0 | నా మతము 0 0 6 డజను | 0 | 5 | 0 |
| భక్తిమార్గము ... | 0 | 8 | 0 | సింహ గర్జన 0 0 6 డజను | 0 | 5 | 0 |
| చికాగో నగరోపన్యాసములు ... | 0 | 8 | 0 | | | | |

ఇవియే కాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాస పత్రికలును మా యొద్ద దొరకును

శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మా యొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-8-52.

# విషయసూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరఁదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులోఁగాని, మీ పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

3. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪ చిరునామాయందు ఎట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముంగుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧ కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములే కాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథికభాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల మొదటి తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

3. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీ రామకృష్ణ ప్రభ శ్రీ రామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౯ } ౧౯౫౨ – సెప్టెంబరు : : నందన – భాద్రపదము { సంచిక ౩

## ప్రార్థన

## శ్రీ దేవీ పంచస్తవి

శ్రీ మన్మహాకవి కాళిదాసు

శ్లో. విప్రాః క్షోణిభుజో విశస్తదితరే క్షీరాజ్య మధ్వాసవైః
త్వాందేవి త్రిపురే పరావరమయీం సంతర్ప్య పూజావిధౌ
యాం యాం ప్రార్థయతే మనఃస్థిరధియాం తేషాం తఏవధ్రువం
తాం తాం సిద్ధి మవాప్నువంతి తరసా విఘ్నైః రవిఘ్నీకృతాః

తా. ఓ దేవీ! పరాపరమయీ! నిన్ను విప్రులు పాలతోడను, క్షత్రియులు నేయి తోడను, శూద్రులు మధుమాంసములతోడను పూజించి తనుపగా వారివారి కోర్కెలన్నియు వెంటనే నిశ్చయముగా నిర్విఘ్నముగా కొనసాగును.

శ్లో. త్వద్రూపైక నిరూపణప్రణయితాబన్ధో దృశో స్త్వద్గుణ
గ్రామాకర్ణన రాగితాశ్రవణయో స్త్వత్సంస్మృతి శ్చేతసి
త్వత్పాదార్చన చాతురీకరయుగే త్వత్కీర్తితం వాచిమే
కుత్రాపి త్వదుపాసన వ్యసనితా మే దేవి మాశామ్యతు.

తా. ఓ దేవీ కన్నులకు నీ రూపావలోకనమునందలి యుత్సాహము తగ్గనియట్లును, చెవులకు నీ గుణ సందోహాకర్ణనమునందలి కుతూహలము సన్నగిల్లనియట్లును, మనస్సున

నీ స్మరణాభిలాష సడలనియట్లును, కరములు నీ పాదార్చనచాతురిని వదలనియట్లును, వాక్కు నీ కీర్తనమును బాయనియట్లును, నీ యుపాసనమునందలి మమతను విడువని యట్లును గరుణింపుము.

శ్లో. యస్త్వాం ధ్యాయతివేత్తి విందతి జపత్యాలోకతే చింతయ
త్యన్వేతి ప్రతిపద్యతే కలయతి స్తౌత్యాశ్రయత్యర్చతి
యశ్చ త్ర్యంబకవల్లభే తవగుణా నాకర్ణయత్యాదరాత్
తస్య శ్రీర్నగృహాదపైతివిజయ స్తస్యాగ్రతో ధావతి.

తా. ఓ శాంభవీ! ఎవరు నిన్ను ధ్యానించుచు, దెలిసికొనుచు, తానే నీవని వినుచు, నిన్నే చూచుచు, జపించుచు, తలంచుచు, పొగడుచు, నీ గుణజాలము నాకర్ణించుచు, నిన్ను ప్రతిష్ఠించి పూజించుచుందురో వారి గృహములను లక్ష్మి వీడదు. వారికి సర్వకార్యజయము తప్పక సిద్ధించును.

శ్లో. యా మామనంతి మునయః ప్రకృతిం పురాణీం
విద్యేతి యాం శ్రుతిరహస్యవిదో వదంతి
తా మర్ధపల్లవిత శంకరరూపముద్రాం
దేవీ మనన్య శరణః శరణం ప్రపద్యే.

తా. ఏ దేవిని మునులు అనంతియనియు ఆరంభకయనియు ప్రస్తావింతురో, పౌరాణికులు వేదార్థజ్ఞానరూపయని ప్రశంసింతురో, భగవంతుడగు శంకరుని వామదేహమై భాసిల్లు ఆ తల్లిని నీవె నా శరణమని సదా కొలిచెదను.

శ్లో. అజానంతో యాంతి క్షయ మవశమన్యోన్య కలహైః
అమీ మాయాగ్రంథౌ తవపరిలుఠ న్త స్సమయినః
జగన్మాతర్జన్మ జ్వరమయతమః కౌముది వయం
నమస్తే కుర్వాణాః శరణ ముపయామో భగవతీమ్!

తా. ఓ భగవతీ! మాయయందుజిక్కి తప్పించుకొనజాలక అజ్ఞులై అన్యోన్యవివాదము లకు లోనై సమయులు నశింతురు. తల్లీ, నీవే నాదిక్కు. నన్ను మాయలో ముంపవలదు. ఇవే నీకు నా నమస్కారములు.

---

# శ్రీ దేవీ దండకము

శ్రీవిష్ణుశక్తీ! జగన్మూలశక్తీ! త్రిశక్తీ! మహాశక్తి! నారాయణీ! దేవి! మా మ్రొక్కు గైకొమ్ము కాష్ఠాదికాలస్వరూపంబులం జేసి పాకంబు గావించి లోకంబులన్మ్రింగు నారాయణీ! దేవి! మా మ్రొక్కు గైకొమ్ము సర్గస్థితిధ్వంసనంబుల్ప్రవర్తన్నిమిత్తంబ త్రైగుణ్యమూర్తీ! జగద్గీతసత్కీర్తి! నారాయణీ! దేవి! మా మ్రొక్కు గైకొమ్ము రమ్యాక్షసూత్రాది చిహ్నావలిం దాల్చి హంసంబుపై నీవు బ్రహ్మాణివై యొప్పు నారాయణీ! దేవి! మా మ్రొక్కు గైకొమ్ము వాలుం ద్రిశూలంబుఁ గేలన్ వెలుంగంగ బాలేందురోచుల్ జటాలంకృతిం జేయ మాహేశ్వరీమూర్తిఁ బెంపారి యాబోతుమీఁద న్వెలుంగొందు నారాయణీ! దేవి! మా మ్రొక్కు గైకొమ్ము హస్తమ్ముల న్జక్రశంఖాది లోకప్రశస్తాయుధమ్ముల్ మెఱుంగారఁగా వైష్ణవీరూపలీల న్విహారంబు గైకొన్న నారాయణీ! దేవి! మా మ్రొక్కు గైకొమ్ము రాజన్మయూరంబుఁ దేజంబుతో నెక్కి చే శక్తి శోభిల్లఁ గౌమారివై పొల్చు నారాయణీ! దేవి! మా మ్రొక్కు గైకొమ్ము వారాహివై యేకదంష్ట్రంబున న్నీవు ధాత్రీతలం బెత్తి శ్రీనారసింహాకృతిన్ దైత్యులం ద్రుంచి లోకైకరక్షావిధి న్ధన్యవై నట్టి నారాయణీ! దేవీ! మా మ్రొక్కు గైకొమ్ము చూడాకిరీటంబు దోర్వజ్రము న్బ్రజ్వరిల్లంగ వేగన్నులుం గ్రాల వృత్రాదివీరారులం ద్రుంచి మాహేంద్రివై యున్న నారాయణీ! దేవి! మా మ్రొక్కు గైకొమ్ము శ్రీకంఠదూతీ! శివా,! ఘోరనాదంబు మ్రోయంగ దైతేయులం జంపి యుగ్రాజిఁ జెల్వారు నారాయణీ! దేవి! మా మ్రొక్కు గైకొమ్ము దంష్ట్రాకరాళాననంబు న్శిరోమాలికా దీప్తిజాలంబును న్దేజరిల్లంగ సంగ్రామరంగంబునం జండముండాదులం గిట్టి చెండాడి చాముండవై మేదిని న్బెంపున న్మెఱు నారాయణీ! దేవి! మా మ్రొక్కు గైకొమ్ము లక్ష్మీస్వధాపుష్టిలజ్జామహారాత్రివిద్యాదిరూపంబుల న్బాజ్యవై యుండు మేధావిభూతీ! శివా! వాణి! శర్వాణి! నారాయణీ! దేవి! మా మ్రొక్కు గైకొమ్ము సర్వంబునం బాణిపాదాస్యముల్ గల్గి సర్వంబునన్ శీర్షనేత్రాంగముల్ గల్గి సర్వంబున న్నాసికాకర్ణముల్ గల్గి సర్వంబు నీవైన సర్వేశ్వరీ! సర్వశక్త్యాత్మికా! సర్వరూపా! మహాదుర్గ! మా మ్రొక్కు గైకొమ్ము మమ్మర్థి రక్షింపు ముక్కన్నులం జాలఁ జెన్నొందు నీమోము కాత్యాయనీ! మమ్ము నే భీతియుం బొందకుండంగ రక్షించు రక్షోగణాభీలమై నీదుశూలంబు శ్రీభద్రకాళీ! మముం దాన రక్షించు నాదంబున న్దిక్కులల్లార్చు నీఘంట దోషంబులం దోలి మమ్మెప్డు రక్షించు నక్తంచరశ్రేణిరక్తంబునం దోఁగి కెంజాయ రంజిల్లు నీవాలు మమ్మేలుచు న్మేలు గావించు రోగంబులం బాచి రాగంబుతో నీవు మాకుం బ్రసాదింపు సంతుష్టవై యిష్టకామంబు లేప్రొద్దు దేవీ! నిను న్భక్తి సేవించు సద్భక్తసంఘంబు లెన్నండు నే దుఃఖముల్ పొంద కే బాధలం జెంద కానందలీల న్సుఖంబుండఁ గాంచున్ నమస్తైకభద్రా! నమస్తైకపుణ్యా! నమస్తే నమస్తే నమః.

—మార్కండేయపురాణము.



ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ।

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

## దక్షిణేశ్వరాలయమున భక్తులతో శ్రీ రామకృష్ణుడు

14 డిసెంబరు 1883.

'మ.' పంచవటియందలి దేవాలయముల యొద్ద నొంటరిగా దిరుగుచుండెను. శ్రీ రామకృష్ణోపదేశములన్నియు ఆయన మనస్సున పదేపదే స్ఫురించుచుండెను—"భగవద్దర్శన మసాధ్యమగునదిగాదు. ఎవరైనను కొంచెము సాధనచేసిన యెడల తప్పక భగవద్దర్శనము నందగలరు. మాయను ఏకొంచెముగానైనను గుర్తించినచో తక్షణమే అది తొలగిపోవును."

మూడున్నరగంటలైనది. 'మ.' శ్రీ రామకృష్ణులగదికి వచ్చి కూర్చొనెను. అప్పుడు బ్రౌటన్ ఇన్‌స్టిట్యూషన్ (Broughton Institution) లోని ఉపాధ్యాయుడు కొందరు విద్యార్థులతో శ్రీ రామకృష్ణులను జూడ వచ్చెను. శ్రీ రామకృష్ణ గురుదేవుడు వారితో మాట్లాడుచుండెను. ఉపాధ్యాయుడు మధ్యే మధ్యే ప్రశ్నించుచుండెను. విగ్రహారాధనను గూర్చి ఆలోచన జరిగెను.

శ్రీ రామ:—(ఉపాధ్యాయునిజూచి) విగ్రహారాధనయందు తప్పేమిగలదు? వేదాంతమున ఎచ్చట 'అస్తిభాతిప్రియము' లుండునో అచ్చటనే భగవత్ప్రకాశము కలదు. ప్రపంచమునందు భగవానుడుతప్ప నితరమేదియు లేదు. బాలికలు బొమ్మలతో నాటలాడుకొనుచుందురు. ఇదంతయు పెండ్లిచేసికొని భర్తతో కాపురముచేయువఱకే. వివాహానంతరము ఆ బొమ్మలను మూటగట్టి మచ్చునబెట్టుదురు. భగవద్దర్శనానంతరము విగ్రహారాధనవలని ప్రయోజనమేమికలదు? 'మ.' వైపు చూచుచు అనురాగము కలిగినచో భగవల్లాభము కలుగును. తీక్ష్ణమయిన వ్యాకులత ఆవశ్యకము. మిక్కిలిగా వ్యాకులమున్నచో మనస్సంతయు భగవదభిముఖముగనే పరువెత్తును.

ఒకనికి ఒక కుమార్తె గలదు, ఆమెకు పసిప్రాయముననే వివాహమయి వితంతువాయెను. భర్తముఖముగూడ ఆ అమ్మాయి ఎరుగదు. ఇరుగుపొరుగు బాలికల భర్తలు వారిండ్లకు వచ్చుటనుజూచి తనతండ్రిని జేరి 'నా భర్త ఏడి' అని యడిగెను. అంతట తండ్రి 'నీ భర్త గోవిందుడు, నీవు పిలిచినచో నీకు కనిపింపగలడు' అని బదులుచెప్పెను. పిదప ఆ బాలిక తలుపు మూసికొని లోనగూర్చొని 'గోవిందా! రమ్ము. నాకు కనిపింపుము. నీవేల రావైతివి' అని విలపించుచు బిలువదొడగెను. ఆ బాలిక ఆర్తనాదము విని భగవాను డూరుకొనలేక పోయెను. గోవిందు డామెకు సాక్షాత్కరించెను.

బాలురవలె సరళస్వభావ మెంతయు నావశ్యకమయినది. తల్లిని జూచుటకై బిడ్డలకు గలుగునంతటి వ్యాకులము సహితము ఆవశ్యకము. ఇట్టి వ్యాకులము కలిగినచో అదియే అరుణోదయము. ఇక సూర్యుడు తప్పక ఉదయించును. ఇట్టి వ్యాకులానంతరమే భగవద్దర్శనము.

జటిలుని కథ యిట్లు ప్రవచింపబడియున్నది. అతడు బడికి ప్రతిదినము వెళ్లుచుండువాడు. మార్గమధ్యమున నొకానొక యడవి గలదు. అతనికి భయము కలిగెడిది. దీనినిగూర్చి తల్లికి జెప్పగా తల్లి 'నీకీ భయమేల? నీవు మధుసూదనుని బిలువుము' అని పలికెను. జటిలుడు 'మధుసూదను డెవ'రని ప్రశ్నించెను. 'మధుసూదనుడు నీ యన్న' యని తల్లి వచించెను. అంతట నొంటరిగా పోవుచున్నపుడెల్ల భయముకలిగినపుడంతయు 'అన్నా మధుసూదనా' అని పిలువదొడంగెను. ఎచ్చటను ఎవరును కనిపింపలేదు. అపుడు బిగ్గరగా నేడ్చుచు 'అన్నా మధుసూదనా ఎందుంటివి? నాకు మిక్కిలి భయము కలుగుచున్నది' అని అఱువ మొదలిడెను. అంతట భగవానుడువచ్చి, ఇదిగో నేనున్నాను గదా! ఏల నీకీ భయము' అని భయముడిపి అతనిని బడివఱకును దీసికొనివెళ్లి వదలిపెట్టి, 'నీకు భయముకలుగునపుడెల్ల నన్ను బిలువుము, నేను వచ్చెదను. భయపడకుము' అని చెప్పెను. ఇదియే సరళస్వభావముగలవారి విశ్వాసము. ఇట్టి వ్యాకులతయే కావలయును.

ఒక బ్రాహ్మణునియింట దేవతార్చన జరుగుచుండెడిది. ఒకదిన మతడెచటికో పోవుచు, తన చిన్నికుమారుని బిలిచి, 'నాయనా! ఈ రోజు నీవు భగవానునకు నివేదనచేసి భోజనము పెట్టుము' అని చెప్పి వెళ్లిపోయెను. బాలుడు నివేదన చేసెను. కాని భగవాను డూరక కూర్చొనియే యుండెను. పలకడు, ఉలకడు, ఏమియు తినడు. బాలు డెంతయోసేపు కూర్చొని చూచెను గాని భగవానుడు లేవలేదు. భగవంతుడువచ్చి తానుబెట్టిన పీటమీద గూర్చొని భుజించునని అతని నమ్మకము. అందువలన వాడు మాటిమాటికి 'దేవా! రా! భుజింపుము. వేళమించినది. నేనిక కూర్చోజాలను' అనుచుండెను. అప్పటికి ఎవరును మాటాడలేదు. అంత బాలునకు ఏడ్పు కలిగినది. వాడు ఏడ్చుచు 'నాయన నీకు భోజనము పెట్టుమని చెప్పిపోయెను. నీవేల రావు? ఏల తినవు? నాతో భుజింపవా ఏమి?' అని ఎంతయో వ్యాకులముతో నేడ్చెను. అట్లు కొంతసేపు ఏడువగా భగవంతుడిక నూరకొనలేక నవ్వుచు పీటమీదికివచ్చి కూర్చొని భుజింప మొదలిడెను. భగవానుడు భుజించిన పిదప బాలుడు బయటికిరాగా ఇంటివారు వానిని జూచి 'నైవేద్యమయినదా? పళ్లెముల దీసికొని రమ్ము' అని చెప్పిరి. వెంటనే 'నైవేద్యమయినది. అంతయు భగవానుడే భుజించెను' అని బాలుడు సమాధానించెను. అంత వారందరును 'అదేమి?' అని ఆశ్చర్యమును వెలిబుచ్చిరి. కాని బాలుడు 'ఏల? భగవంతుడువచ్చి భుజించెను' అని చెప్పెను. అందరును దేవతార్చన గదికి వెళ్లి చూడగ పళ్లెములన్నియు ఖాళీగా నుండెను.

సాయంకాలమయినది. శ్రీ రామకృష్ణ గురుదేవుడు 'మ.' తో నహబత్తుదగ్గర నిలుచుకొని మాట్లాడుచుండిరి. ఎదుట గంగానది ప్రవహించుచుండెను. అది చలికాలము కావున

రామకృష్ణ గురుదేవు డొక ఉన్నిశాలు

వను గప్పుకొనియుండెను. 'మ.' తో : 'పంచ వటి దగ్గరి గదిలో పరుండెదవా?'

'మ.' నహబతుఖానాపై నున్న గది నీయరా?

శ్రీ రామకృష్ణులు దేవాలయాధికారితో 'మ.' ఆ గదిలో నుండగల ఏర్పాట్లు గావించిరి. 'మ.' కు నహబత్ ఖానా మిక్కిలిగా బాగున్నదనిపించినది. ఎదుట గంగానది, నీలాకాశము, చంద్రకాంతి, పుష్పోద్యానము— ఇవన్నియు కనిపించుటవలన అవి అన్నియు మిక్కిలిగా అతనికి హర్షోత్కర్షము గల్గించుచుండెను.

రామ:—ఎందుకీయరు? కాని పంచ వటి గదియం దెందరో హరినామసంకీర్తనము, జపము, ధ్యానము చేసియున్నారు.

సాయంకాలమున శ్రీ రామకృష్ణులవారి గదియందు ధూపము వేయబడెను. చిన్న మంచముమీద కూర్చొని శ్రీ రామకృష్ణ గురుదేవుడు ధ్యానముచేయుచుండెను. 'మ.', రాఖాల్, లాటు, రామ్‌లాల్—వీరందరును క్రింద కూర్చొనియుండిరి.

శ్రీ రామకృష్ణ గురుదేవుడు 'మ.' తో భగవత్ప్రేమ, భక్తి—వీనినిగూర్చి మాట్లాడెను. పిదప రామలాలును పాట పాడుమనగా అతడు మధురస్వరముతో కొన్ని పాటలు పాడెను. ఆ పాటలు శ్రీ గౌరాంగుని సన్న్యాసమునకు సంబంధించినవి. పాట భావము :

ఆహా! నా కెట్టిదృశ్యము గోచరమగుచున్నది ఈ కేశవభారతి కుటీరమున అపురూపజ్యోతిర్మయమగు శ్రీ గౌరాంగుని మూర్తి! అతని నేత్రద్వయమునుండియు ప్రేమాశ్రువులు సంతతధారగా ప్రవహించుచున్నవి. శ్రీ గౌరాంగుడు మత్తమాతంగమువలె ప్రేమావేశముతో నర్తనముచేయుచు పాడుచున్నాడు. ఒకప్పుడు ధూళియందుబడి పొరలుచున్నాడు. ఏడ్చుచు స్వర్గమర్త్యముల భేదింపగల సింహగర్జనము వంటి గర్జనముతో హరినామము స్మరించుచున్నాడు. గడ్డిపరకను నోటకైకొని కృతాంజలియై ముక్తికొఱకు ప్రార్థించుచున్నాడు. సుందరములగు ముంగురులదీసివైచి యోగివేషధారి యయ్యెను. అతనిభక్తి ప్రేమావేశముచూడ మా శరీరము గగుర్పొడుచుచున్నది. జీవుల దుఃఖము సహింపజాలక భగవత్ప్రేమామృతమును వెదజల్లుటకు సమస్తమును త్యజించి వచ్చియున్నాడు. ఇట్టి మహాప్రభువగు శ్రీ చైతన్యచరణాశ్రితుడై యుండుటయే ప్రేమదాసు నభిలాష.

ఈ పాట ముగిసిన పిదప శ్రీ చైతన్యజీవిత సంబంధములగు రెండు మూడు పాటలు పాడి శ్రీమతి రాధనుగూర్చి ఈ పాట పాడెను. (పాట భావము)

రాధాదర్శనము అందరకును లభించునా? ఆమెకు కలిగినట్టి ప్రేమ అందరకునుగలుగునా? అతిదుర్లభమగు ఆధనము ఆరాధననినా, సాధన సలుపనిదే లభించునా? తులామాసమున అమావాస్యనాడు స్వాతినక్షత్రమున కురియువర్షమే వర్షము. ఇతరమాసములందు కురియువర్షములు నిష్ఫలములు. యువతులందరును తమ పిల్లలను ఒళ్లలో పెట్టుకొని చేయియెత్తి చంద్రుని పిలుతురు. పిల్లలందరును నమ్మెదురు. అట్లయినచో చంద్రుడుగూడనమ్మి గగనమునువిడిచి భూమండలమునకు దిగివచ్చునా?

పాట ముగియగనే శ్రీ రామకృష్ణగురుదేవుడు సరే, 'గౌరనితాయులు మీ రిరువురు

సోదరులు' అన్న పాట పాడుమని చెప్పి రామలాలుతో తానుగూడ పాట మొదలుపెట్టెను. (పాట భావము).

ఓ ప్రభూ! గౌరనితాయులు మీ రిరువురు సోదరులును పరమదయాళురుననివిని మిమ్ము జూడవచ్చితిని.

నేను కాశీపట్టణమునకు బోయితిని. అచ్చట విశ్వేశ్వరుడు పరబ్రహ్మము శచీదేవియింట బుట్టునని చెప్పెను.

ఓ పరబ్రహ్మమా! నిన్ను నేను కనుగొంటిని. ఎందరో మహాత్ముల జూచితిని, కాని నీయట్టి దయాళుని జూడలేదు.

మీ రిరువురును యదుపురమున శ్రీ కృష్ణ బలరాములుగ నవతరించితిరి. ఇపుడీనదియాదేశమున గౌరనితాయులై అవతరించితిరి. వ్రజపురమున బరువులెత్తుటయే యిచ్చటి (హరినామోచ్చారణమున ప్రేమోన్మత్తులై) దూళియందు పొరలుట.

వ్రజపురమున క్రీడ (కేకలు)! ఇచ్చట హరి నామసంకీర్తనము! ఇందు మీ శరీరమంతయు, వేషమంతయు, దాగియున్నది. కాని మీ నేత్రములుమాత్రము మిమ్ములను దెలుపుచున్నవి.

పతితపావనులగు మీ నామములవిని మిమ్ము కలిసికొనవలయునని నాకు ఆశ జనించినది. ఎంతో ఆశతో వచ్చితిని. మీ పాదసన్నిధిని నాకు స్థలమొసంగవలయును. జగాయి మాదాయిలను మిమ్ము తలచినపుడు ఈ అధమునకును నమ్మకము గలుగుచున్నది. ఓ పరమ కారుణికులారా! మీరు చండాలుని సైతము ఒడిలోనికి దీసికొని హరినామము జెప్పింతురని విని యున్నాను.

నహబత్ పైన ఒకగది 'మ.'కు ఏర్పాటు చేయబడెను. 'మ.' ఆగదిలో ఒంటరిగా గూర్చొనియున్నాడు. ఆనాడు మార్గశీర్ష పౌర్ణమి. ఆకాశము, గంగ, కాళీదేవాలయము, దేవాలయశిఖరము, ఉద్యానవన మార్గములు, పంచవటి— ఇవన్నియు చంద్రకాంతితో నింపబడియున్నవి. 'మ.' ఒంటరిగాగూర్చొని శ్రీ రామకృష్ణగురుదేవుని దలచుచుండెను. రాత్రి మూడుగంటలయినది. 'మ.' లేచెను. ఉత్తర దిక్కునకున్న పంచవటికి బోయెను. శ్రీరామకృష్ణగురుదేవుడు పంచవటినిగూర్చి చెప్పియున్నారు గదా! అతనికిక నహబత్ ఖానా నచ్చలేదు ; పంచవటియందలి గదియందే యుండదలంచెను.

ఎందుజూచినను నిశ్శబ్దము! అతడు నడచుచుండ దారియందెచ్చటనుండియో మానవ భాషణములు వినిపించెను. ఎవరో పంచవటి వృక్షమ్మూలమునుండి 'అన్నా! మధుసూదనా! ఎందుంటివి' అని పిలిచిన ఆర్తనాదము రెండు మూడుసార్లు వినిపించెను. ఎవరో ఒంటరిగా నిర్జనస్థలమునగూర్చొని భగవంతుని బిలుచుచుండెనని 'మ.' గమనించెను.

# దేవ్యారాధన

ప్రపంచమున విశ్వశక్తి నానారూపములతో మనకు ప్రత్యక్షమగుచున్నది. పగటిపూట సూర్యుడుదయించి తన ప్రచండకిరణములను ప్రసరింపజేసి ప్రకాశించుచున్నాడు. రాత్రిపూట చంద్రుడు తన చల్లని కిరణములను వెదజల్లి వెన్నెలతో మన కాహ్లాదమును కల్గించుచున్నాడు. ఆకాశమున ఎన్నెన్నో గ్రహములు తిరుగుచున్నవి. మేఘములేర్పడి వర్షధారలు కురియుచున్నవి. భయంకరములగు పెనుగాలులు సుడిగాలులు వీయుచు మెరుపులు మెరయుచు ఉరుములు ఉరుముచు పిడుగులు పడుచున్నవి. నదీనదములు ప్రవహించుచున్నవి. కొండలేర్పడుచున్నవి. భీకరములైన సముద్రములెల్లప్పుడు పొంగుచున్నవి. భూకంపములు బయలుదేరుచున్నవి. కారడవులలో దావానలములు, సముద్రములలో బడబానలములు రేగుచున్నవి. మరియొకప్రక్క సస్యసంపద పెరుగుచున్నది, వృక్షములు వృద్ధియగుచున్నవి, మనోరంజకములగు పూమొక్కలు పూలుపూయుచున్నవి, ఫలవృక్షములు ఫలములనిచ్చుచున్నవి. ప్రకృతియందు ప్రకటితమగుచున్న ఇట్టి దివ్యశక్తిని భారతీయులు పూజించుచుండిన యాచారము బహుప్రాచీనమైనది. దీని పూర్వోత్తరములను తెలిసికొనుట బహుదుర్లభము. వేదకాలము నాటికే యీ యాచారమున్నట్లు తెలియుచున్నది. వేదకాలపు ఆర్యుల దేవతలలో వాక్ దేవతయగు వాక్, విద్యాధిదేవతయగు సరస్వతి ప్రసిద్ధిచెందిన దేవతలు. కేనోపనిషత్తునందు ఇంద్రునకు బ్రహ్మ ఉమా హైమవతీ రూపమున ప్రసన్నమై వాని తమోవృత్తిని నశింపజేసి ఆత్మవిజ్ఞానమునుకల్గించినట్లు తెలియుచున్నది.

శాక్తేయుల పవిత్రగ్రంథము "దేవీమాహాత్మ్యము." ఇందు వర్ణితమైన విషయములు అతిమనోహరములును జ్ఞానదాయకములును. సురథు డను రాజు తన బంధువర్గముచే మోసగింపబడి రాజ్యమును కోల్పోయెను. సమాధి యను వర్తకుడు తన చుట్టములకు దూరమయ్యెను. వీరిద్దరును ఈ విధముగ సంసారమున చెప్పనలవికాని క్లేశములను పొంది దుర్భరజీవితమును భరింపజాలక మోక్షాన్వేషులైరి. సర్వసంగపరిత్యాగులై కారడవులబట్టి మేధసమహాముని యాశ్రమమును జేరిరి. ఆ ఋషిపుంగవునకు తమ జీవితకథను వినిపించి తరణోపాయమును జూపుమని వాని శరణుజొచ్చిరి. ఆ మహాతపస్వియు విదారితహృదయులగు వారిద్దరికిని ధైర్యముచెప్పి అభయమిచ్చి దివ్యశక్తియగు విశ్వమాత గుణగణముల వర్ణించి భౌతికజీవితక్లేశహరణమునకు బైరాగి చిటికవంటి శక్తిపూజావిధానమును మాహాత్మ్యమును వారికి జెప్పెను. చరాచరప్రపంచమున శక్తిరూపమున వ్యక్తమగుచున్నదే సర్వశక్తులకు ఆధారము. ఇట్టి మహాశక్తిని తెలిసికొనక నిరాకరించువారు సంసారమగ్నులై దరిగానక ముక్తిదూరులగుచున్నారు. సర్వశక్తిస్వరూపిణియగు ఆ మహాశక్తికి ఆత్మార్పణము గావించిన అదృష్ట

వంతులు మోక్షకన్యచే వరింపబడుచున్నారు. ముక్తికి అనువైన మార్గము శక్తిపూజయే. తల్లి ఎడబాటును తెలియని పసిబాలుడు తన తల్లి కనుపింపనప్పుడు ఆమెకై ఎట్లు తహతహ లాడునో అట్లే ఆ మహాశక్తికై పాటుపడవలయు నని వారి కా తపస్వి చెప్పి మహాదేవి దివ్య విలాసములను వర్ణించెను.

ఆ సాధకు లిది విని మహామాయవంటి విగ్రహము నొకదానిని కావించుకొని ఆరా ధింప మొదలిడిరి. మూడుసంవత్సరముల కాలము దీక్షతో తీవ్రోపవాసములుజేసి దివ్యశక్త్యా రాధనను సల్పి చివరకు ఆమె యనుగ్రహమును వడసి ప్రత్యక్షము గావించుకొనిరి. సురథుడు తాను మున్ను గోల్పోయిన రాజ్యమును కోరు కొనియెను. వర్తకుడు యాతనామయమైన తన జీవితము దుర్లభముగా నున్నదనియు బ్రహ్మా నందమయమగు మోక్షము కావలెననియు వేడి కొనెను. దేవి ప్రసన్నురాలై వారివారి కోరిక లను నెరవేర్చెనట.

మహామాయ – మహాలక్ష్మి, మహాసరస్వతీ, దేవి యను మూడురూపములతో ఆరాధింప బడుచున్నది. మహాలక్ష్మి సిరిసంపదల కధిదేవ తయై వికసించిన పద్మముపై ఆసీనురాలై కరుణామయమగు వీక్షణలతో మానవులకు ప్రాపంచకసుఖములను కలుగజేయుచున్నది. మహాసరస్వతి దయాస్వరూపమున కామరూపి ణియై ఆత్మవిజ్ఞానమును కల్గించుచున్నది. మూడవ యవతారమగు దేవియే మహాకాళి. ఈమె భయంకరరూపిణి. కంఠమున కపాల హారమును ధరించును. శిరోజములను విరియ బోసికొనును. అసురవృత్తినిర్మూలమునకై చేతి యందు ఖడ్గము ధరించియుండును. ఈ విధముగ మహాదేవి వివిధరూపములతో భక్తులచే ఆరా ధింపబడుచున్నది. కాని స్త్రీ యనునది మహా దేవి యవతారముగ గ్రహించుటయే ("స్త్రియః సమస్తాః సకలా జగత్సు") వాస్తవమైన దేవ్యారాధన.

ఈ మహాశక్తియే దుర్గ యనికూడ పిలువబడు చున్నది. "దుర్గాత్ తారయసే దుర్గే తత్ త్వం దుర్గా స్మృతా జనైః" దుర్గా మొదలగు రాక్షసులను సంహరించి సాధువులను రక్షిం చుటచేత ఈమె దుర్గ అని పిలువబడుచున్నది. ప్రపంచమున ధర్మము నశించి అధర్మము ప్రబలి నప్పుడు, జగత్ శ్రేయస్సుకొరకు ఉపాసకుల కార్యార్థము దానవుల వినాశముకొరకు మహా శక్తి నానావిధరూపములను పొందుచున్నది.

"ఇత్థం యదా యదా బాధా దానవోత్థా
భవిష్యతి
తదా తదావతీర్యాహం కరిష్యామ్యరి
సంక్షయమ్."

"ఉపాసకానాం కార్యార్థం శ్రేయసే
జగతామపి
దానవానాం వినాశాయ ధత్సే నానావిధా
స్తమాః."

వైష్ణవీశక్తియగు దుర్గ బ్రహ్మకన్న వేరు కాదు.

"శక్తిర్మహేశ్వరో బ్రహ్మా త్రయస్తుల్యావాచకః"

బ్రహ్మ పురుషుడు కాదు స్త్రీ కాదు నపుంస కము కాదు.

"నైవ స్త్రీ నపుమానేష నచైవాయం నపుంసకః॥

ఇట్టి దుర్గ నిత్యమైనది. సర్వాంతర్యామి. వివిధరూపములతో అవతరించుచు సృష్టిస్థితి లయములకు కారణభూతమగుచున్న దీశక్తియే.

భక్తులెందరో మాతృరూపమున దేవినారా ధించి ధన్యులైరి. భక్త తుకారామ్ తన యిష్ట

దైవమైన విశోభాను అనేకవిధముల ఆరాధించి స్మరించి కీర్తించి నిష్ఫలుడై చివరకు తల్లియని మొరపెట్టి ఏడ్చి ప్రత్యక్షముగావించుకొనెను. చైతన్యప్రభువు దివ్యజీవితమున గూడ ఇట్టి సంఘటన లెన్నియో సంభవించినవి. దైవమును సంబోధించుచు "మాతస్త్వం పితాస్త్వం "......" నీవే తల్లివి, నీవే తండ్రివి, నీవే నా అన్నవు. నీవే నాసఖుడవు అని చెప్పియున్నారు భారతీయులు. నిష్కలంకమైన ముగ్ధ ప్రేమభావమున దివ్యశక్తి నతిసులభముగా ప్రసన్నము గావించుకొనవచ్చును. తన తల్లి చనుగుడ్చుచున్న పసిబిడ్డ విషయము విమర్శించుకొనినచో యీ భావము తెల్లము కాగలదు. పసిబిడ్డ పాలుత్రాగుచునే ఉండును కనులువిప్పి ఇటునటు తనచుట్టుప్రక్కల చూచుచునే ఉండును. కాని తల్లిదగ్గరనుండి అన్యులు ఈ పాపను తీసికొనినవెంటనే కెవ్వుమని ఏడ్చును. పసిబిడ్డకు తల్లిపై గల ఇట్టిప్రేమయే ముగ్ధప్రేమ. మరియొకవిషయమున గూడ ఇట్టి భావము విశదముకాగలదు. తల్లివెంట సంతకు బోయిన రెండుమూడు వత్సరములు వయస్సు గలిగిన బాలుని ఉదాహరణ తీసి కొందము. తల్లి కొంగుబట్టి నడచుచు సంతలో వింతలను చూచుచు ఆనందించును. ఏక్షణము తల్లి విడిపోయి బాలునకు కన్పించదో ఆక్షణము సంత వింతల విస్మరణకల్గి తల్లికై వలవలయేడ్చును. ఎన్నివిధముల సముదాయించినను తల్లి కన్పించినగాని ఆ బాలునకు దుఃఖమాగదు. ఇట్టి ముగ్ధప్రేమయే ఉత్కృష్టమైన ప్రేమ. శ్రీశంకరాచార్యుల దేవ్యారాధన విధానము మన కందరకు పరిచితమే. తల్లీ నాకు నీ పూజలు నీ ముద్రలు, నీ ధ్యానములు మొదలైనవి తెలియవు. నీ యనుసరణే క్లేశహరణమని మాత్రము తెలియును. తల్లీ దుష్పుత్రుడు పుట్టుట కవకాశమున్నది గాని ఏనాడును చెడు తల్లిని చూడము కదా (కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతానభవతి) మరియొకశ్లోకమును దేవీపక్షమును వహించి శివునియశమును కీర్తించినారు.

"చితాభస్మాలేపో గరలమశనం దిక్పటధరో
జటాధారీ
కంఠేభుజగపతిహారీ పశుపతిః॥
కపాలీ భూతేశో భజతి జగదీశైకపదవీం
భవాని త్వత్పాణిగ్రహణ పరిపాటీ ఫల
మిదమ్."

భక్తాగ్రేసరుడగు త్యాగరాజు పరదేవత మూలప్రకృతియగుటచే స్వభావసిద్ధముగ సీతాదేవి వహించిన సహనమును కీర్తించుచు—

"మా జానకి చెట్ట బట్టగ మహారాజవై
రాజరాజవర రాజీవాక్ష విను
రావణారియని రాజిల్లు కీర్తియు.

రామా మా జానకి సహచారిణి యగుట చేతనే నీవు మహారాజవైతివిసుమా. ఇది నీ పౌరుషముగాదు. రావణారి యనెడి కీర్తి మా జానకివల్లనే కల్గినది. రావణ బాధలనన్నిటిని సీత సహించి రావణసంహారనిమిత్తమైన యశమును రామునికే కల్గించినదని పొగడియున్నాడు.

మరియొక కీర్తనయందు శ్రీ పురాధిదేవత యగు శ్రీ ధర్మసంవర్ధినిని వేడికొనుచు పరాశక్తియగుటచే బ్రహ్మేంద్రాదులకు సహితము వరములిచ్చి కాపాడిన నీవు జగదాదివి పరాశక్తి యని కీర్తించిన నన్ను బ్రోచుటకు నీకింత పరాకేల అమ్మా యని జాలిగా బలికినాడు. మరియొక కీర్తనలో ధర్మాంబికనుగూర్చి కన్న

తల్లీ అమ్మా కావు కావుమని నే మొర పెట్టితే నీ మనసు కరుగ దేమమ్మా—

నన్ను కన్నతల్లి నా భాగ్యమా
నారాయణి ధర్మాంబికా
కనకాంగి రమాపతి సోదరి
కరుణింపవే కాత్యాయని
కావు కావుమని నే మొర పెట్టగా
కరుగ దేమి మది కమలలోచని
నీవు బ్రోవకున్న ఎవరు బ్రోతురు స
దావరంబొసగు త్యాగరాజనుత!''

వేరొక చోట ''నీవంటి దయాసముద్రురాలు ఈ ప్రపంచమందు లేదనెను.''

''నీవలె కరుణాసాగరి యీజగాన
నేవెతకి కనుగొనగా నెక్కడగాన''

కాంచీపుర కామాక్షినిగూర్చి ''అమ్మా వినాయకుని కాపాడినట్లు నన్ను కాపాడుము.''

మాతాపుత్రుల ప్రేమ నిర్దుష్టమై నిరుపమైనది. మహాదేవి వైష్ణవులకే తల్లికాదు—శైవునకే తల్లికాదు—నీకే తల్లికాదు—నాకే తల్లికాదు. ఆమె జగజ్జనని క్రైస్తవులకు మాతృదేవత మహమ్మదీయులకు మాతృదేవత. ప్రతి ఒక్కరును తమ తల్లిని ఆరాధించుటకుఅర్హులే వేదాంతులు సగుణబ్రహ్మమని చెప్పునదీ పరాదేవతయే. సత్ చిత్ ఆనందమయమగు అఖండగుణరాశి యీామె సృష్టిస్థితిలయకారిణి. వేదాంతులుచెప్పెడి మాయ యీామెయే. ప్రకృతి పురుషరూపముననున్న శివశక్తి యీా

ఇట్టి మహాశక్తిని మాతృరూపమున ఆరాధించి ఆదివ్యశక్తి మాతృప్రేమకు పాత్రులగుటయే మానవధర్మము. ఎల్లరును ఆశ్వయుజ శుక్లపక్షమున నవరాత్రములందును పూర్ణిమాతిథియందును లక్ష్మీనారాయణులనుగాని దుర్గాపరదేవతనుగాని ఆరాధించిన పశువిత్త పుత్ర మిత్ర కళత్రాది సుఖముల ననుభవించి పునరావృత్తిరహితమైన ముక్తిని బడయగలరని దేవీనవరాత్ర మాహాత్మ్యము చెప్పుచున్నది. నేడు భారతదేశము క్లిష్టపరిస్థితులలోనున్నది. సాంఘికముగా, ఆర్థికముగా, రాజకీయముగా నిర్వీర్యమై యున్నది. ఎక్కడ జూచినను దేశమందు కరువులు, కాటకములు, వరదలు మొదలగు సంక్షోభములే కలుగుచున్నవి. ఇట్టి విషమపరిస్థితులలో దేశమును సంరక్షించగలిగినది సర్వశక్తిమయమగు జగజ్జననితప్ప వేరొక్కటి కలదా!

''యదాయదాబాధాదానవోత్థా భవిష్యతి తదా తదావతీర్యాహం'' అని అభయ మిచ్చియున్నది.

బ్రహ్మాపి యాం నౌతి నుతః సురేంద్రైః
యామర్చితోఽప్యర్చ్చ యతీందుమాళిః
యాం ధ్యాయతి ధ్యానగతోఽపి విష్ణు
స్తామాదిశక్తిం శిరసా నమామి.



# మెయిపొరుళనాయనారు

డాక్టరు శ్రీ రామకృష్ణమ్మ

మద్రాసులో మైలాపూరునందలి కపాలీశ్వర దేవాలయములో 63 నాయిన్‌మారుల ఉత్సవము ప్రతి సంవత్సరము జరుగును. 'నాయన్ మారు' పరమభక్తులపదవి బిరుదము. కపాలీశ్వరుని వెనుక నాయన్‌మారుల విగ్రహము లున్నవి. దక్షిణదేశములోనుండు ప్రతి శివాలయము గర్భగుడివెనుకను ఈ 63 నాయన్ మారుల విగ్రహములున్నవి. ఈ విగ్రహము లలో మెయిపొరుళు నాయనారుదొకటి.

పుణ్యభూమియైన చేదిదేశమున, తిరుకోవ లూరను ఒక పట్టణము కలదు. దాని అధిపతి ''మెయిపొరుళు'' అను మహనీయుడు. విశాల వక్షస్థలము, దీర్ఘబాహువులు కలిగిన అతడు పౌరుష పరాక్రమముల కాదర్శపురుషుడు. తన శౌర్యమువలన, ఎదిరి సైన్యములను రణములో జయించుచుండెను. సత్యసంధుడు, వేదధర్మ నిరతుడు, మెయిపొరుళ్‌నయనారు.

అతని రాజ్యపాలనమున, శాంతి సంతోష ములతోకూడిన పౌరులు, రామరాజ్యమును స్మరించుచుండిరి. ఆదేశపు ప్రజలు ఎల్లప్పుడు, లోక వ్యవహారములను విస్మరించి 'యథారాజా తథాప్రజా' అనునట్లు శివనామస్మరణ చేయుచుండిరి.

రాచకార్యమున మగ్నమైన మెయిపొరుళు రాజు తలంపులు జడధారి వంకనే ఎల్లప్పుడు వడివడి పరుగిడుచుండెను.

ఎందెందు రాజ్యమున శివాలయము లుండెనో, అందందు, శివపూజలను, సప్తస్వరగానములతో, నాట్యములతో చేయనాజ్ఞాపించెను. తన యొక్కయు, తన పౌరులయొక్కయు వీనులు నేత్రములు, సఫలములయ్యెను. దేవాలయముల కట్టించుటయే అతని మొదటి పవిత్రకృత్యము. తాను శివుని ఆరాధించునప్పుడు, తన భక్తిరసామృతము అమరవాహినియై ఉప్పొంగి, కెరటములు గగనమార్గమునకు, కుప్పించి ఎగుర, మందాకినీదేవి కానందము కలిగించ, ఆమె చల్లని చూడ్కులు సదా ఆపుత్రుని రక్షించుచుండెను. అతడు భక్తిపరవశుడై, భక్తుల నారాధించుటే, వారి పాదసేవయే, తన జీవన సాఫల్యమునకు దారి అని నిర్ణయించుకొనెను.

ఎల్లప్పుడు భక్తులకు దాసుడై వారిరాకకు వేచియుండును. తన పూర్వధనమును స్వార్జితమును భక్తులకు ఉపయోగపడును కదా, అని సంతసించును. శివక్షేత్రమైన చిదంబరమున నాట్యమాడు వారిని ఆదరించి వారి కోఱతలను తీర్చుచుండెను. శివవేషధారి ఎవరైనను తన దగ్గఱకురా, సంతోషముచెంది భక్తిపరవశుడై మనఃపూర్తిగా తనసర్వస్వమును పంచి, సంపూర్ణమైన సుఖము కలిగెనని ఎగిరిపడును; ఎల్లప్పుడును భక్తుల పాదముల నంటియుండెను. భక్తుల పాదములే తన మిత్రములని సంతసించును.

ఇట్లు ఈ భక్తి ఉన్మత్తుడు, గృహస్థుడయ్యు సన్న్యాసమున కాలము గడుపుచుండెను.

వెలుగునుచూచి మబ్బు ఏవగించును. మిణుగురుపురుగు చంద్రకాంతికి అసహ్యించును. ముత్తునాథుడను ప్రక్కరాజునకు, మెయిపొరుళు గుణజాలములు హృదయబాణము లయ్యెను. కోపించి మెయిపొరుళును ఓడించ నిశ్చయించి, పలుమారు ఆరితేరిన భటులను, తురగములను, బలములైన ఏనుగులను, వడి పరుగిడు రథములును వెంటబెట్టికొని మెయిపొరుళుతో సమరము చేసెను. విజయలక్ష్మి అతనికి రానురాను దూరమయ్యెను. పరాజితుడై సమర భూమిని వదలి ఏకాకిగా, ఫలాయనుడయ్యెను. మెయిపొరుళు అతనిని వెంబడించలేదు. పలుమారులు ఆపరాజిత ప్రాణములకు మెయిపొరుళురాజు ఉదారగుణమే రక్షణమయ్యెను.

ముత్తునాథునికి కోపము, పగ, దినదినము వృద్ధియగుచుండెను. ఈ మెయిపొరుళుని వంచించి పగసాధించ పూనుకొనెను. అతనిశీలము చక్కగా తెలిసికొన్నవాడై మెయిపొరుళ్ ను వంచింప సమకట్టెను.

వెంటనే శరీరమునిండ పవిత్రమైన విభూతిని పూసికొనెను. తనకురులను జడలు జడలుగా ముడికట్టెను. ఈ విధముగా శివభక్త వేషమును ధరించి తాటియాకుల పుస్తకములో వాడికత్తి నొకటి దాచి, ఆపుస్తకమును సంచిలోనుంచి, మనస్సు, కాలమేఘమువలె అజ్ఞానాంధకార బంధురము కాగా, తిరుకోవలూరికి స్వేచ్ఛగా నడిచివచ్చెను. భక్తుల కడ్డులేని ఊరు, భక్తులను గౌరవించి ఆదరించి, ప్రేమించి శుశ్రూష చేయు మహాత్ముని నగరమున, ఈ వంచకుడు ప్రవేశించి, శాంతి చిహ్నములైన ధవళపతాకలను, సంతృప్తులైన ప్రజలను చక్కని బాటలను తిలకించుచు, రాజమార్గమును బట్టి రాజ గృహమునకు ఏతెంచెను. అచ్చటి కావలిభటులు వినయముగ నమస్కరించి, అతని పాదములసేవించి "మహాత్మా మీరు నడచివచ్చి, మాకదృష్టముకలిగించుచున్నారు. రండు. మమ్ము మాచోటును పావనము చేయుడు" అనుచు అతనికి ఆ భటులు రాజ ద్వారమును చూపిరి. పలుద్వారములుదాటి, చివరకు రాజుగదిని సమీపించెను. అచ్చటి ప్రాణరక్షణభటుడు "తత్తను" ఈ నూతన కపట భక్తుని అసమయరాకకు అనుమానించి "స్వామీ ప్రభువు పవళించుచున్నారు. అలసట తీరిన పిమ్మట, మీరు వారిని చూడవచ్చును" అన "ఓరీ నీవడ్డురావలదు, నేను ఈక్షణమున, అతనికి జ్ఞానమును ఉపదేశింపవలె"నని అతనిని లెక్కచేయక దాటి గదిలోనికి ప్రవేశించెను.

మెయిపొరుళ్ శాంతి వదనుడై, చల్లని గాలితో నగరునవ్యాపించిన పూమాల సుగంధముతో, అతి లావణ్యవతియగు భార్య ప్రక్కనుండ, ముత్తునాథుడు తిలకించెను. ఆదేవి, ఆ మహావేషముననున్న భక్తునిజూచి, మంచముదిగుచుండ, ఆముత్తునాథుడు మంచమును సమీపించెను. దేవి భర్తను హెచ్చరించెను; మెయిపొరుళు తన ప్రాణములకన్న ప్రియమైన శివరూపమును వీక్షించి, చేతులు పైకెత్తి, నమస్కరించుచు దిగి, సాష్టాంగనమస్కారము చేసి "మహాప్రభూ, తమంతతామే, అనుగ్రహించితిరి, దాసుని అదృష్టము, ఈతనిపై కరుణించిన కారణము విన నర్హుడనుకాగలనా" అని వినయముగా నడిగెను. "ముందు నీ గురువులు, వ్రాసిన మహాగ్రంథమును, నేను

నీకు బోధింప తెచ్చితిని. నీ దేవి ఉన్నది. నీవు నేను ఒంటరిగా నుండవలెను'' అని ఆ కపట తపస్వి పలికెను.

భక్తిపులకిత మనమున, మెయిపొరుళు రాజు, మృదువచనముల దేవిని అంతఃపురమున కంపెను. గదిలో ఇరువురు మాత్రమే— మహాభక్తుడైన మెయిపొరుళ్ కపటవేషమున నున్న ముత్తునాథుడు.

రాజు ఆతనిని సక్రమముగా భజించి, పూజించి, సేవించి, ఉన్నతాసీనునిచేసి, తాను ఆయనపాదములకడ కూర్చుండి ''స్వామీ త్వరగా నాపై కరుణింపుడు. స్వామి వచనములు వినుటకు వేచియున్నాడ'' ననెను.

శివవేషధారి మెల్లగా, సంచినుండి, తన పుస్తకమును తీసి విప్పునట్లునటించి, వాడియైన కత్తినిచేతపూని, ఆ భక్తుడైనరాజు శిరము వంచి, నమస్కరించునప్పుడు, తనమనోరథమును తీర్చుకొనెను. చెడపజాలని మాయాజాలమున, ముత్తునాథుడు చిక్కి, ఇప్పుడు కూడ, పరాజితుడయ్యెను.

ఈ మాయావేషధారిని అనుసరించి పొంచి వేచియుండిన, రక్షకభటుడు ''తత్తను'' క్షణములో కత్తిదూసి, అతనిపై సింగము దూకినట్లుదూకి కరవాలమును వీచునప్పుడు, హీనస్వరమున, రక్తము ధారలు ధారలుగా కారుచుండ రాజు ''తత్తా వలదు. ఇతడు మన వాడు'' అని నివారించెను.

తత్తను వెంటనే, రాజు శరీరమును తన కానించుకొని నమస్కరించి వినయముగా ''ప్రభూ దాసునికి తమరి ఆజ్ఞ ఏమి'' యనెను. ''ఆ మహాభక్తుని నీవు నిరపాయముగా మన దేశమును దాటించి స్వేచ్ఛగా వదులుము'' అని ఆజ్ఞాపించెను. ఈ సమయమునకూడ భక్తుడు మెయిపొరుళ్ విజయుడయ్యెను.

క్షణములో రాజుకు కలిగిన యీ అపచార వార్త పురములో వ్యాపించెను. ప్రజలు గుంపులు గుంపులుగా గుమికూడి, ఆ వంచకుని తునుమాడ ఉద్యమించి, బయలుదేఱిరి. రాజగృహమునుండు వారలు ఆవంచక తాపస వేషదారిని పట్టుకొనిరి. అప్పుడు తత్తను ''మన ప్రభువు ఆజ్ఞ ఇతనిని నిరపాయునిగా వదలవలెను''అని వారింప వారందఱును రాజాజ్ఞను శిరసావహించిరి. తత్తను వాడి కత్తిని చేతపూని అతిజాగ్రత్తగా ఆముత్తునాధునిని తిరుకోవలూరి ఎల్లనుదాటించి, నిర్జనమైన విపినమునవదలి తన త్రోవ బట్టెను.

భీష్ముడు బాణహతుడు. జీవితాంతము సమీపించినను తన అసువులను తన యిష్ట ప్రకారము వదలక ఉత్తరాయణ పుణ్యకాలమున కృష్ణభగవానుని దర్శనము కలుగువఱకు వేచి తాను యోగవిధానమున కళేబరమును త్యజించెను.

అట్లే మెయిపొరుళురాజు, తన అసువులను బిగబట్టి తత్తను రాకకై నిరీక్షించుచుండెను. ప్రజలు మూఢులు, క్రోధావేశమున ఆ తపస్విని హింసించిరాయని ఆందోళపడుచుండెను. తత్తను రాకకొఱకై ఆతృతపడుచుండెను. ఈవిధముగ సందేహపీడితుడైన రాజు ఎదుట, తత్తను ప్రత్యక్షమై, నమస్కరించి ''ప్రభూ, మీ కపకారమొనర్చిన ముత్తునాధునుని, మీ యిచ్ఛ ప్రకారము జనసంచారము లేని అడవిలో నిరపాయముగా [illegible]తి'' ననెను. రాజు వదనము ఆనందముచేత వికసింప కరుణాపూరిత

నయనములచే, తత్తనుని తిలకించి "నాయనా, నీకంటె నాకాప్తులు వేఱెవరుగలరు? మఱువరాని సహాయమును నాకు చేసితి"వని పలికి దీవించెను.

అటుపిమ్మట, మంత్రులను, రాజకార్యదర్శులను, ప్రేమపాత్రులైన భార్య బంధుమిత్రులను పిలిపించి సభచేసి "మీరు ఎల్లప్పుడు అవ్యక్త వ్యక్తిమూర్తిని, సృష్టికర్తను ఈశ్వరుని ధ్యానింపుడు. పవిత్రమైన విభూతిని; పరమేశ్వరస్వరూపులైన భక్తులను గౌరవించి ప్రేమింపుడు" అని నుడివి మహాసమాధిని బడసెను.

తాను ఈలోకమున కోరినది ఈశ్వరుని పాదములే. పరలోకమున తనపాదముల దగ్గఱ నుండునట్లు భవుడనుగ్రహించెను. లోకమాత పార్వతీదేవి ప్రసన్నురాలై సదాప్రేమమయ దృక్కుల తన ధవుని పాదములదగ్గఱనుండిన భక్త్యున్మాదపుత్రునివైపు ప్రసరించుచుండెను.

మనము ఆతని విగ్రహమును శివాలయము వెనుక స్థాపించినారము. మనకు అతడు విగ్రహము కాడు. మనల నుద్ధరించి మనకు భక్తిమార్గముబోధింప దివినుండి దిగివ జీవన్ముక్తుడు.



"ఎల్లెడల భగవంతుడున్నట్లు వీక్షించువాడు తన్ను తాను హింసింపడు. పరమమైన పదము అతనికి లభించును."
—భగవద్గీత.

"భగవంతుడు, భక్తుడు, భాగవతము వేఱుకాదు."
—శ్రీ రామకృష్ణ పరమహంస.



# మానసబోధ

**బాలకవి శ్రీ ఓరుగంటి నారాయణప్ప**

తే॥ గీ॥ ఏ మహాజ్యోతిగలిసిన ఁ నెల్ల జన్మ; మరణములు దుఃఖచయములు ఁ మాయవానో
అట్టి శాశ్వతతత్త్వంబు ఁ నరసిదాన; విశ్రమింపు వివేకత ఁ వెత్తిమనస! 1

తే॥ గీ॥ దేని బొందిన జగతికి ఁ దిరిగిరావో; దేనిస్మరియింప గర్మల ఁ దెగనడతువో
దేని నైక్యత నీవిక ఁ దైవమౌదు; వట్టి పరమాత్మనెఱుఁగుమా ఁ యర్థిమనస! 2

తే॥ గీ॥ ఎంతొసుకృతంబొనర్చక ఁ యిలను మర్త్య; జన్మధారణగావించి ఁ చంచలమున
విషయవాంఛల ద్రిమ్మరు ఁ వెత్తియేల! పట్టువదలక బ్రహ్మమై ఁ బరగుమనస! 3

తే॥ గీ॥ ఎట్టులో జన్మబొందితి ఁ పీ జగతిని; దీనసుఖ మించుకయులేదు ఁ తెలియు మీవ
అలమహర్షులు బోధించిరఁ రవని దుఃఖ; మూలమీ దేహమనియెంతొ ఁ మూఢమనస! 4

తే॥ గీ॥ బాల్యమున నాటపాటల ఁ బాయుకాల; మంత స్త్రీలోలతఁ బాయు ఁ ప్రాయ మవల
ముసలితనమున జింతలఁ బోవు వయసు; ఎపుడు పరమాత్మనెఱిగెద ఁ వీవుమనస! 5

తే॥ గీ॥ ఎందఱెందఱో మతకర్త ఁ లెఱుఁగ ఋషులు; వేదశాస్త్రార్థముల నీకు ఁ వేద్యముగను
దెలిపిరిల జక్కఁబడవీవు ఁ దేవమాయ; నహాహా! దాటగ దుర్భరఁమాయె మనస! 6

తే॥ గీ॥ నీవు విషయాలద్రిమ్మర ఁ నెగడుబంధ; మీవు పరమాత్మ్మదలపగ ఁ నెసగుముక్తి
కారణమునీవ ముక్తికి ఁ కట్టువడగ; దీని నారసి హరిగన ఁ దెలియు మనస! 7

తే॥ గీ॥ పాదరసమునుబోలి నీఁభ్రమణగలదు; అకట నీవెట్లు స్థిరమొంది ఁ యాది దేవు
నందు గలియుదు వదిజూడ ఁ నబ్బురంబె! పట్టువలతోడ ముక్తినిఁబడయు మనస! 8

తే॥ గీ॥ శంకరాచార్య ప్రభృతులు ఁ జాలినొంది; నిన్ను చిన్మయుజేయంగ ఁ నెన్నొగతుల
శాస్త్రసముచయమొసగిరి ఁ చదివి సుగతి; బొందుదీవని తెలియు మీఁబోధమనస! 9

తే॥ గీ॥ రూపనామాత్మకంబగు ఁ రూఢిమాయ; సచ్చిదానందరూపమా ఁ సదమలాత్మ
నామరూపాదులఁ వీడి ఁ నాశముగను; సచ్చిదానందరూపమై ఁ సాగు మనస. 10

తే॥ గీ॥ జపతపంబులు ధ్యానముల్ ఁ సకలవిధులు; అలమహర్షులు శాస్త్రము ఁ లలరనిన్ను
సంస్కరింపంగ సద్గతి ఁ సరణి దెలుపు; బోధవినుమీవు శ్రద్ధమై ఁ వూని మనస. 11

తే॥ గీ॥ లక్షయెనుబదిజన్మలఁలలి తపించు; జంతుజాలంబులకు ఁ లేదు సత్యదృష్టి
నీకువలె గాన నికసున్న ఁ యిట్టిజన్మ; మరల బొందవు త్వరపడుఁమమత మనస. 12

తే॥ గీ॥ అనుదినంబును శ్రీహరి | నచలభక్తి ; దలపుమీ నీకు ముక్తిని | దయనొసంగ
నిర్మలత్వంబు నీలోన | నెగడనెపుడు ; సజ్జనులసేవ జేయుమా! | సమత మనస. 13

తే॥ గీ॥ ఆత్మరతినంతరంగాన | నట్టిమనుగ ; నెపుడు తరగని సుఖ|మొందుదీవు నిజము
బయట ప్రాపంచసుఖముల | భ్రమణసేయ ; బొందుదువు విషయలంపట | ముగ్ధ మనస.

తే॥ గీ॥ సజ్జనులగోష్ఠి సద్బుద్ధి | శాస్త్రపఠన ; సద్గురూక్తసుమంత్రంబు | జపముజేయ
ఆత్మసర్వంబు దైవమ|యంబటంచు ; భావమలవడ ప్రార్థింపు | భవుని మనస. 15

తే॥ గీ॥ నరులు తరులును కరులును | హరులు పరులు; గిరులు సచరాచరంబులు | గేహములును
హరి పరాత్పరమయమను|నట్టి భావ ; మలవడగ నాత్మదలపుమ|నంత మనస. 16

తే॥ గీ॥ ఎపుడొ యేవేళొ తనువిది | యొందొ వీడు ; తెలిసి తెలిసియు మాయను | ద్రెంచలేక
నేను నాయదియను భ్రాంతి|నీగలేక ; కడకు యమయాతనలపాలు|గాకు మనస. 17

తే॥ గీ॥ దుఃఖముల కాలయంబగు | దోషయుతము ; దలప సంసారమిది దీని|దలప కెపుడు
దలపుమాత్మను దానసీ | తలపులుడుగు ; నిత్యసౌఖ్యంబు చేకూరు | నిజము మనస. 18

తే॥ గీ॥ పుత్రమిత్రకళత్రాది | భోగ్యరాశి ; వివిధయాసలు పెనగొని | వెతలు సెంది
అవని తాపత్రయంబుల | నట్టినలుగ ; కాహరినిజేరు భావాన | నలరు మనస. 19

తే॥ గీ॥ దైవచింతనకిరవయి | తనరునట్టి ; భరతఖండాన జన్మించి | భాగ్యవశత
మానవత్వంబు పూనిన | మనమ వినుమ !; ఎల్లవేళల హరిరూప | మెఱుగు మనస ! 20

తే॥ గీ॥ కనియు గానక ముట్టిన | గాల్చునగ్ని ; ఆవిధిని రామనామము | నవనిదలప
మానవునిముక్తి బొందించు | మమతతోడ ; రామరామనితలపుమా | రక్తితోడ. 21

తే॥ గీ॥ ఒక్కడజ్ఞాని యారయ | నొకడు జ్ఞాని ; ఒకడు సేవకుడున్ మఱి|యొక డమాత్యు
డొకడు యోగియు దెలియంగ | నొకడు త్యాగి ; కర్మభేదంబు వివరింప|గనుము మనస.

తే॥ గీ॥ ఒకని నవ్వించు నేడ్పించు | నొకని ధరణి; నొకడు సంపన్నుడున్ మఱి|యొకడు బీద
వివిధరీతుల గల్పించు | వేగమాయ ; వరజగన్నాటకంబిది | వసుధ మనస. 23

తే॥ గీ॥ ఇందు సుఖమించుకయులేదు |మందమనమ ; ఇదిమహామాయలీల నీ|వెట్టులయితి
దీని విడనాడి యీశుని | దెలియ నీకు ; నిత్యసుఖమబ్బు మఱువకు | నిజము మనస. 24



# శ్రీ వివేకానంద సంభాషణలు

అనువాదకుడు : శ్రీ పిన్నింటి సుబ్బారావు

(జూలై సంచిక తరువాయి)

[గురుకులవాసపద్ధతి—ప్రస్తుత కళాశాలవిద్య — శ్రద్ధారాహిత్యము—మనమొక విశిష్టమగు జాతీయచరిత్రను గలిగియుంటిమి—పాశ్చాత్త్యుల విజ్ఞానశాస్త్రములతో వేదాంతమును సమన్వయపరుపవలయును — ఉత్కృష్ట విద్యయొక్క యశక్తత — వృత్తివిద్యలు, జాతీయవిద్యల యావశ్యకత—సత్యకాముని చరిత్ర—గ్రంథపఠనముమాత్రమే, త్యాగుల యొద్ద విద్యనభ్యసించుట— శ్రీరామకృష్ణుడు, విద్వాంసులు—మఠములను స్థాపించుట, కళాశాలలను సాధువులవశమునందుంచుట—బాలుర పఠనీయగ్రంథములను సంగ్రహించుట—బాల్యవివాహముల నాపుట—అవివాహితులగు పట్టభద్రులను జపాను దేశమునకు పంపుయోచన—జపాను దేశము ఘనతయందుగల రహస్యము — ప్రాక్పశ్చిమములందలి కళలు—కళలలాభము— వస్త్రధారణ విధానములు ఆహారసమస్య, దరిద్రస్థితి]

ప్రశ్న :— మహారాజ్, మీ యభిప్రాయ మేమి? ఇతరదేశములయందు సన్న్యాసులు లేరుగదా! కాని చూడుడు, వారి జ్ఞానగరిమను జూచి భారతదేశము వారి పాదములకు నమస్కరించుచున్నది!

స్వామిజి :—ఓ ప్రేమాస్పదుడా! అసభ్యముగా సంభాషింపకుము. నేను చెప్పునది వినుము, భారతీయులకు విద్యనుగరపుట మఠులసన్న్యాసులవిధ్యుక్తధర్మముగా జేయఁబడనంతవఱకు వారు తమ శిరస్సులపై నితరుల పాదరక్షలను మోయవలసియే యుందురు. అక్షరజ్ఞానములేని బాలుఁడెట్లు మీ వృద్ధపండితుల శిరములను ద్రిప్పగలిగెనో నీవు చూచియుండలేదా? ఒకానొకప్పుడు దక్షిణేశ్వరాలయమునందు విష్ణ్వర్చకుఁ డొకఁడు విగ్రహముయొక్క కాలును విరుగగొట్టెను. పండితులు వారివారి యభిప్రాయములిచ్చుటకై, యొకసభ సమావేశపరుపబడెను. అనేకపాతగ్రంథములను, వ్రాతప్రతులను తిరుగవేసి, యీ కాలు విరిగిన విగ్రహమును పూజించుటను శాస్త్రము లొప్పవనియు, ఒక నూతన విగ్రహమును ప్రతిష్ఠింపవలసియుండుననియు నిర్ధారణ చేసిరి. వెంటనే యొక గొప్ప

యలజడి బయలుదేరెను. చివరకు రామకృష్ణుని ఆహ్వానించిరి. విషయమంతయును ఆలకించి, "కాలువిరిగినదని ఏ స్త్రీయైనను తన భర్తను విడనాడునా" యని ప్రశ్నించెను. ఏమి జరిగినది? విద్వాంసులందరును మౌనమునువహించిరి. వారి శాస్త్రవ్యాఖ్యానములు, పాండిత్యప్రకర్షణములు, ఈ యతిసూక్ష్మ సమాధానము ముందు నిలువజాలకపోయెను. అది నిజమగుచో, శ్రీ రామకృష్ణుండేల యీ పుడమిపై అవతరించి, యింతగా, గ్రంథపఠనమును గర్హించును? విద్య యందును, పాండిత్యమునందును, ఆ యవతారపురుషుఁడు తనతోదెచ్చిన నూతన చైతన్యమును మేళవించినచో, యథార్థమగు కృషి జరుగగలదు.

ప్రశ్న :—కాని యిట్లు చెప్పుట సులభము. చేయుట కష్టము.

స్వామిజి :—ఔను, అది సులభమగుచో, ఆ మహనీయుడవతరింపవలసిన పనియేమి? నీ కర్తవ్యమేమనగా, ప్రతిపట్టణమునందును, ప్రతిగ్రామమునందును మఠములను స్థాపింపవలయును. అది నీవు చేయగలవా? చివరకతి స్వల్పముగానైనను జేయుము. కలకత్తా మధ్యను ఒక గొప్పమఠమును స్థాపింపుము. ఆ మఠమును గొప్ప విద్యాధికుడగు నొక సాధువు నధీనమునందుంచి యాతనికిసాహాయ్యముగా వివిధ విజ్ఞానశాస్త్రములను ప్రయోగ పూర్వకముగా బోధించుటకొక్క శాస్త్రమునందు ప్రత్యేకపాండిత్యముగల ఒక్కొక్క సన్న్యాసిని నియమింపవలయును.

ప్రశ్న :—అట్టి సాధుపుంగవులు తమ కెచ్చట లభ్యపడగలరు?

స్వామిజి :—వారిని ప్రత్యేకముగా తయారు చేయవలయును. మూర్తీభవించిన దేశభక్తి, త్యాగముగలకొందరు యువకులు గావలయునని నేనెల్లప్పుడును జెప్పుచునేయున్నాను. పరిపూర్ణముగా ఏ విషయమునైనను త్యాగులు గ్రహించునంతటి సులభముగా, ఇతరులెవ్వరును గ్రహింపనేరరు.

కొంతసేపాగి మఱల స్వామిజి, "సింఘ్‌జీ! మన దేశమందనేక ముఖముల, యత్నములు చేయవలసియున్నది. నీవంటివారును, నావంటివారును వేనకువేలు గావలసియున్నది. వాగాడంబరమేమి చేయగలదు? దేశమెంతటి దార్భాగ్యస్థితియందున్నదో తిలకింపుము. ఏదియో యొకటి యొనర్పుము. పసిబాలుర కవసరమగు నొక్క చిన్నపుస్తకమైనను మనకులేదు.

ప్రశ్న :—ఎందుకులేవు? ఈశ్వరచంద్ర విద్యాసాగరునిచే రచియింపబడిన గ్రంథములనేకములు బాలురకున్నవి గదా?

నే నీవిధముగా చెప్పినంతనే వారు బిగ్గరగా నవ్వి, "అవును, వాటియందు 'ఈశ్వరుఁడు నిరాకారచైతన్యస్వరూపుడు, ఈ బాలుఁ డతి సుబోధక బాలుడు.' అని యీ విధముగా వ్రాయబడియుండును. దీనివలన లాభములేదు, బెంగాలీభాషయందును, ఇంగ్లీషుభాషయందును, రామాయణము, మహాభారతము, ఉపనిషత్తులు మొదలగు గ్రంథములనుండి చిన్న చిన్న కథలను ఏరి, నాతి కఠినమగు భాషయందుగూర్చి, బాలురచే వలయు"నని నుడివిరి.

ఇప్పటికి పదునొకండు గంటలైనది. ఆకాశ మకస్మాత్తుగా మేఘాక్రాంతమై మలయమారుతము వీవసాగెను. వర్షమురానున్నదని స్వామిజి చాల ఉత్సాహముతోనుండెను. వారు లేచి "సింఘ్‌జీ! గంగానదీతీరమునకు వాహ్యాళికై బోదము, ర" మ్మనెను. మే మట్లే యని బయలుదేరితిమి. స్వామిజి కాళిదాసుని మేఘసందేశమందలి కొన్ని శ్లోకములను జదివిరి. కాని వారే ప్రసంగమును జేయుచున్నను, వారి మనస్సు భారతదేశముయొక్క భాగ్యోదయబోధనమునందే నిమగ్నమై యుండెను. "సింఘ్‌జీ! యిటు చూడుము. నీవు ఒకపనిచేయగలవా? బాలురకు వివాహములను జేయుట కొంతకాలమువఱకు నాపుచేయగలవా?" యని ప్రశ్నించిరి.

నేను, "మహారాజా, పెద్దలందరును, అతి సూక్ష్మముగా వివాహములను జేయుటకుగల యుపాయాంతరముల నన్వేషించుచుండగా, అదెట్లు సంభవమగును" అని ప్రత్యుత్తర మిచ్చితిని.

స్వామిజి :— ఈ విషయమునుగూర్చిన యాలోచనతో నీ మనస్సును పాడుచేసికొనకుము. కాలచక్రము నెవ్వరు మార్చగలరు? అట్టి యత్నములన్నియు నిష్ప్రయోజనములగును. వివాహములను జేయుట ఎంత గడ్డుసమస్యయైన, దేశమంత యభివృద్ధి గాంచగలదు. పరీక్షలయందు కృతార్థులగుటకును, త్వరగా వివాహమాడుటకును ప్రజ లెంత యాతురతజూపుచున్నారు! ఎవ్వరును బ్రహ్మచారులై యుండరాదనిగాబోలు వీరి యుద్దేశ్యము! కాని మరుసంవత్సరము యథాతథముగ నేయుండగలదు.

కొంతసేపాగి స్వామిజి మఱల, కొంతమంది యవివాహితులగు పట్టభద్రులు నాకు లభ్యమగుచో, వారిని జపానుదేశమునకు బంపి, వృత్తివిద్యల నభ్యసించుటకై యచ్చట వలయు నేర్పాట్లుగావించినచో, వారు తిరిగి వచ్చి దేశాభ్యుదయమునకై కృషిచేయ గలుగుదురు గదా. ఇది ఎంత లాభకరమగు విషయమో గదా!

ప్రశ్న :— మహారాజ్, ఇంగ్లండు దేశమున కేగుటకంటె, జపాను దేశమున కేగుట లాభదాయకమా?

స్వామిజి :— తప్పకుండ. మన దేశమందలి ధనవంతులంద రొక్కసారి జపానుదేశమును జూడబోయినచో, జ్ఞానులు కాగలరు.

ప్రశ్న :— ఎట్లు?

స్వామిజి :— జపానుదేశమున సమస్తమును జ్ఞానదాయకమై వెలయును. జడత్వ మెచ్చటను గానరాదు. వారు ఐరోపాదేశీయుల నుండి సమస్తమును సంగ్రహించి, జపానాశయములతో మేళనమొనర్చుకొని జాతీయతను నిలువబెట్టుకొనిరిగాని, పాశ్చాత్యాచారముల నవలంబించి భ్రష్టులు గాలేదు. కాని మన దేశమునందు పాశ్చాత్య సాంప్రదాయములను పూర్తిగా అవలంబింపవలెననెడి పిచ్చి ప్లేగుజాడ్యమువలె నలముకొనినది.

ప్రశ్న :— మహారాజ్, నేనొకసారి జపానీయుల చిత్రలేఖనమును జూచుట తటస్థించినది. వారికళనుజూచి యాశ్చర్యము నొందక దప్పదు. అనుకరణముగాక, కేవలము వారి జాతీయతయె యందు ద్యోతకమగుచుండును.

స్వామిజి:—ఆలాగుననే. వారి కళనుబట్టియే వారంతటి గొప్పజాతివారైరి. మనవలె వారును ఆసియాఖండవాసులేయని నీకు దెలియదా? మనకున్నదంతయును మనము పోగొట్టుకొన్నను, ఇంకను మిగిలియున్న దానిని జూచిన చో ఆశ్చర్యచకితులముగాక తప్పదు. ఆసియాఖండపు హృదయమంతయు వారికళలయందు మిళితమైయున్నది. కళాసౌందర్యములేని ఏవస్తువును ఆసియా వారెన్నడును ఉపయోగింపలేదు. కళ యనునది మనకు మతమందలి యొక శాఖ యని నీకు దెలియదా? పండుగసమయము లందు బియ్యపుపిండితో, మనస్త్రీలు నేల పైనను, గోడలపైనను చిత్రించు చిత్రము లనుజూచి వారిని మనమెంతగా శ్లాఘించుచుందుము! శ్రీ రామకృష్ణుడు స్వయముగా ఎంతటి ఘనమగు శిల్పియో నీకు తెలియదా?

ప్రశ్న:—ఆంగ్లేయుల చిత్రకళగూడ గొప్పదియే అగునా?

స్వామిజి:— నీ వెంతటిమూర్ఖుడవు. ప్రజాసామాన్యమందరీ రీతిగానున్నప్పుడు నిన్నొక్కనిని తప్పుపట్టుటవలన లాభమేమి? ఇట్టి దౌర్భాగ్యస్థితికి మనదేశముజారిపోయినది. ప్రజలు తమ బంగారమునుజూచి యిత్తడి యనియు, విదేశీయుల యిత్తడిని జూచి బంగారమనియు భ్రమించునంతటి యధోస్థితియందుండిరి. ప్రస్తుత విద్యావిధానము యొక్క యింద్రజాలమిదియె. పాశ్చాత్యులు, ఆశియావాసులతో సంబంధమేర్పరచుకొనినప్పటినుండియు, వారి జీవితములను కళా సమ్మిశ్రమముగా జేసికొనుటకు యత్నించుచుండిరని తెలిసికొనుము.

నేను:—మహారాజ్, తమ యీ సంభాషణలను, పరులువినుట తటస్థించుచో, తమరు "సర్వము ఆనందముకొరకే" యను తత్త్వవేత్తలని భావింపక తప్పదు.

స్వామిజి:—తప్పకుండ. కాలవాహినియందుబడి కొట్టుకొని పోవువార లింతకంటె యధికముగా నేమి యాలోచింపగలరు? నా దృష్ట్యా నీ కన్నియును ఋజువుచేయగలను. వారి భవనములను పరిశీలింపుము. అవి ఎంత సర్వసామాన్యమై, యర్థరహితముగా నున్నవో గ్రహించితివా! వారి కచేరీ భవనములయొక్క బాహ్యస్వరూపములను గాంచి, యవి ఎందుకు నిర్మింపబడినవో చెప్పగలవా? అవి యంతటి కళాహీనములై యున్నవి. పాశ్చాత్యుల వస్త్రధారణమును పరిశీలింపుము. శరీరమున కంటుకొనియున్న వారి వంగని చొక్కాలు, సరళమైన లాగులు మన దృష్టియందసభ్యమైనవిగా గాన్పించుచుండుటలేదా? ఇక వానియందున్న సౌందర్యమునుగూర్చి వేరుగా జెప్పబనిలేదు. మన మాతృదేశమంతయు సంచారముచేయుము. మన గృహ నిర్మాణమునందలి యాంతర్యము, కళాసౌందర్యము, వానిని జూచినంతనే గ్రహింపగలిగెదవో లేదో పరిశీలించిజూడుము. వారు పానీయమును త్రాగుటకు గ్లాసు నుపయోగింతురు. మనము లోహకుంభము నుపయోగింతుము. వీనియందేది కళాశోభితము? మన గ్రామములందలి వ్యవసాయదారుల గృహములను జూచితివా?

నేను:—అవును నేను జూచితిని.

స్వామిజి:—వాటియందేమి గాంచితివి?

భక్తుడు :—ఏమి చెప్పవలయునో నాకు దెలియదు. అయినప్పటికిని, మహారాజ్, వాటి దొడ్లు, నేలలు బాగుగా అలుకబడి, యతి శుభ్రముగను, నిర్మలముగను ఉండును.

స్వామిజి :—వారి ధాన్యపుకొట్లను జూచితివా? అవి ఎంతటి కళానిర్మితములో? వాని మట్టి గోడలమీదగూడ, ఎంతటి భిన్న భిన్న చిత్రములు చిత్రింపబడియుండును! పాశ్చాత్య దేశములకుబోయి, పల్లె ప్రజలను పరిశీలించిన యీ వ్యత్యాసము బాగుగా దెలియగలదు. వారియాదర్శము లాభము. మనది కళ. ప్రతిదానియందును పాశ్చాత్యులు లాభమునే యాదర్శముగానుంచుకొందురు. మన మెల్లయెడలను, కళాచతురతనే లక్ష్యముగా నుంచుకొందుము. పాశ్చాత్య విద్యాఫలితముగా ఆ సుందరములగు లోహపాత్రలకు బదులుగా, ఎనేమల్ గ్లాసులను మనగృహములయం దుపయోగించుచున్నాము. ఈ విధముగా ఇతరులచే పరిహసింపబడునంత తీవ్రముగా, మనము ప్రతిదానియందును లాభమునే యాదర్శముగా నుంచుకొను అభ్యాసపరుల మైతిమి. నేడు మనకు గావలసినది సా లాభమును కళలతో సమన్వయపరచుటయే. జపానుదేశము ఈ సందర్భమున తీవ్ర కృషిచేయుటచే, అనతికాలముననే ఉన్నతదశకు వచ్చెను. తిరిగి జపాను దేశస్థులు పాశ్చాత్యులకే బోధింపగలుగుచున్నారు.

ప్రశ్న :—మహారాజ్, ప్రపంచములో ఏజాతి మిక్కిలి అందముగా వస్త్రధారణము గావించుకొనుచున్నది?

స్వామిజి :—ఆర్యులు ధరింతురు. ఐరోపావారు గూడ ఈ విషయమం దేకీభవించిరి. ముడతలతో ఎంత యందముగా వారి దుస్తులు వ్రేలాడుచుండును! ప్రపంచమందలి వివిధజాతుల రాజదుస్తు లన్నియును ఆర్యుల యనుకరణములే. వాటినిగూడ ముడతలతో నుంచుటకై ప్రయత్నములు జరిగెనుగాని, వారి జాతీయతకు భిన్నముగా నవి వెలసియుండుటను మనము గమనింపగలము.

సింఘ్‌జీ! ఆ పనికిరాని, పాశ్చాత్యులలోపలి చొక్కాలను ధరించుటను విసర్జింపుము.

ప్రశ్న :—ఎందుచేత, మహారాజా?

స్వామిజి :—పాశ్చాత్యులు వాటిని లోపలి చొక్కాలుగా ధరించుటయే కారణము. బాహ్యమునకు గనబడున ట్లెన్నడును ధరించుటకు వారు ఇష్టపడరు. బెంగాలు దేశస్థులు ప్రతీదియు ధరింపవచ్చుననియు, దుస్తులనుగూర్చి ఏవిధములగు నియమములు లేనట్లును, దుస్తులవిషయములో ఏ విధమగు పూర్వాచారము లేనట్లుగను, ఈ రీతిగా ధరించి ఎంతతప్పిదమును జేయుచున్నారు! నిమ్నజాతులు స్పృశించిన యాహారమును దిన్నచో మన ప్రజలు సంఘబహిష్కృతులయ్యెదరుగదా! ఈఅసభ్యదుస్తుల విషయమందుగూడా ఈ ధర్మ మనుసరింపబడుచో బాగుండెడిది. మన యభిరుచుల ననుసరించి ఏదోమాదిరి దుస్తులను నీవేల ధరింపగూడదు? పాశ్చాత్యుల లోపలిదుస్తులను, చొక్కాలను ధరించుటయం దేమిన్యాయముగలదు?

ఇప్పుడు వర్షముగురియుట కారంభమయ్యెను. మధ్యాహ్నభోజనమునకు గంట మ్రోగింపబడెను. ఇతరులతో ప్రసాదమును స్వీకరించుటకు మేము లోనికి బోయితిమి. భోజనము జేయుచు స్వామిజి "ఆహారమును మితముగా భుజింపవలయును. అమితాహారము, సోమరితనమునకు మూలకారణము." అని నుడివిరి. కొంతసేపాగి పిమ్మట "జపాను వారిని జూడుము. వారు వరియన్నమును, పప్పు పులుసుతో రోజునకు రెండు లేక మూడు సారులు భుజించెదరు. వారిలో మిక్కిలి బలాఢ్యులుగూడ, మితముగనే భుజింతురుగాని, ఎక్కువసారులు భుజింతురు. ఇక మనమో రోజునకు రెండుసారులు కుత్తుకవఱకు భుజించి, దానిని జీర్ణము జేసికొనుటయందే మన శక్తినంతటిని వృధాచేయుచున్నాము.

ప్రశ్న :—ఇంత దరిద్రస్థితియందున్న బెంగాలీలు తృప్తిగా భుజింపగల్గుదురా?

స్వామిజి:—మన బీదతనమునకు ప్రధానకారణము సోమరితనము. ఒక మిల్లుయజమాని, తనక్రింద పనిచేయుచున్న కార్మికునియందయిష్టతచే వానిజీతము తగ్గించినను, లేక, యొక కుటుంబములో ముగ్గురుగాని, నలుగురుగాని సంపాదించుచు అందొకరు మరణించినను, వారు చేయునదేమి? బిడ్డలకిచ్చుచున్న పాలను తగ్గించుటయో, లేక పగటి పూట భుజించుచు రాత్రులయందే పేపుడు బియ్యమునో తిని జీవించుటయు సంభవించును.

ప్రశ్న :—ఆ పరిస్థితులలో అంతకంటె ఎక్కువగా ఇంకేమి చేయగలరు?

స్వామిజి :— తమయాహారమును నిలబెట్టుకొనుటకై ఎక్కువగా ఆర్జించుటకేల శ్రమపడరాదు? కానిచేయరు! లోకాభిరామాయణమును జెప్పుకొను స్థలములకు బోయి వృధాగా కాలక్షేపమును జేయ జూతురు. వారు కాలమును దుర్వినియోగము చేయుచుంటిమని గ్రహించినచో ఎంత బాగుండును!



**కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః, లోకసంగ్రహమేవాపి సంపశ్యన్కర్తుమర్హసి.**
**యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే.**

జనకుడు మున్నగువారు కర్మములవలననే (చిత్తశుద్ధిని బడసి) ఆత్మజ్ఞానమును బొందినారు. (లేక నీకు చిత్తశుద్ధినిమిత్తము కర్మములతో బనిలేకున్నను, అనగా నీవు ఆత్మజ్ఞుడవేయైనను) లోకసంగ్రహార్థము (జనులను స్వధర్మనిరతుల గావింప: లేకున్న జనులు జ్ఞానిని గాంచి కర్మత్యాగులగుదురు అను విషయమును బరికించియైన), నీకు కర్మముల నాచరించుట ఉచితము.

శ్రేష్ఠవ్యక్తుల ఆచరణమునే జనసామాన్యము అనుకరించును; వారెద్దానిని ప్రామాణికబుద్ధితో అనుష్ఠింతురో, సాధారణజనులుకూడ దానినే అనుసరింతురు.

—శ్రీమద్భగవద్గీత, అధ్యా. 3 - శ్లో. 20, 21.

# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ప్రియ...

భగవదిచ్ఛయే నెఱవేరును. ఆయనవలననే యిది కల్పింపబడినయెడల ఆయనవలననే నశింపగలదు. 'నీ కోరికయే నెఱవేరుగాక!' అని సమస్తమును భగవంతునకే వదలి మనము నెమ్మదిగా నుండగలుగుచున్నాము. శాంత మనస్కులము కావుట కంతకంటె మార్గాంతరము లేదు. భగవదిచ్ఛానుసారమే ప్రపంచము సృష్టింపబడినదన్న దృఢభావము హృదయమున హత్తుకొన్నప్పుడే శాంతి యుదయించును. నిజముగా జూచినచో సమస్తమును ఆయన ఆధీనమునందలిదియే. ఆయన ఎట్లు చేయించునో అట్లే జరుగును. అది మనకు దెలియవచ్చును లేదా తెలియకను పోవచ్చును. ఇదిమాత్ర మెంతయు సత్యము. ఆయన కృపవలన దీనిని దెలిసికొనినచో మనస్సునకు శాంతి సమకూరును. లేనిచో హాని, శోకము, దుఃఖము, హర్షము మొదలగువానిచే మనస్సు కలతజెందును. ఆయనయందే సంపూర్ణముగ నిబ్బరము పూనినచో మనము యథార్థసుఖమును బడయగలము. కాని ఆయన కృపాకటాక్ష నిరీక్షణము లేనిచో ఏ విధముగానయినను నేదియు సమకూరనేరదు. సరళహృదయముతో ఆయనను ధ్యానింపగలిగినచో ఆయన నీ ప్రార్థనలను తప్పక ఆలకించును.

శ్రీ మాతృదేవి చరణసన్నిధిని నీ కుమారుని నిలిపినందున నీ మానసమున నొకానొక నూతన భావానుభూతి కలిగినట్లు తెలిపియుంటివి. అట్లే నీ భార్యను, ధనమును, బంధువులను మఱియును నిన్నును నిజముగా ఆత్మసమర్పణము చేయగలిగినచో నీ జన్మము సఫలతనందును. వీరందరును భక్తుల కోరికల నెఱవేర్పగలవారు.

ఇట్లు,
నా శుభాశీర్వాదములతో,
శ్రీ తురీయానంద



శ్రీహరిశరణమ్

శ్రీరామకృష్ణ అద్వైతాశ్రమము,
వారణాసి, 3-1-'17.

ప్రియ బి. బాబు,

సాధారణ జనులకు ముక్తుల ప్రారబ్ధానుభవములు సత్యములై కనుపించినను వారు వానిని అంగీకరింపరు. ఎందువలననగ దేహాత్మబుద్ధి యున్నప్పుడే ప్రారబ్ధముగూడ నంగీకరింపబడును. 'దేహాత్మభావో నైవేష్టః పారబ్ధ స్త్యజ్యతాంమతః'* ఇదియే సిద్ధాంతము. భక్తులుసైతము సమస్తమును భగవదిచ్ఛయే యన్న భావమును కలిగియుండుటవలన వారు గూడ ప్రారబ్ధవిచారమును వదలివేయుదురు. కర్మాసక్తులే ప్రారబ్ధవిచారము కలిగియుందురు.

ఇట్లు,
నా శుభాశీర్వచనములతో,
శ్రీ తురీయానంద

---

* శ్లో. ప్రారబ్ధం సిద్ధ్యతి తదా యదా దేహాత్మనస్థితిః,
దేహాత్మభావో నైవేష్టః ప్రారబ్ధ స్త్యజ్యతాం మతః. —వివేకచూడామణి, 462.

నేను, దేహము అనుభావమున్నంతవఱకు ప్రారబ్ధముగూడ అనుభవింపవలయును. కాని దేహాత్మభావమును మనము ఒప్పుకొనము. అందువలన ప్రారబ్ధమునకు సంబంధించిన విచారము వదలిపెట్టుము.

# శ్రీ వాసుదేవ మననము

## ద్వితీయ వర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

"గృహస్పృహా పాదనిబద్ధ శృంఖలా కాంతాసుతాశా పటుకంఠపాశః । శీర్షేప తద్భూభార్యాశ నిర్షిప్తా సాక్షా త్ప్రాణాంతహేతుః ప్రబలాధనాశా ॥" (స. వే. సి. సా. సం. 47.) గృహక్షేత్రాదులయం దభిలాష పాదములకు దగిలింపబడిన శృంఖలములే. సతీసుతాదుల యందలి వ్యామోహము కంఠమునకు దగిలింప బడినట్టి యురిత్రాడే. ప్రబలమైన ధనాశతల మీద పడి అవ్యవహితముగ ప్రాణాంతహేతు వగు ప్రాజ్యవజ్రపాతమే. "ధనంచభూమౌ పశవశ్చగోష్ఠే భార్యాగృహద్వారి జనశ్శ్మశానే। దేహశ్చితాయాం పరలోక ఆత్మా కర్మాను గోగచ్ఛతి జీవ ఏషః ॥" ఆత్మీయములని భావింపబడు ధనము భూమియందును, పశువులు గోష్ఠమునందును, భార్య గృహద్వారము కడను, పుత్రమిత్ర బాంధవాది పరిజనము పితృవనమునను, శరీరము చితియందును ఎక్కడివక్కడనే యాగిపోవును. ఆత్మ - జీవుడు - నిజకర్మానుగుణముగ లోకాంతరముల బొందును. "ఏక ఏవ సుహృద్ధర్మో నిధనేఽ ప్యనుయాతియః । శరీరేణ సమంనాశం సర్వ మన్యద్ధిగచ్ఛతి ॥" (మనుః 8-17). ఇట్లు సర్వము శరీరముతోపాటు నశించును. ధర్మ మనెడి సుహృదుడుమాత్రము శరీరాపాయము నందుగూడ ఆత్మను విడువక అభీష్ట ఫల దానార్థము ఆత్మ ననుగమించును. కనుక స్వసతీసుతాది స్నేహము నపేక్షించి స్వధర్మము నతిక్రమింపగూడదు. "స్వప్నలబ్ధ పదార్థంబు చందమునను । తలచి చూడంగ వట్టి దంధనము ధనము ॥" విత్తాపత్య కళత్రాది సర్వస్వము స్వప్నలబ్ధ పదార్థములవలె క్షణభంగురమే. "యేషామాశా నిరాశా స్యాద్దారాపత్య ధనా దిషు । తేషాంసిద్ధ్యతి నాన్యేషాం మోక్షాశాభి ముఖేగతిః ॥" (స. వే. సి. సా. సం. 86.) ఎవరికి దారాపత్య ధనాదులయం దాశ నిరాశ యగు చున్నదో వారికే మోక్షాశాభిముఖమైన గతి సిద్ధించును. "గతిస్తు గమనే మార్గే దశాయాం బుద్ధ్యుపాయయోః" (ఇతి నానార్థ రత్నమా లాయాం ॥) అన్యులకు అనగా ఏషణాత్రయ పరిత్యాగమునం దశక్తులగు సంసారలంపటులకు మోక్షమునం దిచ్ఛయే జనించదు. "అర్థ యుతోవా క్షేత్రయుతోవా హితపుత్రోవా సుకళత్రోవా । సంసారేఽస్మి న్మోహిత చిత్తః శోచతి శోచతి శోచత్యేవ ॥" ధన సంపన్న

తయు భూసంపన్నతయు సత్సంతానమును
అనుకూల దాంపత్యమును కలిగియున్నవా
డయినను, ఈ సంసారమునందు మోహిత
చిత్తు డయ్యేనేని యెడతెగని దుఃఖమునే
యనుభవించుచుండును. "విపదో నైవ విపదః
సంపదో నైవ సంపదః। విపద్విస్మరణం విష్ణోః
సంపత్తస్యైవ సంస్మృతిః॥" సాంసారిక విపత్తు
విపత్తు కాదు. సాంసారిక సంపత్తు సంపత్తు కాదు.
మహేమన విష్ణుని విస్మరించుటయే మహావిపత్తు.
సంతత విష్ణుసంస్మరణమే సర్వోత్కృష్టమైన
సంపత్తు. "యథావ్యాళగళస్థోఽపి భేకోదంశా
నపేక్షతే। తథా కాలాహినాగ్రస్థో లోకో భోగాన
శాశ్వతాన్ । కరోతి దుఃఖే నహి కర్మతంత్రం
శరీరభోగార్థమహర్నిశం నరః॥" (అధ్యాత్మరా.
2-4-21.) పామునోటం జిక్కియున్న కప్ప తన
మృతిని దెలియక నీగలనుబట్టి భక్షింపనుంకించు
పగిదిని లోకులు కాలరూప కాకోదరదంష్ట్రలం
జిక్కియుండియు దమ యస్థిరతను గుర్తించనేరక
సంసార వ్యామోహితచిత్తులై అనిత్యములైన
విషయసుఖముల నభిలషించుచున్నారు.
మనుష్యు డహర్నిశాదులాయా కర్మతంత్ర
ములను దుఃఖముతోనే చేయుచున్నాడు. శరీర
సుఖముకొఱకే గదా! "ఆపదః క్షణమాయాంతి
క్షణమాయాంతి సంపదః। క్షణం జన్మాథ మర
ణం సర్వం నశ్వరమేవతత్॥" (మహా. ఉ.
3-53) క్షణములో సంపదలు గలుగును. క్షణ
ములో ఆపదలు గలుగును. జనన మరణములు
ప్రతి క్షణమునను కలుగుచుండును. సాంసారిక
మంతయు క్షణభంగురమే కదా! "అనిత్యాని
శరీరాణి విభవో నైవ శాశ్వతః నిత్యం సన్ని
హితో మృత్యుః కర్తవ్యో ధర్మసంగ్రహః॥"
శరీరములు బుద్బుదప్రాయములు. సంపదలు
తటత్ చంచలములు. మృత్యువు నిత్యసన్ని
హితము. కనుక ధర్మసంగ్రహము ముఖ్యకర్త
వ్యము. "అప్రార్థితాని దుఃఖాని యథైవా
యాంతి దేహినాం। సుఖానిచ తథా మన్యే దైన్య
మత్రాతిరిచ్యతే॥" దుఃఖములు వాంఛితములు
గాక జేకుఱు భంగి సుఖములును గాలానుసార
ములై ప్రాప్తములగును. ఇచ్ఛామాత్రముచేత
లభ్యములుగావు విశేషించి దైన్యమవశేషిం
చును. "నాభవ్యం భవతీహ కర్మవశతో
భావ్యస్య నాశః కుత కర్మవశమున గా
దగనిది ఎన్నడును కానేరదు. కాదగినది తప్పక
యగును. "భవితవ్యం భవత్యేవ యదభావిన
తద్భవేత్। ఇతినిశ్చిత బుద్ధీనాం నచింతా బాధతే
క్వచిత్॥" అనగా "క. కానిది కాదెన్న
టికిని। కానున్నది మానదెపుడు కాకది దైవా
ధీ।నంబీ విధి నెఱిగిన। ధీనిధి చింతింపడెపుడు
దేనికినైనన్॥" ('పూర్వజన్మకృతం కర్మ త
ద్దైవమితి కథ్యతే దైవమన పూర్వజన్మ
కర్మము') "కడలి నడుమనుండి కడలి కావలి
నుండి। యొండు దీవిగడ్డ నుండి తెచ్చి। నిమిష
మాత్రలోన సమకూర్చుబో విధి। యభిముఖుండ
యేని యభిమతంబు॥" విధి యనుకూలుడయ్యే
నేని సముద్ర మధ్యమునం దున్నను, సముద్ర
మున కావలనున్నను, ద్వీపాంతరమునం
దున్నను, అభిమతమును నిమిషమాత్రములో
సమకూర్చును. వ్యర్థప్రయాసమున నాయు
ర్వ్యయంబు సేయం జనదు.

(సశేషము)

# సంఘవార్తలు

## దుర్గాపూజ

భరతఖండమునందును, విదేశములందును నవరాత్రులందు హిందువులెల్లరు దుర్గాపూజ చేయుదురు. ఇదిపురాణకాలమునుండియువచ్చు చున్నయాచారము. మహిషాసురునిచే నోడింపబడి దేవతలు, విష్ణుమహేశ్వరులయొద్దకు పోయి తమ కష్టముల తెలిపిరి. వారు ఆగ్రహచిత్తులై తమతమ యంశములనుండి కొంత కొంత దివ్య తేజస్సును ప్రత్యేకించి మూర్తీభవింపజేసిరి. ఈ దివ్యతేజస్సు స్త్రీరూపము నొంది మహిషాసురుని వధించెను. ఆనాటినుండి దుర్గానామ ధారిణియైన ఈ దేవి, హేమంతఋతువునందు పూజింపబడుచున్నది.

శ్రీరామచంద్రుడు రావణుని వధింప అకాలమగు హేమంతఋతువున ఈ దేవిని పూజించెననియు వచింతురు. సమస్తబాధా నిర్మూలనకారిణియైన దుర్గాదేవి దశహస్త ఖడ్గ ధారిణియై, ధనదేవతయైన తనకుమార్తె లక్ష్మీదేవితోడను, విద్యాదేవతయైన సరస్వతి తోడను, ధైర్యసాహసమూర్తియైన కార్తికేయునితోడను, సమస్త విజయకారకుడైన గణేశునితోడను ప్రత్యక్షమయ్యెను.

సింహవాహినియైన దేవి, మహిషాసురునిపై నిలిచి యాతని వక్షస్థలమును త్రిశూలముతో పొడుచుచున్నట్లగపడును.

ఈ దేవిని ఈ స్వరూపమున పూజించెడి వారు శత్రువిముక్తి, ప్రతిబంధకముల నిర్మూలనముకల్గి లక్ష్మీకటాక్షమున ధనవంతులును, సరస్వతీ ప్రసన్నతవలన విద్యావంతులును, కార్తికేయుని అనుగ్రహమున బలసంపన్నులునునై గణేశుని కటాక్షమున జయము సంపాదింతురని ప్రవచింపబడియున్నది. దేవి తనంతట తానే ముక్తి నొసగుననెడి సత్యము భాసించి హేమంత ఋతుపూజ మరింత ఉత్సాహ వైభవానందములతో జరుపబడుచున్నది.

సతీదేవి దక్షప్రజాపతి యజ్ఞమున తన భౌతికశరీరమును త్యజించి పార్వతీనామమున మేనకాత్మజయై జన్మించెను. ఆమె తన కఠోర తపముచే మహేశ్వరుని ఆనందపరవశుని చేసి ఈశ్వరుని వివాహమాడి, కైలాసమున ఆతనితో నివసింప ప్రారంభించెను. మేనకామాత, పార్వతీదేవిని నిరుపేదభిక్షుకుడైన శివుడు తగు రీతిని ఆదరింపజాలడని కడు ఖిన్నురాలయ్యెను. ఆమె ప్రార్థనవలన పార్వతి పితృగృహమున (భూమి) కేతెంచి యచట తన నలువురు బిడ్డలతో మూన్నాళ్లు గడిపెను. మూడుదినములే యైనను, పార్వతి భూమిపై తమ మధ్య నుండుటవలన, మేనకకును భూవాసులకును ఆనందము అపరిమితమయ్యెను. వారెల్లరు ఆ మూడుదినములు పూర్తిగా ఆనందమున నోలలాడిరి. ప్రేమ, భక్తి, అనురాగములతో ఆమెను సమస్తవైభవోపేతముగా పూజించిరి.

పూజానంతరము దేవి నాల్గవనాడు కైలాసమున కేగెను. విజయదశమినాడు దుర్గాదేవి యొక్కయు ఆమె సంతతియొక్కయు విగ్రహములన్నింటిని మేళతాళములతో వూరేగించి జలధిలో కలుపుదురు. ఈ పుణ్యదినమున ప్రజలెల్లరు తమ పూర్వవైరములను, పాక్షికవివాదములను, జాతికులమతవయోభేదములను పాటింపక ఒకరి నొకరు కౌగలించుకొని వారిజీవితములందు నూతనఅధ్యాయములను ప్రారంభింతురు.

ఈ యేడు చెన్నపురి శ్రీ రామకృష్ణమఠమున దుర్గాపూజ 24-9-1952 మొదలు 29-9-1952 వఱకు జరుపబడును. భక్తులెల్లరును ఈ పూజయందు పాల్గొని దేవీప్రసాదమునకు పాత్రులగుదురు గాక!



# గ్రంథ సమీక్ష

## నారద భక్తిసూత్రములు

(సూత్రార్థ ప్రకాశికావ్యాఖ్య)

సైజు 1/8 డిమ్మి ; పుటలు 218 శ్రీ మళయాలస్వాములవారి పదవిభాగము, ఆంధ్ర ప్రతిపదార్థ తాత్పర్య విశేషార్థములు. వెల రూ 2 లు. ప్రాప్తిస్థానము : శ్రీవ్యాసాశ్రమము, ఏర్పేడుపోస్టు (చిత్తూరు జిల్లా).

మోక్షరాజ్య సింహాసనమునకు భక్తిమార్గ మతి ప్రాచీనమైనది. సృష్ట్యాదిని మానవుడు కండ్లు తెరచినప్పుడు సూర్యచంద్రుల ఉదయాస్తమయములు, మేఘముల ఉరుములు, మెరుపులు, పిడుగులు, వర్షము, సముద్రము మొదలుగాగల నిసర్గ వ్యాపారములు ఒక మహత్తరమైన ఆదిశక్తిని మానవునకు పరిచయము కల్గించినవి. వీనిని వీక్షించి ఆతడు భయచకితుడై, ఇదేమి ఆశ్చర్యము, అదేమి అద్భుతము అని విస్మయమందెను. మానవునియందలి ఈప్రథమ విస్మయభావనయందే భక్తిబీజములు నాటబడినవి. ఈ బీజములు అనంతశక్తిరూపుడగు పరమాత్మునకు శరణాగతుడైన అల్పశక్తివంతుడగు మానవునియందంకురించినవి. మానవ జీవితాశయమగు మోక్షపీఠము నధిష్ఠించుటకు కలియుగమున ఈ భక్తిసాధనయే సులభసాధ్యమనియు సుఖకరమనియు ఋషులు నిశ్చయించినారు. భరతఖండమునందుగల వివిధయోగ మార్గములలో భక్తిమార్గమే లోక ప్రియమగుట కనేక కారణములు గలవు. సాధనయందుగల సులభతయే ముఖ్యకారణము. ఈ మార్గమునందు దీర్ఘతపానుష్ఠానములయావశ్యకత లేదు. జాతిమత, లింగ వయోనిర్బంధములు లేవు. కరుణాంతరంగుడగు పరమాత్ముని యందుగల ప్రేమోన్మాదమునకే భక్తియని పేరు. ఇట్టిభక్తిసాధన శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం అని పలువిధములుగ విభజింపబడినది. గోపికాస్త్రీలు శ్రీకృష్ణునిభక్తిచే మోహించి మోక్షమందిరి. ఆంజనేయులు శ్రీరాముని సర్వేశ్వరునిగానెంచి భజించి మోక్షమును పొందెను. నిన్న మొన్నటి త్యాగరాజు, శ్రీరామకృష్ణపరమహంసల విషయము భక్తులకు విదితమే. శ్రీనారదులవారు భక్తిని పరమ ప్రేమరూపముగ సూత్రీకరించినారు.

నారదప్రోక్తమగు భక్తిసూత్రములను తెలుగువారికత్యంతోపయోగకరమగునట్లు పదవిభాగము, ఆంధ్రప్రతిపదార్థ తాత్పర్య విశేషార్థములతో శ్రీమలయాళస్వాములవారు రచించినారు. పలుగ్రంథములను రచించి సామాన్యమానవుల ఆధ్యాత్మికోన్నతికి పాటుపడుచున్న శ్రీ స్వాములవారిసేవ అపారము. సూత్రార్థప్రకాశిక అను వ్యాఖ్యానముతోకూడిన శ్రీస్వాములవారి నారదభక్తిసూత్రములు ప్రతి ఒక్కరు చదువదగినది. ఇందలి విశేషార్థములు ప్రత్యేక విశిష్టతను కలిగియున్నవి.

ఇంకను ఇట్టి ఉద్గ్రంథములను పెక్కింటిని తెలుగు ప్రజకు స్వాములవా రందజేయగలరని ఆశించుచున్నాము.

---

## సవరణ

గతసంచిక ప్రార్థనయందు 8-వ శ్లోకము నందు 'తేగాం' అనుటకు బదులు 'తేషాం' అనియు 9-వ శ్లోకమునందు 'కళా-జగదీశ్వరస్య' అనుటకుబదులు 'కళాభగవతః జగదీశ్వరస్య' అనియు సవరించి పాఠకులు పఠింపఁగోరుచున్నాము.



లాల్‌జి గోధు & కంపెనీవారి
ఎల్.జి
ఇంగువను
WHEN BUYING ASAFOETIDA
Specify
L.G the
Mark of Quality
మార్కు గమనించి
కొనుడు
మోసపోకుడు
లాల్‌జి గోధు అండ్ కో
సౌకార్‌పేట, మదరాస్


(L G. 9-3)

# విషయసూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరఁదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులోఁగాని, మీ పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

3. ఉత్తర ప్రత్యుత్తరములు పీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪ చిరునామాయందు ఎట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧ కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతి నెల మొదటి తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

3. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీరామకృష్ణ ప్రభ శ్రీరామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయునచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.

# శ్రీ రామకృష్ణ లీలామృతము

2-వ కూర్పు, 496 పుటలు.　　　దివ్యమగు ద్వితీయ ముద్రణము　　　వెల రూ. 5

## ప్రాజ్ఞవాణి

(ఈ క్రిందివి శ్రీ రామకృష్ణలీలామృతమును గురించి ప్రాజ్ఞుల అభిప్రాయములు. కొలది పండిత విమర్శకులు ఆంధ్ర సాహిత్యలోకమున సుప్రసిద్ధులగుటచే వీనిని గుర్తించిన నిదర్శనములిందు వ్రాయబడలేదు.)

### గౌరవనీయులగు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పా॥ వే॥ రాజమన్నారుగారు, మద్రాసు.

ప్రశస్తమైన వస్తువు. అకలంకమైన జీవితము, లోకోత్తరమైన సందేశము. దేహమును పులకరింపజేయు ఆధ్యాత్మికానుభవములు - శైలి సరళము, మధురము. భాష నిర్దుష్టము. - సర్వవిధముల నమూల్యమైన గ్రంథరాజము.

### పింగళి లక్ష్మీకాంతంగారు, వాల్తేరు.

ఏదేని జీవితచరిత్ర వాఙ్మయకోటికి ఎక్కవలెనన్న ఆ చరిత్రకు విషయభూతుడైన పురుషుడు మహోదార మూర్తియై ఉండుటయే కాక, ఆ గ్రంథశైలియు అపేలవ రమణీయముగా నుండవలెను. అటులుండునేని ఆ పురుషుని చరితమునందు అపేక్షలేనివారు సయితము శైలీరామణీయకమునుపట్టియైనను, ఆ గ్రంథమునుమక్కువతో పఠింతురు.

అవతారపురుషుడైన శ్రీ రామకృష్ణపరమహంస జీవితము తనంతనే లోకపూజ్యతనందినదగుటచేత దానియందపేక్షలేనివారే ఉండరు. అట్టి మహాపురుషుని చరిత్రమును తదనుగుణమైన నిర్దుష్టరమణీయశైలిలో రచించి, శ్రీ కందుకూరు మల్లికార్జునంగారును, శ్రీ వెదురుమూడి కృష్ణరావు పంతులుగారును శ్రీ రామకృష్ణలీలామృతమనుపేర తెనుగు వచనవాఙ్మయమునకు ఒక చక్కని యలంకారమును సమర్పించిరి.

ఈ గ్రంథమునకు ప్రేరకులైన శ్రీరామకృష్ణమఠము వారు మిక్కిలి ప్రశంసార్హులు. వారు అద్వైతప్రచారముతోపాటు ఆధ్యాత్మికగ్రంథప్రచురణముగూడ సల్పుచుండుట సర్వజన సమస్కారార్హమైన కార్యము.

ఈ గ్రంథము విషయానురూపమై సుబోధమైన శైలిలో రచింపబడినదనుటకు ఎట్టిసందియమునులేదు. గ్రంథకర్తలు అచ్చటచ్చట పాటించిన విసంధి ఆ సహజసుబోధకత్వమునకు మరికొంత ప్రసన్నత అపాదించెను.

ఇంకొక విశేష మేమనగా:-ఈ గ్రంథము ద్వికర్తృకమయ్యు ఏకకర్తృకముగా భాసించుచుండుట. గ్రంథకర్తలిరువురును సర్వవిధముల సమస్కంధులును, సమానసాధ [illegible] టి యొకమి కుదురదు.

ఈ గ్రంథకర్తలకును, ప్రచురణకర్తలకును, నామనః పూర్వకమైన అభినందనములు అర్పించుచున్నాను. (22-9-1952.)

### శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు, తిరుపతి.

నాకు మిక్కిలి　　పంపిన శ్రీ రామకృష్ణలీలామృత ప్రతిని కృతజ్ఞతతో అందుకొని, సాంతము చదివితిని. ఆధునికకాలమున వెలువడిన కొలది మహా గ్రంథములలో అన్నివిధముల ఇది యొకటి. రచయితల అపారచిత్తశుద్ధి, విశ్వాసపూరితప్రపత్తి, గ్రంథములోని ప్రతిపుటలోను సుస్పష్టముగ గోచరించును. శైలియు సుబోధముగా ఉదాత్తముగా నున్నది. (22-9-1952.)

### మహోపాధ్యాయ శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు, నెల్లూరు.

అధునాతనకాలమున, శ్రీ రామకృష్ణుని జీవితమువలె, భారతీయులననేల? అభారతీయులనుకూడ అధ్యాత్మ విద్యాపరిశీలనమునకు ఎలయించినది వేఱొకటిలేదు. 'విశ్వమత విమర్శ' సభలో శ్రీ వివేకానందుఁ డుపన్యసించి, సభ్యుల ముగ్ధులఁగావించినది దొరఁకొని తత్త్వజిజ్ఞాసువులు, స్వామివారికి తాదృశజ్ఞాన ప్రదాతయైన యద్భుత వ్యక్తింగూర్చి యరయసాగి తమచూపు తుదకు రామకృష్ణావతారము వంకకుమరల్చిరి. తదవతార చరితార్ణవము తరిచి యెత్తఁబడిన సారమే యీ అమృతము. ఇది తాపత్రయాగ్ని సంతప్తమైయున్న యీ లోకమునకు తప్పక ఉపశాంతిం గూర్పఁగలదని విశ్వసించుచున్నాను.

రచన, యెల్లయెడల నిర్దుష్టముగాను, ప్రసన్నగంభీరముగాను "చదువుచోనంతంతకెదకుత్సుకతఁబెంచి శ్రమము తోఁపింపని శైలి సొంపు" కలదిగాను శోభిల్లుచున్నది.

శిష్యుల చరిత్రముల మూలకృతినుండి విడఁదీసి అనుబంధముగా ప్రకటించుట ఎంత రుచిరము! దీనివలను జీవితకథ నిరర్గళముగా సాగుచు పాఠకుల దృష్టిని శ్రీరామకృష్ణునియందే కేంద్రీకరింపఁజేయుచున్నది.

గ్రంథాంతమున, అకారానుక్రమ విషయసూచి చేర్చుట సౌకర్యావహము. అది వలయునంశము తటాలునఁజూడ

విశ్వసించు [illegible] [illegible]. ఈ
గ్రంథము [illegible] [illegible] కోరిక [illegible] కలదు
[illegible] గ్రోల నుపకరించుచేయునని నా నమ్మకము. అట్టి
నాడు ఒక మహోన్నత కార్యమును గోర్వెత్తుచున్నట్టు
నందించుచున్నాము. ఈ యుత్తమ గ్రంథప్రచురణకు ప్రకా
శకులకు సంస్కర్తలకు ఎల్లరకు నా హృదయపూర్వకాభి
నందనములు. (22-9-1952.)

---

## శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, మద్రాసు.

మీరు ప్రకటించిన శ్రీరామకృష్ణలీలామృతమును అత్యంతాసక్తితో చదివి ఆనందించుచే కాదు; ఎన్నియో అపూర్వములైన మహత్తర విషయములను తెలిసి కొంటిని. ఆధునికకాలములో శ్రీ గురుదేవునికి అర్హమైన ఘనమునుగడించి కీర్తికెక్కిన పరమహంసపదము నొందిన వారు లేరు. తన దివ్యానుభవముచే ప్రాచీన భారతీయాధ్యాత్మిక విజ్ఞానము సుత్కృష్టతను దేశీయులైన నవ్యులకు నిరూపించిచెప్పి దానిని సముద్ధరించిన మహాను భావుడు ఒక్క శ్రీ రామకృష్ణ పరమహంసయే.

ఈ గ్రంథమునందు శ్రీ రామకృష్ణులవారి యొక్క బాల్య యౌవనాది జీవిత విశేషములు, అనుభవములు, వారి యోగసాధనాదులు, భైరవీబ్రాహ్మణి, తోతాపురి మొదలైన వారిగురువులు, ప్రసంగవశమున వారు తమ శిష్యులకు జ్ఞానోపదేశకముగ చేయుచువచ్చిన బోధలు చక్కఁగా వివరింపబడినవి; శ్రీరామకృష్ణులవారి సన్న్యాస, గృహస్థ శిష్యుల, బాలభక్తుల సంగ్రహ జీవిత వివరణములు మొదలైన అనేక అమూల్య విషయములు కలవు. ఈ గ్రంథములోని ప్రతి పుటలోను శ్రీ గురుదేవుల దివ్యానుభవము, మహత్తు, ఘనత మనస్సుకు గోచరించుచుండును. ఇది నిశ్చయముగ శ్రీరామకృష్ణలీలామృతమే.

ఈ గ్రంథమంతయు ఒక మనోహరమైన కథవలె ఎంతో యింపుగను సొగసుగను తేటతెల్లమైన శైలిలో వ్రాయబడినది. అసలు శ్రీ రామకృష్ణుని జీవితమే అలౌకికాద్భుత సన్నివేశములతోగూడి పాఠకుని హృదయము నత్యంతము నాకర్షించును. దానికితోడు ఈ గ్రంథము నందలి రచనకూడ మృదుమధురమై సరళమై గ్రంథము చదువ మొదలుపెట్టినప్పటినుంచి ముగించువరకు తోచ నీయదు. మనసున కుత్తేజనమునిచ్చి అలౌకికానందమును గలిగించు గ్రంథమిది. ఆధ్యాత్మికచింత యున్నను లేకపోయినను [illegible] [illegible] [illegible] గ్రంథ మిది. [illegible]

---

## శ్రీ మోటుపల్లి రామానుజరావుగారు, కొవ్వూరు.

పాశ్చాత్యభౌతికచింత నవ్యగిరిన ఈ కాలమున ప్రజా దృష్టిని భగవంతునివైపు మరల్చి, సర్వమతసామరస్యమును, సర్వజనసౌభ్రాత్యమును చాటిన మహానీయుఁడు శ్రీ రామకృష్ణపరమహంస. అలౌకికానుభవసంపన్నమును, అనిర్వచనీయమహిమాన్వితము నైన అతని జీవితచరిత్ర మొక దివ్యగాథ. అట్టి దివ్యగాథను వర్ణించు ఆంగ్ల మూలమున కీ గ్రంథము స్వతంత్రమగు తెనుఁగుసేఁత.

ఇందలి భాష నిర్దుష్టము; శైలి యతులితమాధురీమహితము. అన్యదేశ్యములను స్వీకరించుట, అర్థసౌలభ్యమునకై కొన్నిమాటలను వ్యావహారికార్థమున వాడుట మొదలగు విషయములందు ఇందుఁ గైకొనఁబడిన భాషా స్వాతంత్ర్యము సముచితమైనది. వాక్యయోజనావిధానమునందు నవ్యతనొప్పు ఆంగ్లభాషాసంప్రదాయముననుసరించు చున్నను, ఇది యీ గ్రంథమునకొక విశిష్టత నాపాదించుచున్నది. ఇందలి పారిభాషికపదవివరణము గ్రంథకర్తల ఆధ్యాత్మికపాండిత్యమునకు నికషప్రాయము. మొత్తము మీఁద ఈ గ్రంథము రామకృష్ణమఠాంధ్ర ప్రచురణములలోఁ బెక్కింటివలెఁ గాక పండితపామరులందఱకును బఠనయోగ్యముగా నున్నది. (24-9-1952)

---

## శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావుగారు

(తెలుఁగు ప్రొఫెసర్, ప్రెసిడెన్సీ కాలేజి, మద్రాసు)

భారతీయాధ్యాత్మిక సంస్కృతికి ప్రత్యక్షవ్యాఖ్యానమగు శ్రీ రామకృష్ణపరమహంస జీవితము నాంధ్రమున మరల ప్రచురించిన రామకృష్ణమఠమువారెంతయు ప్రశంసార్హులు. సుమారిరువదియేండ్ల క్రిందట ప్రథమ ప్రచురణమునందిన యీ గ్రంథ మిపుడు సమగ్ర సంస్కారమునుబొంది మనోహరమగు రూపమును గైకొన్నది.

విషయలోలుపతాప్రాబల్యమున నైతికపతనమునకు లోనగుచున్న సంఘమును పునరుద్ధరించుటకు ఇట్టి యుత్తమరచనలు మిక్కిలి ఆవశ్యకములు. సులభగ్రాహ్యమగు సరళశైలిలోనుండు నిట్టి వచనగ్రంథముల మూలముననే దేశమున విజ్ఞానవ్యాప్తి జరుగవలసి యున్నది. అట్టి విజ్ఞానవ్యాప్తియే ఆంధ్రాభ్యుదయమునకు కారణము కాగలదు. (25-9-1952.)

---




# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౯ } ౧౯౫౨ — అక్టోబరు : : నందన — ఆశ్వయుజము { సంచిక


## వి ష్ణు ష ట్ప దీ స్తో త్ర మ్

జ గ ద్గు రు శ్రీ మ చ్ఛం క రా చా ర్యు ల వా రు

అవినయమపనయ విష్ణో దమయ మనః శమయ విషయ మృగతృష్ణామ్।
భూతదయాం విస్తారయ తారయ సంసారసాగరతః॥ 1

హే విష్ణూ! అవినయభావమును దూరీకరింపుము. నా మనస్సును అణిగింపుము. మరు మరీచికములవంటి విషయముల నభిలషించు నాదాహామును నిల్పుము. జీవరాశులయందు దయను వృద్ధిచేయుము (భగవానుడా!) ఈ సంసారసాగరమునుండి నన్నుద్ధరింపుము.

దివ్యధునీమకరందే పరిమళపరిభోగ సచ్చిదానందే।
శ్రీపతి పదారవిందే భవభయఖేదచ్ఛిదే వందే॥ 2

గంగావారియను మధువును సచ్చిదానందమను సుగంధమును కలిగి భవభయమును తొలగింపగల శ్రీపతి చరణాంబుజములకు నా వందనములు.

సత్యపిభేదాపగమే నాథ తవాహం న మామకీనస్త్వమ్।
సాముద్రోహి తరంగః క్వచన సముద్రో న తారంగః॥ 3

నేను ద్వైతభేద రహితుడను. ఐనను, ఓ నాథా! నేను నీవాడను కాని, నీవు నావాడవు కావు, సముద్రమునకు తరంగములు చేరినవికాని తరంగములకు సముద్రము చేరినదికాదుగదా!

ఉద్ధృతనగ నగభిదనుజ దనుజకులామిత్ర మిత్రశశిదృష్టే। 4
దృష్టే భవతి ప్రభవతి నభవతి కిం భవ తిరస్కారః ॥

గోవర్ధనధారీ! ఉపేంద్రా! దానవవైరీ! సూర్యచంద్రులను నేత్రములుగలవాడా! నీ దృష్టిమాత్రముననే ఈ విశ్వము సృష్టిస్థితిప్రళయముల పొందునప్పుడు, ఈ సంసారము మాత్రము మాయము కాదా?

మత్స్యాదిభి రవతారై రవతార్యవరా సదా వసుధామ్। 5
పరమేశ్వర పరిపాల్యో భవతా భవతాపభీతోఽహమ్ ॥

ఓ పరమేశ్వరా! మత్స్యాద్యవతారము లెన్నో యెత్తి ఎల్లప్పుడు ఈ ప్రపంచకమును కాపాడితివి. సంసారతాపముచే దహింపబడు నన్ను కాపాడుటకు రమ్ము.

దామోదర గుణమందిర సుందరవదనారవింద గోవింద।
భవజలధి మథన మందర పరమం దరమపనయత్వం మే ॥ 6

దామోదరా! సర్వకల్యాణగుణ నికేతనా! సుందరవదనారవిందముగల గోవిందా! భవజలధియగు సంసారసాగరమును మథనముచేయు నీవు నా భీతిని తొలగింపుము.

నారాయణ కరుణామయ శరణం కరవాణి తావకౌచరణౌ।
ఇతి షట్పదీ మదీయే వదనసరోజే సదా వసతు ॥

ఓ నారాయణా! కరుణామయా! నీ చరణముల నాశ్రయించిన నా వదనసరోజమున ఈ షట్పదీస్తోత్రము ఎల్లప్పుడు నిలుచుగాక!

ఇతి శ్రీ శంకరాచార్యవిరచిత షట్పదీస్తోత్రమ్ సమాప్తమ్.



ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

## దక్షిణేశ్వరదేవాలయమున అంతరంగభక్తులతో గురురూపి శ్రీ రామకృష్ణుడు

శనివారము, 15 డిసెంబరు, 1883,
మార్గశీర్ష బహుళ పాడ్యమి.

'మ.' కొన్నిదినములనుండి శ్రీవారియొద్దనే బసచేయుచుండెను. వారిగదియందు రాఖాలు, లాటూ, హరీశు మొదలగువారుండిరి. హాజరా వసారాలో కూర్చొనియుండెను.

శ్రీరామలాలు ప్రహ్లాదచరిత్రము చదువుచుండెను. శ్రీవారు నేలపై కూర్చొని దానిని వినుచుండిరి.

భక్తశ్రేష్ఠుడగు ప్రహ్లాదుని చరిత్రమును వినుచు మాటిమాటికి శ్రీవారు భావావిష్టులగుచుండిరి. హిరణ్యకశిపుని వధ యయినది. నృసింహముయొక్క రుద్రమూర్తినిగాంచి, దాని గర్జనమును విని బ్రహ్మాదిదేవతలందరు ప్రళయము వచ్చుచున్నదని భయావిష్టులై, ప్రహ్లాదునే ప్రార్థనార్థము నృసింహునియొద్దకు పంపిరి. ప్రహ్లాదుడు బాలునివలె స్తోత్రముచేయ నారంభించెను. భక్తవత్సలుడైన భగవానుడు ప్రేమతో ప్రహ్లాదుని వీపు నిమురుచుండెను. భావావిష్టుడై శ్రీ రామకృష్ణుడు, 'ఆహా! ఆహా! భక్తులపై నెంత ప్రేమ!' అని పలుకుచు భావసమాధిలో మునిగెను. కనుకొలకుల నుండి ప్రేమాశ్రువులు రాలుచుండెను.

శ్రీవారు సహజస్థితికివచ్చి, తమ చిన్న మంచముపై కూర్చొనిరి. 'మ.' వారిపాదముల దరి క్రింద కూర్చొనియుండెను. అతనితో వారు మాట్లాడ నారంభించిరి; ఈశ్వరపరాయణులైనప్పటికిని స్త్రీసంగము చేయుటపై తమ కోపమును బయలుపఱచుచుండిరి.

శ్రీరామ:—సిగ్గులేదు? సంతానము కలిగినది, ఇంకను స్త్రీసంగమము! ఏమి, యీ పశుప్రాయమైన శీలము? నరములు, రక్తము, మలము, మూత్రము, వీటితో నిండిన శరీరముపై అసహ్యము కలుగదా? ఎవడు భగవత్పాదపద్మములందుసరియైనభక్తికలిగియుండునో అతనికి అతిలావణ్యవతియైన స్త్రీకూడ చితాభస్మమువలె గోచరించును. ఏ శరీరము నిలుకడలేనిదో, ఎది క్రిమి, శ్లేష్మ, పిత్తమలాదులతో నిండినదో దానితో ననుభవింపదగు నానందమేది? సిగ్గు! సిగ్గు!

'మ.' ఏమియు పలుకక మిన్నకుండెను.

శ్రీ రామకృష్ణ గురుదేవుడు మఱల ఇట్లు పలుక నారంభించెను:

శ్రీరామ:—ఎవనికేని సరియైన ఈశ్వరప్రేమ రవంతయైనను కలిగినచో కామినీకాంచనములు అతనికి అతితుచ్ఛములుగా గనుపించును. పటికబెల్లపు 'షరబత్తు' పుచ్చుకొనిన వానికి బెల్లపు పానకము రుచించునా? భగవానుని, వ్యాకులభావముతో ప్రార్థించి, సర్వదా ఆయన నామగుణానుకీర్తనము చేసినట్లైన క్రమముగా ఆయనయం దట్టి ప్రేమ కలుగును.

అని పలుకుచు శ్రీవారు భక్తిపరవశులై తమగదిలో ఆనందముతో పచార్లుచేయుచు పాటలు పాడ నారంభించిరి.

షుమారు 10 ఘంటలైనది. శ్రీరామలాలు దేవాలయమున అర్చనలను ముగించెను. శ్రీ రామకృష్ణ గురుదేవుడు దేవిని సందర్శించుటకు ఆలయమునకు పోవుచుండెను. 'మ.' కూడ శ్రీవారి వెంటనే పోయెను. శ్రీవారు ఆలయములో ప్రవేశించి పూజాపీఠముపై కూర్చొనిరి. కొన్నిపుష్పముల దేవి చరణములపై నిడిరి. తరువాత ఒకపుష్పమును తనశిరమున ధరించి, ధ్యానముచేయ ప్రారంభించిరి. పిదప

''భవుని (శివుని) భార్యా! నీ పేరు నేను వినియున్నాను, నీవు మా భయముల హరింప గలవట. కావున నీపై నా భారమును వేయుచున్నాను. నన్ను తరింపజేయుము. ఓ తల్లీ! నన్ను తరింపజేయుము.'' అను భావముగల యొక పాటను పాడిరి.

శ్రీ రామకృష్ణ గురుదేవుడు దేవాలయము నుండి తిరిగివచ్చి తమగదికి ఆగ్నేయమునగల వసారాయందు కూర్చొనెను. ఆలయములో ముఖ్యనివేదనము లింకను కాలేదు. ప్రాతఃకాలమున ఆరగించిన వెన్న, ఫలములతో శ్రీవారు భోజనము ముగించిరి. వారియొద్ద కూర్చొని రాఖాలు Smiles' Self-Help అను పుస్తకమును చదువుచుండెను. అప్పుడు Lord Erskine గారి విషయము చదువబడుచుండెను.

శ్రీరామ:—దానిలో ఏమి చెప్పబడియున్నది?

'మ.':—ఆ దొర ఫలమును అపేక్షింపక తన కర్తవ్యములను చేయుచుండెడివాడట. నిష్కామకర్మము.

శ్రీరామ:—చాల మంచిది. కాని పూర్ణ జ్ఞాని లక్షణ మేమనగా, వానియొద్ద ఒకపుస్తకమైనను నుండదు. శ్రీ శుకమహాఋషికివలె వారికంతయు ముఖస్థమే.

పుస్తకములందు, అనగా, శాస్త్రములందు, ఇసుకయు పంచదారయు కలిసియున్నది. సాధువు ఇసుకరేణువులను విడిచి పంచదార రేణువులనే గైకొనును. సాధువులు సారమునే గైకొందురు.

శ్రీ శుకమహాఋషిని చెప్పి శ్రీవారు తన్నే ఉదాహరించుచున్నారాయని 'మ.' తలంచెను.

అప్పుడు వైష్ణవచరణుడను గాయకు డచ్చటికి వచ్చెను. కొన్ని కీర్తనల పాడెను.

ఆనాటిరేయి 'మ.' నహబతులో గడపెను.



ఆదివారము, 16 డిసెంబరు 1883,
మార్గశీర్ష బహుళ ద్వితీయ.

ప్రాతఃకాలము 10 ఘంటలు. 'మ.' వారితో వారిగదికి పడమటిభాగముననున్న గుండ్రపు వసారాయందు కూర్చొనియుండెను. ఎదురుగా గంగానది దక్షిణాభిముఖమై ప్రవహించుచుండెను. ఉద్యానము మల్లె, గన్నేరు, గులాబి, తురాయి మొదలగు వివిధపుష్పములతో శోభిల్లుచుండెను.

'మ.' ను జూచుచు శ్రీవారొక పాట పాడ నారంభించిరి: (పాట భావము)

''నన్ను నీవు తరింపజేయవలెనమ్మా ఓ తారా! నేను శరణాగతుడను, పంజరమునందలి పిట్టవలె చిక్కువడియున్నాను, అసంఖ్యాకములగు అపరాధముల నొనరించితి, జ్ఞానశూన్యుడను, వట్టి భ్రమతో తిరుగుచున్నాను, దూడనుఎడబాసిన ఆవువలె మాయామోహితుడనైయున్నాను.''

ఏల? పంజరమునందలి పక్షివలె ఏలయగుదును? ఛీ! ఛీ!

ఈ విధముగ పలుకుచుండగనే భావావిష్టులై పోయిరి శ్రీవారు.

కొంత కాలమైన పిమ్మట " నన్ను సీతా దేవివలె చేయుము. ఆమె ఎట్లు తన శరీరము, అవయవములు వీనినన్నిటిని మఱచి 'నా రాము డేడి?' అను ఒకే తలపుతో నుండెనో అట్టి తలపు నాకు గలిగించి ఆమెవలె చేయుము.'

ఎట్టి వ్యాకులము కలిగిన భగవద్దర్శనము కలుగునో చూపుటకు సీతాదేవి ఉదాహరణమును చూపుచున్నారా! యని 'మ.' తలచెను. సీతాదేవి రామమయజీవిత. రామ ధ్యానముతో ఉన్మాదము చెందినది. ఎంతయో ప్రియమైన దేహమునుగూడ ఆమె మరచెను.

సాయంకాలము 4 ఘంటలయినది. శ్రీవారు భక్తులతో తమ గదియందుండిరి. అప్పుడొక ముఖర్జీబాబు వచ్చెను. అతడు ప్రాణకృష్ణుని బంధువు. అతనితోగూడ శాస్త్రవేత్త బ్రాహ్మణ స్నేహితుడు ఒకడు వచ్చెను. 'మ.', రాఖాలు, లాటూ, హరీశు, యోగిన్ మొదలగు భక్తులు కూడ నుండిరి.

ముఖర్జీ శ్రీవారికి నమస్కరించి, "మిమ్ము దర్శించి మిక్కిలి ఆనందము పొందితిని."

శ్రీరామ:—భగవానుడు అందరియందును ఉన్నాడు. అందరిలోనున్న ఆ సువర్ణమే కొందరిలో ఎక్కువగా ప్రకాశించును. సంసారములో ఆయన ఎంతయో మట్టితో కప్పబడి యుండును.

ముఖర్జీ:—అయ్యా! ఐహికమునకును పారమార్థికమునకును భేదమేమి?

శ్రీరామ:—సాధనలు చేయునప్పుడు 'నేతి', 'నేతి' యని యన్నిటిని త్యజింపవలెను. ఆయన దర్శనము చేసిన పిదప ఆయనయే ఇవన్నియు, ఈ జగమంతయు నయినట్లు గోచరించును.

శ్రీరామచంద్రునకు వైరాగ్యము కలిగినప్పుడు దశరథుడు మిక్కిలి భయపడి వశిష్ఠుని శరణుజొచ్చెను. శ్రీరాముడు సంసారమును విడువకూడదని యతని కోరిక. వశిష్ఠు డంతట శ్రీరామునికడకు పోయెను. రాముడు శోకపీడితుడై ఒక మూల కూర్చొనియుండెను. మనస్సున తీవ్రవైరాగ్యము! వశిష్ఠుడు అతనిని జూచి, "ఓ రామా! సంసారమును నీవేల త్యజింపవలెను? భగవంతుడులేని సంసారము కలదా? నాతో వాదింపుము" అని పలికెను. అంతట శ్రీరాముడు ఆ పరబ్రహ్మము నుండియే ఈ సంసారము ఉద్భవించినట్లు కాంచెను. ఇక మాట్లాడలేదు.

"ఏ వస్తువునుండి మజ్జిగ వచ్చునో దాని యందే వెన్నయు నున్నది. మజ్జిగకు చెందినదే వెన్న, వెన్నకు చెందినదే మజ్జిగ. ఎంతయో పాటుపడి తీసిన (అనగా బ్రహ్మజ్ఞానమను) వెన్నయున్నప్పుడు మజ్జిగయునున్నట్లు నీవు తెలిసికొనగలవు. బ్రహ్మము ఉన్నప్పుడుజీవులు, జగత్తు, చతుర్వింశతి తత్త్వములుఇవన్నియు ఉన్నవి. బ్రహ్మమెట్టిదో నోటితోచెప్పజాలము. సమస్తవస్తువులు ఉచ్ఛిష్టమైనప్పటికి బ్రహ్మము మాత్రము ఉచ్ఛిష్టము కాలేదు. ఈ మాట నేను విద్యాసాగరునకు చెప్పగా అది విని యతడు చాల సంతోషపడెను. విషయవాసన కొంతయున్నను ఈ బ్రహ్మజ్ఞానము కలుగదు. కామకాంచనేచ్ఛ మనస్సున ఆవంతయు నుండరాదు. అప్పుడే బ్రహ్మజ్ఞానము సిద్ధింపగలదు. పార్వతీదేవి తండ్రినిజూచి, 'నాయనా! నీకు బ్రహ్మజ్ఞానము కావలెనన్న సాధుసంగము చేయు' మని చెప్పెను.

ఈ పలుకులు విని శ్రీవారు 'సంసారులకైనను సాధువులకైనను కామకాంచనములు బ్రహ్మజ్ఞానమునకు ఆటంకములని తెలుపుచున్నారుగదా'యని 'మ.' యనుకొనెను.

# శ్రీ రామ స్తవము

శ్రీ మెండా చినసీతారామయ్య

మ. శతమన్య ప్రతిమాన వైభవము నీꝸషణ్మాత్రమున్ గోరబో
నతి సౌందర్య విలాసవిభ్రముల దేꝸవాఙ్గాతులన్ గోరన
చ్చతురాస్యాది సుర ప్రపూజ్యమగు నుꝸష్మ త్పాదరేణు ప్రభా
తతినే కోరుదు నేను సంతతము సీꝸతామానపాటచ్చరా!

ఉ. భీకర కాలకింకరులు ꝸ పెంపుగవచ్చినవేళ గొంతుకన్
వాకొన కుండగా కఫము ꝸ పట్టినవేళ సుతాది బాంధవుల్
శోకముచేత తప్తులయి ꝸ చుట్టును కూర్చొనియున్నవేళ మీ
శ్రీకరనామమున్ భజన ꝸ సేతునొ చేయనొ నాటికిప్పుడే
కోకనదాక్షరామ నిను ꝸ కొల్చెద కావగరావె దీనునిన్.—　　(పంచపది)

ఉ. రామయటంచు తొల్లియొక ꝸ రాచిలుకాత్మదలంప మోక్షమే
ప్రేమ నొసంగినావు మది ꝸ పెంపుగనిన్ను భజించువారి కిం
కేమియొసంగెదో హృదయ ꝸ మిచ్చుచు భృత్యుడవౌచు కొల్చెదో
ఏమొ యెఱుంగరాదు పరꝸమేశ! భవత్కృపకింత వింతయే.

ఉ. జానకి దల్లిగాను రఘుꝸసత్తమ మిమ్మును తండ్రిగాను వై
శ్వానరమిత్రసూతిని సుꝸబంధునిగాను సుమిత్రసూతినిన్
వానరపార్థివాంగదుల ꝸ భ్రాతలగాను తలంచి నామనం
బానలినాప్తగాంచు నలిꝸనావళి వైఖరి సంతసించెడున్.

ఉ. రామ, కబంధరాక్షస – విరామ వినీలపయోదసన్నిభ
శ్యామ త్రిలోకపావన-మꝸహత్తర తారకనామ భోగసు
త్రామ ప్రచండవిక్రమ పꝸరాజిత భార్గవరామయంచునిన్
నేమముతో భజించెడి మꝸనీషులు కాంచరె మోక్షమున్ ప్రభూ!

ఉ. సుందర మందహాసరుచి ꝸ శోభితవక్త్రముతోడ ప్రేమచే
చిందులుద్రొక్కు నేత్ర సరꝸసీరుహ యుగ్మముతోడ నీవునా
యందు వసించి భీకర భꝸవాంబుధి దాటగ జేయు మోదశ
స్యందన నందనాగ్రజ మꝸహత్తర పుణ్యచరిత్ర రాఘవా!



# శ్రీ వాసుదేవ మననము

## ద్వితీయ వర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(ఆగష్టు సంచిక తరువాయి)

“ఉ॥ కోరకమే పదార్థమును కోరిన వచ్చునె రాని వస్తువుల్। కోరకయున్న రావె తనకున్ లభియింపగనున్న యర్థముల్। కోరిన రానిచో గలిగి గోల్పడుచో వెతగాన సజ్జనుల్। గోర రనాస్థ ప్రాప్తములు గొందురు కుందరు వస్తుహానికిన్॥” అని యార్యసూక్తి. “యస్మిన్వస్తుని మమతా మమతాపః తత్ర తత్రైవయత్రైవాహముదాసే తత్రముదాఽఽసేస్వభావసంతుష్టః” ఏ వస్తువునందు మమకారముండునో ఆ వస్తు సంయోగ వియోగములయందు సంతాపమే సంభవించుచుండును. ఏ వస్తువునందు ఉదాసము (తగులమి) ఉండునో దాని లాభనష్టములచే నంటబడక స్వభావ సంతుష్టుడై యుండును. “యతో యతోనివర్తతే తతో తతో విముచ్యతే। నివర్తనాద్ధి సర్వలోకే వేత్తి దుఃఖమణ్వాపి॥” అహంకార మమకారములంతర్హితము లగుటచేతనే సంసారవిముక్తి సమకూడును. అహంకార మమకారము లామూలముగ నంతరించుటవలననే దుఃఖ మణుమాత్రమైన దెలియబడదు. సమస్త వేద వేదాంతములయొక్క అధ్యయనమునందు పారంగతుడయ్యును ఏషణాత్రయ పరిత్యాగమునందశక్తుడగు పండితుడును మోక్షమను శబ్దము వినుటమాత్రమె కాని యెన్నటికిని ఆత్మానుభూతిని బొందజాలడు. “అధీత్య చతురోవేదాన్ సూక్ష్మం బ్రహ్మనవిందతి। వేదభార భరాక్రాంతః సవిప్రో గర్దభస్మృతః॥” నాలుగువేదముల నధ్యయనము జేసియు సూక్ష్మమైన ఆత్మతత్త్వము నధిగమించనేరని విప్రుడు వేదభారముచే మిక్కిలి యాక్రమింపబడినవాడై గర్దభసమానుడుగ గణింపబడును. “యథాఖరశ్చందన భారవాహీ భారస్యవేత్తా నతు చందనస్య। తథైవశాస్త్రాణి బహూన్యధీత్య సారంనజానన్ ఖరవద్వహేత్సః॥” మంచి గంధపుచెక్కలను మోయుచున్న ఖరము ఆ మలయజకాష్ఠ భారమునే యెఱుంగును కాని చందనసారమైన సుగంధమును గ్రహింపనేరదు. చందనకాష్ఠ భారమునుమాత్రము మోయుచుండును. ఆ రీతినే సకలవేదశాస్త్రములను సంపూర్ణముగ నధ్యయనము చేసియు వేదసారమైన స్వాత్మవిజ్ఞానము నెఱుంగనేరని శాస్త్రపండితుడును ఖరమువలె వేదశాస్త్రభారమును మాత్రము భరించుచున్నవాడగును—అని సతత్సుజాతీయ సంహితయందు జెప్పబడినది. మఱియు “అధీత్య చతురోవేదాన్ ధర్మశాస్త్రాణి మానవః। యోవై

బ్రహ్మనజానాతి దర్వీ పాకరసంయథా॥'' (ముక్తి క. ఉ.) సర్వవేదములను సమస్త ధర్మ శాస్త్రములను అధ్యయనము చేసియు నందుల సారంబైన స్వానందానుభవంబును బొంద జాలని వానవుడు పచనపాత్రలయందు మసలు చుండియు పచనపాత్రస్థ భోజనపదార్థముల రస మును గ్రహింపజాలని గరిటెవంటివాడే యని శ్రుతివచనము. ఇట్లు ఏషణాత్రయమునందలి దుఃఖమును, మోక్షేచ్ఛకును ముక్తి ప్రాప్తికిని దాని ప్రతిబంధకత్వమును బాగుగ గ్రహించి ముముక్షువులు ఫలాభిసంధిరహితముగ స్వధర్మ కర్మమును ప్రవర్తింపజేయుచు చిత్తనైర్మల్య మును బొంది త్యక్త సర్వైషణులగుచు సాధన చతుష్టయ సంపన్నులై దాన నాత్మజిజ్ఞాసాధి కారులయి యంతట బ్రహ్మవిద్య నభ్యసించుట కొఱకును బ్రహ్మజ్ఞాన విజ్ఞానప్రాప్తికొఱకును శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడు నగు సద్గురువు ప్రాపునుబొంది ఆయన యపారకరుణాపూర సేవనమున స్వాత్మవిజ్ఞానము ననుభవింపవల యును.

లోకమున గొందఱకు నిత్యానిత్య వస్తు వివేక మలవడినను వైరాగ్య మబ్బకపోవచ్చు నేమో యని ఇహాముత్రార్థ ఫల భోగ విరా గముకూడ ముఖ్యముగ విధింపబడినది. నిత్యా నిత్యవస్తువివేకము, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగముకూడ ప్రాప్తించినను కొందఱు ఋషీ శ్వరులకు కోపతాపాది దర్శనమువలన శమాది షట్కసంపత్తికూడ ముఖ్యముగ విధింపబడినది. ఈ సాధనత్రయము సమకూడినను కొందఱు భక్తులకును ఈశ్వరోపాసకులకును ఆత్మజ్ఞానము నందభిరుచియు నధికారములభింపక పోవునేమో యని ముముక్షుత్వముకూడ ముఖ్యముగ విధింప బడినది. ఇట్లు సాధనములు నాలుగు సమ ప్రధానములేయగుటవలన ''వివేకినో విరక్తస్య శమాదిగుణశాలినః। ముముక్షోరేవహిబ్రహ్మ జిజ్ఞాసాయోగ్యతామతా॥'' (వి. చూ. 17) నిత్యానిత్యవస్తు వివేకాది సాధనచతుష్టయ సంపన్నునకే బ్రహ్మజిజ్ఞాసయందు యోగ్యత్వ మంగీకృతము. అందువలన ''నిత్యానిత్యవస్తు వివేకశ్చ ఇహాముత్రవిరాగతా। శమాదిషట్క సంపత్తిః ముముక్షాణాం సమభ్యసేత్॥'' (వరాహ. ఉ. 2-3.) బ్రహ్మవిద్యనభ్యసించు టకు పూర్వమే నిత్యానిత్యవస్తువివేకాదిసాధన చతుష్టయసంపత్తిని ముఖ్యముగ సాధింప వలయునని శ్రుత్యాదేశము. ''వైరాగ్యంచ ముముక్షుత్వం తీవ్రంయస్యతు విద్యతే। తస్మిన్నే వార్థవంతఃస్యుః ఫలవంతః శమాదయః॥ (వి. చూ. 30.) ఏ పురుషునకు వైరాగ్యమును ముముక్షుత్వమును తీవ్రమై—దృఢతమమై— యుండునో వానియందే శమాదులు సార్థకము లును సఫలములునగును. సాధనచతుష్టయ సంపన్నుడే స్వానుభవజ్ఞుడు కాగలడని ''శాం తోదాంతః ఉపరతః తితిక్షుస్సమాహితః శ్రద్ధా విత్తోభూత్వాఽఽత్మన్యేవాత్మానంపశ్యతి। సర్వ మాత్మానంపశ్యతి॥'' (బృ.ఉ.4-4-23)శమాది షట్కసంపన్నుడై తీవ్రమైన వైరాగ్యము, ముముక్షుత్వముల నలవఱచుకొనిన ఆత్మా నాత్మ వివేకవంతుడు సద్గురుముఖమున వేదాంత శ్రవణమనన నిదిధ్యాసనముల మూలమున బ్రహ్మవిద్యనభ్యసించి ఆత్మయందే ఆత్మను జూచును. సర్వము నాత్మగజూచును అను నిత్యాదిశ్రుతులు ప్రమాణము. (సమాహితః= ఏకాగ్రచిత్తః, శ్రద్ధావిత్తః = శ్రద్ధైవ విత్తం యస్యసః శ్రద్ధావిత్తః।)

''అథాతో బ్రహ్మజిజ్ఞాసా॥'' (బ్ర.సూ.౧.) అథ – అతః – బ్రహ్మజిజ్ఞాసా – కర్తవ్యా,

అథ=సాధనచతుష్టయ సంపల్లాభానంతరము, అతః = బ్రహ్మజిజ్ఞాసాధికారమునకు సంపూర్ణతయు సాఫల్యమును గలుగుటవలనను కర్మఫలమనిత్యమగుటవలనను, బ్రహ్మజిజ్ఞాసా కర్తవ్యా=బ్రహ్మవిచారణ చేయందగినది. తా॥ యథావిధిగ స్వధర్మకర్మ పరిపాలనచేయుచు, సాధనచతుష్టయ సంపత్తిని సంపాదించిన మీదట ఆత్మవిచారణయందు ఆత్మవిజ్ఞానమునందును అధికారమునకు సంపూర్ణతయు, సఫలతయు గలుగును గనుక సాధనచతుష్టయ సంపత్సిద్ధ్యనంతరము శ్రోత్రియుడును బ్రహ్మనిష్ఠుడునగు సద్గురుసాన్నిధ్యమున వేదాంత శ్రవణ మనన నిదిధ్యాసనములద్వారా బ్రహ్మవిచారణమును జేయవలయును. అప్పుడే బ్రహ్మమును విచారింపను స్వానుభవమును బొందను శక్యముగాని విపర్యయమునగాదు – అను నీ బ్రహ్మసూత్రము ననుసరించి సాధన చతుష్టయ సంపత్ప్రాప్త్యనంతరము బ్రహ్మవిచారణముచేయదగినది. "సూత్రమనగా."– "అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతోముఖం। అస్తోభమనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః॥" అల్పాక్షరబద్ధమును, అసందిగ్ధము–సంశయమునకు విషయముకానిదియు, సర్వశాస్త్రసిద్ధాంతార్థసారమును, పృథులార్థ సూచికమును, వ్యర్థపద శూన్యమును, నిర్దుష్టమునగుచు నొప్పు వాక్యము సూత్రమని సూత్రవేత్తలు తెలిసికొనుచున్నారు. అనగా బహుళార్థమును సూచించు నిర్దుష్టమగు సంగ్రహవాక్యము సూత్రమని ముఖ్యార్థము. ఇట్లు బ్రహ్మవిద్యయం దధికారియైన పురుషుడు "పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన। తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణి శ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥"(ముం.ఉ.1–2–12) బ్రాహ్మణః= బ్రహ్మవిద్యయం దధికారియైన బ్రాహ్మణుడు, లోకాన్=లోకములను, కర్మచితాన్=కర్మానుష్ఠానగమ్యములుగను, 'యత్కృతకంతదనిత్యం'=ఏది కర్మసంపాదితమో అది అనిత్యమగుటవలన నిత్యములుగను, పరీక్ష్య = మీమాంసాన్యాయశాస్త్రములచే నిరూపించి, అకృతః=స్వతంత్రమైన నిత్యమగు మోక్షము, కృతేననాస్తి = కర్మసాధ్యముకాదు ; అని, నిర్వేదం ఆయాత్ = వైరాగ్యమును పొందవలయును. "ఐహికాముష్మికార్థేషు హ్యనిత్యత్వేన నిశ్చయాత్। నైస్పృహ్యః తుచ్ఛబుద్ధ్యాయత్త ద్వైరాగ్యమితీర్యతే॥" (స.వే.సి.సా.సం. 22.) ఐహికాముష్మికార్థము లనిత్యములని నిశ్చయింపబడుటవలన నవి తుచ్ఛములను బుద్ధితో వానియందు నిస్పృహతను బొందుట వైరాగ్యమని చెప్పబడుచున్నది. సః = అట్టి తీవ్రవైరాగ్యమును పొందిన బ్రాహ్మణుడు,తత్ విజ్ఞానార్థం=ఆ యమృతస్వరూపవిజ్ఞానముకొఱకు, సమిత్పాణిస్సన్ = 'రిక్తహస్తేన నోపేయాద్రాజానందైవతంగురుం' = రాజదేవ సద్గురు సందర్శనార్థమరుగు నవసరమున శూన్యహస్తములతో జనగూడదనెడి శిష్ట సంప్రదాయపరిపాలనార్థము సమిత్పాణియగుచు, శ్రోత్రియం = అధ్యయన శ్రుతార్థసంపన్నుడును, బ్రహ్మనిష్ఠం=బ్రహ్మమునందే నిష్ఠగలవాడును. "అభినివేశపూర్వక ప్రత్యగాత్మ విషయక ప్రత్యయ సంతతికరణమేవ జ్ఞాననిష్ఠా' = పట్టుదలతో నిత్యము ఆత్మజ్ఞానావృత్తిని జేయుట జ్ఞాన బ్రహ్మ నిష్ఠ – యని (శాంకరగీతాభాష్యము.) అగు, గురుమేవాభిగచ్ఛేత్ =సద్గురువునే శాస్త్ర నియమానుసారము గురూపసదన మొనర్చి వారి యనుగ్రహమునకు పాత్రుడై బ్రహ్మ

విద్యను బడయవలయును. "ఉపసీ దేదేక మేవ సద్గురుం బ్రహ్మవిత్తమం॥" బ్రహ్మవిద్యార్థి బ్రహ్మ సాక్షాత్కారవంతుడైన సద్గురునిమాత్రమే ఆశ్రయింపవలయును. "ఉక్తసాధన సంపన్న స్తత్త్వజిజ్ఞాసురాత్మనః। ఉపసీదేద్గురుంప్రాజ్ఞం యస్మాద్బంధవిమోక్షణం॥" (వి. చూ. 33.) నిరుక్తసాధనసంపన్నత్వముచేత అధికారియైన ఆత్మజిజ్ఞాసువు, సంసారబంధవిముక్తినిగలుగ జేయ సమర్థుడగు విద్వాంసుడైన సద్గురువునే ఆశ్రయింపవలయునని సకల శ్రుతి స్మృతులు విధించుచున్నవి. "దుర్లభో విషయత్యాగో దుర్లభం తత్త్వదర్శనం। దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాం వినా॥" (వరాహ.ఉ. 2–77) సద్గురునిదయవినా విషయపరిత్యాగము దుర్లభము, తత్త్వదర్శనము దుర్లభము ; సహజావస్థానప్రాప్తి దుర్లభము. యథాజాత్యంధస్య స్వస్వరూపజ్ఞానం నవిద్యతే। తథాగురూపదేశేన వినా కల్పకోటి శతైరపి తత్త్వజ్ఞానం నజాయతే। తస్మాత్సద్గురుకటాక్ష లేశ విశేషేణాచిరాదేవ తత్త్వజ్ఞానంభవతి॥" (మ. నా. ఉ. 5–1) పుట్టు గ్రుడ్డికి శుక్ల కృష్ణ రక్త పీతాది రూపజ్ఞాన మెన్నటికి నెట్లు కలుగదో అట్లే సద్గురూపదేశము వినాగా నెవ్వనికిని అనంతకోట్ల కల్పములకైన నాత్మజ్ఞానము సిద్ధించదు. అందువలన సద్గురు కటాక్ష లేశ విశేషముచేతనే ఆత్మజ్ఞానమవిలంబితముగ ననుభూతమగును. "వేదాంతానామనేకత్వాత్ సంశయానాం బహుత్వతః। వేద్యస్యాప్యతిసూక్ష్మత్వా న్నజానాతి గురుం వినా। శ్రవణాన్మననాత్ ధ్యానాద ప్యుపాయా ద్గురూదితాత్। అజ్ఞానసంశయా జహ్యాద్విపరీతాంచ భావనామ్॥" (అనుభూతిప్రకాశిక. 48, 49) వేదాంతము లనేకములగుటవలనను, సంశయములుకూడ బహు సంఖ్యాకములై యుండుటయే సహజముగుటవలనను, అధిగమింపందగిన స్వాత్మతత్త్వమత్యంతసూక్ష్మమైనదగుటవలనను సద్గురుని యనుగ్రహము వినా స్వాత్మతత్త్వావగీతి యెంతమాత్రము సాధ్యముకాదు. సద్గురూపదిష్ట వేదాంతశ్రవణమనన నిదిధ్యాసనాద్యుపాయముల మూలముననే సంశయభావన – అసంభావన – విపరీతభావనలు సమూలోన్మూలితములగును, స్వస్వరూపము సాక్షాత్కరించును. "గీ. అనుభవంబు దెలియనలవి యెవ్వారికి। వ్రాసియుండ దెందు లేశమైన। దేశికుండు దెల్పిచూపక తెలియునా। విశ్వదాభిరామ వినురవేమ॥" అని వేమనచెప్పినట్లు స్వాత్మతత్త్వజ్ఞుడైన సద్గురుముఖమున తత్త్వరహస్యమును దెలిసికొనవలయును. అప్పుడుగాని ఆత్మానుభవము కలుగదు. కనుక ముముక్షువు తాను స్వయముగ సకలశాస్త్రార్థసంవేదియైనను స్వాతంత్ర్యముతో బ్రహ్మజ్ఞానవిచారణచేయగూడదు. శ్రోత్రియుడును ఆత్మాపరోక్షజ్ఞానానుభవశాలియు, నిరంతర బ్రహ్మనిష్ఠుడునగు సద్గురువునే శాస్త్రనియమము ననుసరించి గురూపసదనముచేసి వారి యనుగ్రహపాత్రుడై స్వాత్మజ్ఞానము నధిగమింపవలయును. "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా। ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥" (గీ. 4–34) అదృష్టవిశేషముచేత నఖిలశాస్త్రపారంగతులైనను కొందఱు ఆత్మవిజ్ఞాన మలవడకపోవచ్చును. అట్టివారుగాక ఆత్మవిజ్ఞానవంతులై అనవరతము ఆత్మనిష్ఠం దగిలియుండు సద్గురువులు సేవుచేయు ప్రణిపాతము అనగా సాష్టాంగనమస్కారముచేతను ("ఉరసాశిరసా దృష్ట్యా మనసా వచసా తథా। పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాంప్రణామోఽష్టాంగఉచ్యతే॥" వక్షస్థలము – లలాటము – హస్తములు – పాద

ములు - కర్ణములు నను నీ అవయవములు నేలకు తాకునట్లు దండమువలె పరుండి నమస్కరించుటయు - నేత్రములతో భక్తియుక్తముగ జూచుటయు-మనస్సుతో నిశ్చలముగ ధ్యానించుటయు - వాక్కుతో నమస్కారమని చెప్పుటయునను నీ వ్యాపారములతో సహా అష్టాంగములచేతను జేయబడు నమస్కారము సాష్టాంగ నమస్కారము) శ్రద్ధాభక్తి వినయాన్వితముగ స్థానాంగభావాత్మరూప చతుర్విధ సద్గురుసేవ చేతను (ఇందు స్థానశుశ్రూషయన నిజసద్గురునకు గల గృహక్షేత్రాదులను విచారించుట.) అంగశుశ్రూషయన ఆచార్యునకు అభ్యంజన సంవాహనాది పరిచర్య చేయుట. భావశుశ్రూషయన సద్గురువునే తల్లి తండ్రి దైవముగ భావించి ధ్యానించుట. ఆత్మశుశ్రూషయన సద్గురువు కోరినవస్తువును, ఆచార్యునకావశ్యకమైన పదార్థమును ఆత్మశక్త్యానుసారము ధర్మముగ సంపాదించి తెచ్చి యర్పించుటయును నీ సద్గురు శుశ్రూషలు చతుర్విధములు. పరిప్రశ్న చేతను అనగా "కథంబంధః? కథం మోక్షో? విద్యాఽవిద్యే ఉభేచ కే? క ఆత్మా? కః పరాత్మాచ? తయోరైక్యం కథం? వద॥" బంధమన నెట్టిది? మోక్షమన నెట్లు? విద్యయన నేమి? అవిద్యయన నేమి? ఆత్మయన నెవరు? పరాత్మయన నెవరు? ఆ యుభయులకు నైక్యమెట్లు? దయచేసి తెలియజేయుడు? అని సమయమెఱింగి వినయముతో సమీపించి వివేక ప్రశ్నను వేయుటచేతను, ఇట్లు ప్రణిపాత శుశ్రూష వివేక ప్రశ్నలచేతను, నీయందుగల శ్రద్ధను భక్తిని పాండిత్యమును ఉపదేశయోగ్యతను పరీక్షించి గ్రహించి ప్రసన్నులై, సాధన చతుష్టయ సంపన్నుడవైన నీకొఱకు బ్రహ్మాత్మైకత్వావగమకమును నిశ్శేషముగ సంసార భ్రమాపనోదకమునగు ఆత్మజ్ఞానము నుపదేశించెదరు. ద్రవ్యయజ్ఞాదులకంటె విశిష్టతరమును సాక్షాన్మోక్షైక ప్రదమునైన యాజ్ఞానమును జ్ఞానులును - అనగా శాస్త్రజన్యజ్ఞాన సంపత్తిమంతులును - తత్త్వదర్శినులును-అనగా సాక్షాత్కార జన్యవస్తు యాథాత్మ్య వేదనవంతులును - అగునట్టి సద్గురువులే ఉపదేశింప గలరు. వారివలననే పొందవలయును. ఇట్టి సద్గురువులు ఉపదేశించు జ్ఞానము సంసార నివర్తకమగుచున్నది. ఈ యర్థమును ప్రత్యక్షముగ లోకమునకు బోధించుటకొఱకు భగవదవతారులైన బలరామ కృష్ణులు సద్గురూపసదనముచేసి విద్య నభ్యసించిరని శ్రీమద్భాగవతమునం దిటుల వర్ణింపబడినది.

(సశేషము)



# జీవేశ్వరులు

శ్రీ ఆత్మానంద

గీ. కంపితుఁడవగుచుంటివి కలఁకఁజెంది; దేనికై భయపడుట యిత్తెఱఁగు నీవు?
పెద్దయవివేకమగు దైవ భీతియన్న; పిరికితనమందురు మనుష్య భీతియున్న.

గీ. బెదరకుము భూతములఁజూచి బేలవగుచు; జగమబద్ధ మశాశ్వతముగ నెఱుంగు
ఎండమావుల భ్రాంతియైయుండు జగము; అతఁడు సత్యమేకమనంతుఁ డవ్యయుండు;

గీ. కనుము నీవతండవె వివేకమున వినుము; ‘‘కలదు మెఱయుసువర్ణ పక్షులతోడఁ
బక్షులజత యొకేచెట్టు పలవలందు; రెండు పక్షులు జతఁబాయకుండు నెపుడు.

గీ. ఏకజాతివి వ్యత్యాసమేమిలేదు; ఖ్యాతియు సమానమూ రెండు ఖగములకును.
ఒకటి వృక్షాగ్రమున మఱియొకటి దిగువ; కొమ్మమీఁదను వేర్వేఱఁ గూరుచుండె.

గీ. శాంతి యద్భుతభాస్కరకాంతి నాత్మ; వైభవంబున వృక్షాగ్రవాసి వెలయు.
కొమ్మపండ్లను దిగువది కొఱుకుచుండి; మధుర ఫలముల భక్షించు మక్కువగను

గీ. చేఁదుపండ్లను చవిఁజూచి చింతఁజెందు; వెక్కసముదోఁప నద్ది వివేకమొంది
దృష్టి నూర్ధ్వముఁబనుప నాదిక్కునందుఁ; బూర్ణమహిమచేఁ దులదూఁగు పూజ్యమైన

గీ. విహగరాజును తిలకించె వింతపక్షి; తొలి నిముసమున నదిమతి చలనమొంది
మఱచిపోయెను దానిని మాయఁగప్ప; ముందు కరిగి తినఁదొడఁగె మునుపటివలె

గీ. చేఁదుపండ్లనే యాపక్షి శీఘ్రముగను; జరిగిపోయిన యనుభవజ్ఞానముడిఁగి.
విషఫలంబులఁ జవిఁజూచి విసిగి యద్ది; శిరముఁబైకెత్తి వీక్షించె శిఖరమందు

గీ. స్వేచ్ఛఁ గూర్చున్నపక్షిని చింతలుడిఁగి; కొన్నికొమ్మల దాఁటిపై కొమ్మమీఁద
నున్నపక్షిపై లక్ష్యమునుంచె నద్ది; దివ్యఖగకాంతులాక్రింద దిరుగులాడు

గీ. ఖగము దేహము సోఁకిన క్షణమునందె; కిరణములమున్గి తనరూపు మఱుఁగుపడఁగ
దివ్యఖగరూపుఁదాల్చి యదృశ్యమగుచు; ఆత్మవైభవ శివమయ మైవెలింగె.
పక్షి తానె, రెండేడవి వృక్షమందు? దేవు ప్రతిబింబమేసుమీ జీవుఁడరయ.

# శ్రీ వివేకానంద సంభాషణలు

అనువాదకుడు: శ్రీ పిన్నింటి సుబ్బారావు

[పునశ్చరణ—భారతదేశపు కఱవు సమస్య—స్వార్థత్యాగులు—ప్రాక్పశ్చిమములు—అది సత్వగుణమా—తమోగుణమా—యాచకుల జాతి—ఇచ్చి, పుచ్చుకొను సిద్ధాంతము—ఏకాంతముగా మానవునియందు గల లోపములను దెల్పుము; ఇతరులముందు వాని గుణములను స్తుతింపుము—అందరును వివేకానందులుగా గావచ్చును—విడువని బ్రహ్మచర్యమే శక్తికి కీలకము—సమాధి—పని.]

మాయిల్లును, స్వామిజి యిల్లును యిరుగు పొరుగులే. మేమిద్దర మొకవీధియందు నివసించుచుండుటచే చిన్నతనమున మేమిరువురము కలిసి ఆడుకొనుచుండువారము. బాల్యము నుండియు ఆతడన్న, నాకమిత ప్రేమ. ఆతడు మహాపురుషుడు కాగలడని యానాడే యనుకొంటిని. ఆతడు సన్న్యాసమును గైకొనెనని వినినపుడు, ఎంతో వృద్ధిలోనికి రావలసిన వ్యక్తి యీ విధముగా భ్రష్టుడయ్యెనని తలచితిని.

పిమ్మట, ఆత డమెరికాఖండమున కేగినపుడు, చికాగోనగరమందలి విశ్వమత సభయందును, ఆ ఖండమందలి వివిధ ప్రదేశములయందును ఉపన్యసించిన యుపన్యాసములను పత్రికలయందు జదివి, వస్త్రాచ్ఛాదితమై యున్నను అగ్ని యెన్నడును దాగియుండనేరదనియు, స్వామిజీయందణిగియున్న యగ్నినేడు ప్రజ్వరిల్లినదనియు దలచితిని.

పిదప కొంతకాలమున కాతడు భారతదేశమునకు తిరిగి వచ్చెననియు, మద్రాసు నగరమున గంభీరోపన్యాసము లిచ్చుచుండెననియు వినియుంటిని. నేను వానిని పఠించి, హిందూమతమునందంతటి అతి సూక్ష్మసత్యములున్నవా యనియు, ఇంత వివరముగా వానిని వ్యక్తీకరింపవచ్చునా యనియు ఆశ్చర్యపడితిని. ఆతడెంతటి యసాధారణ శక్తిగలవాడు! ఆతడు మానవుడా, భగవంతుడా!

ఆతడు కలకత్తానగరమున కేతెంచినపుడు ప్రజలయందు గొప్ప యుత్సాహము బయలుదేరెను. మేము కాశిపూర్ నందు గంగానది యొడ్డుననున్న సీలు మహాశయుని యుద్యానవనమునందు గల గృహమునకు బోయితిమి. కొన్నిదినములకు పిమ్మట ఈ కలకత్తా బాలుడు రాజా రాధాకాంత దేవుని గృహమునందు, పురజనులొసగిన స్వాగతపత్రమునకు ప్రత్యుత్తరముగా గొప్ప జనసమూహము నెదుట నొక గంభీరోపన్యాస మిచ్చియుండెను. కలకత్తా పౌరులు ఆతని యుపన్యాసమును వినుటకదియే ప్రథమమగుటచే ఆశ్చర్యనిమగ్నులైరి, కాని

యివి యందరికిని దెలిసిన విషయములు.

ఆతడు కలకత్తా పట్టణమున కేతెంచిన పిమ్మట, మేమిరువురము బాల్యమునందు సంభాషించుకొనినరీతిగా, ఒకసారి స్వేచ్ఛగా, నొంటరిగా, సంభాషించుకొనవలెనని యువ్విళ్లూరుచుంటిని, కాని స్వామిజీ, ఎల్లప్పుడు పృచ్ఛకులు విస్తారముగ గుమిగూడ, అంతులేని ప్రసంగములుచేయుచుండిరి. అందుచే నాకు తగు నవకాశము దొరకలేదు. కాని యొక నాడు మేము గంగాతీరమున విహరించుచుండగా, మామూలుగా బాల్యమున మేము సంభాషించుచున్నరీతిగా స్వామిజీ, నాతో సంభాషింప దొడగెను. నాతో కొలదిమాటలు మాట్లాడెనో లేదో, యనేకమంది పెద్దలు దర్శనార్థమై వేచియుండిరని విజ్ఞాపన పరంపరలు గురియుచుండెను. ఆతడు చీకాకుపడి, యావార్తాహరునితో, "ఓ అబ్బాయీ! నాకొకింత విరామమిమ్ము. నాబాల్యస్నేహితునితో కొన్నిమాటలు మాట్లాడనిమ్ము. ఈ ప్రశాంతవాతావరణమున నించుక విహరింపనిమ్ము. వెళ్లు, వారి నాహ్వానింపుము. కూర్చుండబెట్టి, తాంబూలమిచ్చి, కొలదిసేపు నిరీక్షింపుడని ప్రార్థింపుము." అని పలికెను.

తిరిగి మేముభయుల మొంటరిగానున్నప్పుడు నేను స్వామిజీతో "మీరు సాధువులు. ఇచ్చట మిమ్ముల నాహ్వానించుటకు, చందాలువేసి ధనము ప్రోగుచేయబడినది. దేశమందలి కఱవును పరిశీలించి, నా యాహ్వానమునకై యొక దమ్మిడీమైనను వినియోగింపక, యాధనమును కఱవునివారణకై వినియోగింపుడని వెంటనే తంతినిచ్చెదరని తలచితినిగాని, తమరారీతిగా జేయలేదు. ఎందుచేత?" అని ప్రశ్నించితిని.

స్వామిజి :—ఎందుచేత? గొప్పయుత్సాహము రేకెత్తవలయుననియే నేనభిలషించుచుంటిని. ఇట్టి యుత్సాహములేనిచో ప్రజలు శ్రీరామకృష్ణుని వైపున కాకర్షింపబడి, యాతని పవిత్రనామముచే, ఎట్లు మోహముగ్ధులయ్యెదరు? ఇది నాకొఱకై ప్రత్యేకముగా జేయబడిన యాహ్వానమా? లేక యాతని నామ మాహాత్మ్యమును ప్రకటించుటకా? ఆతనినిగూర్చి గ్రహించుటకై ప్రజలెంతటి యుత్సాహమును జూపించుచున్నారో చూడుము! క్రమక్రమముగా వారు ఆతనిని గ్రహింపగలరు. దాని వలన దేశమునకు మేలుగలుగదా? దేశాభ్యుదయమునకై యవతరించిన యాయవతారపురుషుని దేశీయులు గ్రహింపనిచో, వారికి ఎట్లు మేలు చేకూరగలదు? ఆమహాపురుషుని యథార్థముగా గ్రహించిననాడు, యథార్థమానవులు బయల్వెడలి, యట్టి మానవులున్నతరి, ఈ దేశమునుండి కఱవులుమొదలగువానిని నిర్మూలనముచేయుట కెంతకాలము పట్టగలదు? అందుచే పురజనులు శ్రీరామకృష్ణుని దివ్య సందేశమును గ్రహింపగలుగుటకై కొంత యట్టహాస ముండవలయుననియే వాంఛించుచుంటిని. లేనియెడల ఇదంతయు నాకొఱకే యైనచో, దీనివలన ప్రయోజనమేమి? దీనియందు నాకు లక్ష్యములేదు. మీ యింటిలో నాడుకొనిననాటికంటె, నేడు, నేను ఘనుడనైతినా? పూర్వమెట్లుంటినో యిప్పుడును అదేరీతిగానుంటిని. నాయందు నీవు ఏదైన మార్పును కనిపెట్టితివేమో చెప్పుము.

"నేను లేదులని చెప్పినప్పటికిని, చెప్పదగినంతమార్పు ఆతనియందేదియును గానబడక

పోయినను, నా మనస్సులోమాత్రము, "మీరు ఇప్పుడు భగవత్స్వరూపులై వెలయుచుంటిరని" మాత్రము ఊహించుకొంటిని."

స్వామిజి :—కఱవు మనదేశములో సాధారణ విషయముగా పరిణమించినది. ఇది మన లను నాశనముచేయుచున్నది. ఇతరదేశ ములలో ఈ రీతిగా తరచు క్షామములు సంభవించుటను చూచియుంటివా? లేదు. ఎందుచేతనన, ఆదేశములయందు పౌరుష ముగల మానవులుగలరు. మనదేశమం దట్లుగాక, నిర్జీవపదార్థమువలె, జడస్వరూ పులైయున్నారు. అందుచే మొదట ప్రజలు శ్రీరామకృష్ణభగవానుని యథార్థస్వరూ పమును గ్రహించిన స్వార్థమును త్యజించి, తరచుగా సంభవించుచున్న క్షామనివార ణకై యుద్యమింపగలరు. నేను ఈసందర్భ మునగూడ కొంత యత్నమును జేయుదును. నీవు చూచెదవుగాక.

నేను :—అది మంచివిషయము. అయితే తమ రిచ్చట అనేక ఉపన్యాసములిచ్చెదరన్న మాట. లేనిచో ఆ దివ్యనామమును బోధించుటెటుల?

స్వామిజి :—ఏమి మూర్ఖత! అట్టిదేదియును గాదు! వారి నామప్రకటనకై చేయవలసిన దంతయును చేయబడినది. అది చాలును. ఈ దేశమున ఉపన్యాసములవలన ప్రయో జనములేదు. మనదేశపు విద్యావంతులు వానినివిని, బాగుగా ఉన్నవనుచు, చప్పట్లు కొట్టుటకంటె వానివలన ప్రయోజనమేమి యునులేదు. పిమ్మట గృహములకుబోయి, భోజనమైనంతనే యీవిషయమునంతటిని పూర్తిగా మఱచిపోయెదరు. త్రుప్పుపట్టిన ప్రాతయినుముపై సుత్తిదెబ్బలవలన అది ముక్కముక్కలగుటకంటె ప్రయోజన మేమైననుగలదా? మొదట దానిని ఎఱ్ఱగా గాల్చవలయును. పిమ్మట సుత్తిదెబ్బలచే దానిని ఏయాకారముగావలసిన యా యాకారమునకు సాగగొట్టవచ్చును. ప్రజ లకు ప్రత్యక్షముగా నొక యాదర్శమును జూపనిచో; ఈదేశమునం దేపనియును కొన సాగనేరదు. సమస్తమును త్యజించి, దేశ సేవయందు తమ జీవితమునుగూడ ధార వోయగల యువకులు కొందరు మనకు గావలయును. మొదట మనము వారి జీవిత ములను సంస్కరించిన, కొంతవఱకు యథా ర్థమగు కృషి వారివలన జరుగగలదు.

నేను :—స్వామిజీ, బాగుగానున్నది. మన దేశమందలి ప్రజలు, తమమతమునుగూర్చి బాగుగా దెలిసికొననేరక, క్రైస్తవమత మును, మహమ్మదీయాది యితర మతము లను స్వీకరించుచుండ, వీరికొఱకై యిచ్చట ఏమియును ఒనర్పక, యింగ్లండు, అమెరికా దేశములయందు హిందూమతమునుగూర్చి యుపన్యసించుట నాకు చాల దిగ్భ్రమను గొల్పుచున్నది.

స్వామిజి :—నేడు, పరిస్థితులు మారినట్లు నీవు చూచుటలేదా? మనదేశప్రజలు, మత మును గ్రహించి, యారీతి నాచరించుటకు గలిగియుండిరా? మేము సాత్వికుల మనెడి గర్వముమాత్రము వారియందు నిల్చి యున్నది. ఒకానొక కాలమునందు వారి యందు సత్వగుణముండెడిది, సందేహము లేదు, కాని నేడు పతితులైరి. సత్వగుణ మునుండి సరాసరి పతనము తమోగుణము

నకే, ఈ రీతిగనే వారిస్థితి మారినది. ఏపని యును జేయక, యొకగదియందు హరి నామస్మరణ జేసికొనుచు, తన నేత్రముల ఎదుట, ఇతరులవిషయమై యనేక దారుణములు, ప్రమాదకరములగు కృత్యములు జరుగుచుండ జూచుచు, శాంతచిత్తుడై యున్నవాడు సత్వగుణప్రధానుడా? ఎంత మాత్రమును గాడు మిక్కుటమగు తమోగుణ ప్రధానుడు. తినుటకు పూర్తిగా తిండియైనను లేని దేశమందలి ప్రజలు ఎట్లు మతసాధనలను జేయగలరు? భోగవాసన ఏమాత్రమును తమ మానసములనుండి వీడని ప్రజ లేమి త్యాగమును జేయగలరు? ఈ కారణముచేత, మొదట ప్రజలకు పూర్తియైన యాహారము, జీవితసౌఖ్యమునకై వలయు, భోగవస్తువులు లభించు సాధనోపాయములను పరిశోధింపుము. పిమ్మట క్రమక్రమముగా వైరాగ్యోదయమై, జీవితమున మతసాధనము లొనర్చుటకు అర్హులయ్యెదరు. ఇంగ్లండు, అమెరికా దేశములందలి ప్రజ లెంతటి రజోగుణముగలవారలు! వారికి సమస్తభోగములయందును విరక్తికలిగినది. పైగా క్రైస్తవమతముగూడ, విశ్వాసముమీదను, మూఢ నమ్మకములమీదను ఆధారపడియుండుటచే మన పురాణమతశ్రేణికి జారిపోయెను. నాగరికతయు, విద్యయు వ్యాపించిన కొలదియు, దానియందు వారికి శాంతి లభ్యముగాలేదు. ఇట్టిస్థితిలో వారికొకింత చేయూత నిచ్చినచో వారందరు సత్వగుణ ప్రధానులయ్యెదరు. మఱియు, ఇంకొకవిషయము, ఏ తెల్లదొరయైనా యరుదెంచి యొకడిచ్చు మతోపన్యాసములను విననిచ్చగించునట్లు, కాషాయాంబరధారియగు సన్న్యాసుల మాటలను మీరాలకింతురా?

నేను:—ఆలాగుననే స్వామిజి! శ్రీ. యన్. యన్. ఘోషుకూడ ఇదేరీతిగా చెప్పియున్నారు.

స్వామిజి:—అవును. నా పాశ్చాత్యశిష్యులు క్రమపద్ధతులపై సాధనలనాచరించి, తేజోవంతులై బహుసంఖ్యాకు లీదేశమున కరుదెంచి, "మీరేమిచేయుచున్నారు? ఎందుచే అవిశ్వాసముతోనుంటిరి? మీ మత కర్మలు, మతము, ఆచారములు, ధర్మములు, నీతులు ఎట్లు అల్పములు? మీ మతము సర్వోత్కృష్టమైనదని మేము నమ్ముచున్నాము" అని నుడివినపుడు మన పెద్దలు వారిమాట లాలకించుటను నీవు చూడగలవు. ఈ విధముగా వారీదేశమునకు ఘనమగు సేవను జేయగలరు? మీకు మత బోధకై గురువులుగా అరుదెంచిరని భ్రమింపకుము. భౌతికశాస్త్రములయందు వారు మీకు గురువులు. అధ్యాత్మవిద్యయందు మీరు వారికి గురువులు. ఈరీతిగా గురుశిష్యన్యాయము, మతవిద్యయందు భారతదేశమునకును, భౌతికశాస్త్రమునందు మిగిలిన ప్రపంచమునకును ఎల్లకాలము సుస్థిరము కాగలదు. (సశేషము)

# మన దృష్టి - మన గమనము

శ్రీ దేవరకొండ నారాయణశాస్త్రి

మనదృష్టియు, మన గమనమును వేని కభిముఖములుగ నున్నవి? ప్రపంచస్థకతిపయానందకణములకు. మనయోజనలు, ప్రయత్నములు, కార్యములు అన్నియు లౌకికానందానుభూతి హేతుకములై యున్నవి. ఆనందమనుభవింపగోరుటయు, ఆ కోరికను ఫలవంతముగ నొనర్చుకొనుటకు యత్నించుటయు మన పుట్టుకతో బుట్టిన గుణములు. మన మీగుణములు గలిగియుండుటలో దోషమేమియు లేదు. కాని, మనము చూపునిలిపియున్న — అనుభవింపయత్నించుచున్న—ఆనందములు చొక్కమైనవికావని మన ఋషివరేణ్యుల యభిప్రాయము. ఏలయన, అవి తృష్ణావర్ధకములు. తృష్ణ మన సంకటములకన్నిటికిని ప్రధానకారణము. "సంస్పర్శజానందములు దుఃఖయోనులు" అని కదా భగవద్గీతోపనిషత్తుయొక్క మహావాక్యము * 'దుఃఖయోనులు' అనగా 'దుఃఖములకు ఉత్పత్తిస్థానములు' అని యర్థము. వానికి దగిన నామకరణము చేసినాడు భగవంతుడు.

మనవలెనే మన మూలపురుషులగు ఋషులు కూడ ఆనందకాములే. † వారును తొలుత మనచందముననే యీ లోకస్థములైన యానందములనన్నిటిని అనుభవింపదలచి ఘనయత్నములుసలిపి వానిని చాలకాలమనుభవించిరి. కాని, తనివి లభింపలేదు. ఊర్ధ్వలోకములలోని యానందములు తుష్టికరములుగనుండునేమో యనుకొని యాదివ్యలోకములకు బోవుటకు పట్టవలసినమార్గములనుబట్టి యాలోకములకేగి, వానియందలి వివిధానందములను పెక్కుదివ్యసంవత్సరములకాల మనుభవించిరి. కాని వారు తృప్తులు కాకయుండగనె యచ్చటి ప్రభుత్వమువారిచే "మీ పుణ్యము ముగిసినది కనుక పొండిక భూలోకమునకు." అని యాజ్ఞాపింపబడి కర్మభూమియగు ఈ లోకమునకు వచ్చిరి. యథాపూర్వముగ పుణ్యకర్మముల నొనరించి మఱల స్వర్లోకమునకరిగి యచ్చటి దివ్యానందముల ననుభవించుచుండ మఱల అక్కడి యధికారులు "మీ పుణ్యము ముగిసినది కనుక పొండిక భూలోకమునకు" అను

* తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి, సర్వం ఖల్విదం బ్రహ్మ, నేహ నానాస్తి కించన—ఇత్యాది ఉపనిషద్వాక్యములు మహావాక్యములని వాడుక. మహావాక్యములనగా పొడవైన వాక్యములు అని కాదు గదా అర్థము. మహాభావగర్భితములు కాబట్టి యవి మహావాక్యములని వ్యవహరింపబడుచున్నవి. అటులనే యీ గీతావాక్యార్థమునందలి సత్యముగూడ ఎన్నియోకోట్ల జన్మముల నెత్తిన పిదపనే గోచరించుట. కావున, నిచ్చట మహావాక్యమని ప్రయోగింపబడినది.

† "హైందవ విజ్ఞానుల పలుకులు అనుభవసిద్ధములు" అను సత్యమును స్మరించినచో మహర్షులను గుఱించిన యీ నా యూహ అపోహగా గనుపడదు. విషయమును సుబోధము గావించుటకై యీ పోకడ అవలంబింపబడినది.

కర్ణకఠోరాజ్ఞను వినిపించిరి. వారు చేయునది లేక మఱల నరలోకమునకు చనుదెంచిరి. తిరుగ అచ్చటికి బోయిరి. తిరుగ ఇచ్చటికి వచ్చిరి. "గతాగతం కామకామా లభన్తే" "ప్రపంచసంబంధమగు ఆనందాపేక్షతో పుణ్యకృత్యముల నాచరించువారికి భూలోకమునకు పుణ్యలోకములకు రాకపోకలు మెండుగ లభించును." అను విషయము వారి కనుభవ గోచరమయ్యెను. అపుడు వారు "ఇదేమి గ్రహచారమురా బాబూ!" అనుకొనిరి.

ఈ తిరుగులాట—ఈ చర్వితచర్వణము—ఈ మూడునాళ్ల ముచ్చట— వారికి అసహ్యకరమయ్యెను. మానవ దేవ గంధర్వాది సర్వుల యానందములును తుచ్ఛములై కన్పట్టెను. ‡ సుస్థిరమైన బృహదానందమును వారన్వేషింపబూనిరి. అట్టి యానందమునుగూర్చి వారహోరాత్రములు యోచించుచు, తపించుచు పరితపించుచు నుండగా హఠాత్తుగ నొకనాడు వారికి అక్షయానందసింధువు ప్రత్యక్షమయ్యెను. వారందులో మునిగి తేలిరి. ఆ యానందసుధను ఆస్వాదించి యాస్వాదించి చొక్కిరి. వారి యానందపిపాస యణగెను. తృప్తిప్రదానందము అది యొక్కటియేయని వారు గుర్తించిరి. అప్పుడు వారి ప్రేమ పూర్ణహృదయమున ఒక సంకల్పము జనించెను. అది—ఆనందకాములమై వాంఛాసిద్ధికి మార్గము గానక అంధకారపర్యటనముచేయుచున్న మన కెల్లరకు ఆ పరిపూర్ణానందముయొక్క రుచి చూపవలయుననునది. కాని, ఆయానంద సముద్రపు బాటలో నడకసాగించుటకు ఉండవలసిన ప్రజ్ఞాసహనముల పరిమాణము అత్యధికము. ఓర్పును, తెలివియు తక్కువగాగల మనుష్యుల సంఖ్యయా బహుళము. అందువలన వారికి దమ సంకల్పము వెంటనే నెఱవేఱుట అసంభవమని తోచెను. ఐనను, "ఎప్పటికైనను సర్వులును ధీరులై లబ్ధైతదానందులగుదురుగాక" అని భావించి, అనంతానందరత్నాకరముయొక్క ఉనికిని గూర్చియు, తదుపలబ్ధికి అనుసరింపవలయు మార్గములగూర్చియు దెలుపు కృతులను మనకు ప్రసాదించి చనినారు. ఆ కృతులమొత్తమునకే వేదాంత శాస్త్రము అనిపేరు.

వేదాంతశాస్త్రముయొక్క ముఖ్యోపదేశ మిది : మనదృష్టిని, మనగమనమును విశ్వాంతర్గతములైన ఆనందాణువుల దెసనుండిమరల్చి ఆనందార్ణవమువైపునకు ద్రిప్పుటలో మన సమస్తశక్తులను వినియోగింపవలయును.

ఈ యుపదేశమును పాటించుటలో మనము గమనింపవలసిన విషయమియ్యది : విషయా

‡ ముక్తినొందినవారి యానందము శాశ్వతమైనదని ఉపనిషత్తులయొక్కయు, శ్రీ భగవద్గీతయొక్కయు, బ్రహ్మసూత్రములయొక్కయు సిద్ధాంతము. కాని, శ్రీ దయానందసరస్వతీస్వామివారు ఈ సిద్ధాంతము సరియైనది కాదని చెప్పి, ముక్త్యవస్థకు ఒక అవధిని నిర్ణయించి, ముక్తులుకూడ పునర్జన్మము నెత్తవలసియున్నదని సిద్ధాంతీకరించి యున్నారు. సత్యార్థప్రకాశికలో నవమ సముల్లాసమునందు. మఱియొక విశేషము, "జీవులు పరబ్రహ్మమును బొందిన పిమ్మట వీ రనుభవించెడి యానంద మఖండముగాక వారివారి యోగ్యతలనుబట్టి న్యూనాధికముగా నుండును" అనునది ద్వైతసిద్ధాంతాభిప్రాయమని బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు శ్రీరామచంద్రానందసరస్వతీస్వాములవారి గీతావ్యాఖ్యానమునకు వ్రాసిన పీఠికలో దెలిపియున్నారు. కాని, పైన గనుపఱచిన ప్రస్థానత్రయసిద్ధాంతమును, 'మోక్షస్థితిలో అందఱి యానందానుభవమును సమానమే' యను అద్వైతసిద్ధాంతమును ఇచ్చట నిర్దేశింపబడియున్నది.

నందములు త్యజింపదగినవేయైనను వానినన్ని టిని ఒక్కుమ్మడిగా విసర్జించుట క్రమమైన పద్ధతికాదు. ఏలన, అవధరింపుడు, గీతా శాస్త్రాభిప్రాయము ప్రకారము నిద్రవలన పొంద బడు ఆనందము తామసికము. తామసికానం దము గర్హింపదగినదని మనము నిద్రించుట మానుకొన్నచో క్షయరోగమో అక్షయ రోగమో సంభవించును గదా మనకు. ఇట్లే యితరసంఘటనలును ఊహించుకొనదగినవి. ఇట్టిదుఃస్థితికి పాల్పడకుండుటకై శ్రీరామకృష్ణ భగవానుడు మనలనిట్లు హెచ్చరించియున్నాడు: "నీవు భక్తుడవుకావలయును, కాని వెఱ్ఱి పుల్లయ్యవు కారాదు." అత్యావసరమైయున్న యిట్టి ప్రాపంచికానందమునేకాక విషయా నంద సక్తత మిక్కుటముగా గలవారు అప్పు డప్పుడు ఇతర విషయానందములనుగూడ అనుభవించుట యావశ్యకమని యనుభవజ్ఞులు నిశ్చయించియున్నారు. కాబట్టి, మన మనః ప్రకృతినిబట్టి విషయానందత్యాగమును మెల్ల మెల్లగనో త్వరత్వరగనో ఆచరణలో నుంచు కొనవలసియుండును. స్వభావవైవిధ్యోపేతుల మగు మన యనుష్ఠాన సౌలభ్యముకొఱకు సాధనవిధానములు పలురకములుగ ఏర్పరుప బడియున్నను, వాని ననుష్ఠించుటయందును మనకు చిక్కులు పెక్కులు తటస్థించు అవకాశ మున్నది. నిర్గర్వులమై పరమేశ్వరుని శరణు పొందుట ఆ చిక్కులలోనుండి బయటబడుటకు సులభోపాయము. "మచ్చిత్తః సర్వదుర్గాణి మత్ప్రసాదాత్ తరిష్యసి" "నాయందుంచ బడిన యంతఃకరణముగలవాడవై సకలసంకట పరిస్థితులను దాటిపోగలవు." అని కదా శ్రీ కృష్ణదేవుని నుడికారము. సక్రమముగ ప్రయ త్నించి సర్వులము ఆ ఘనానందమును బొందు దుము గాత.



మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్,
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ.
తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే.

ఎవరు మనఃప్రాణముల నాకు నివేదించినారో, ఎవరిఇంద్రియములు నాయందు ఉప సంహృతములైనవో వారు, అన్యోన్యము జ్ఞాన, బల, వీర్యాదియుతుడనగు నా కథాప్రసంగ మొనర్చుచు [ఒండొరులు తెలియబఱచుకొనుచు, సంకీర్తనాదిక మొనర్చుచు] సంతోషమును, ఆనందమును బొందుచున్నారు.

ఎవరు నిత్యయుక్తులై ప్రీతిపూర్వకముగ, అన్యవాంఛల పరిత్యజించి, నన్ను భజించు చున్నారో, వారికి నేను తత్త్వవిషయక మగు సమ్యగ్-జ్ఞానమును ప్రసాదించుచున్నాడను; ఈ జ్ఞానమువలన వారు నన్ను (ఆత్మరూపమున) బొందుచున్నారు.

—శ్రీమద్భగవద్గీత, అధ్యా. 10 - శ్లో. 9, 10.



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
26-11-'16

ప్రియ వి—బాబు,

మీరు ఇరువదియవ తారీఖున వ్రాసిన యుత్తరముజూచి చాల సంతసించితిని. మీరు మీ సాంసారిక విషయములందు ఇబ్బంది పడుటను విని నిజముగా నెంతయో దుఃఖించుచున్నాను. ఆ విషయమున నేను మీకెట్లు సాయపడవలయునో నాకు స్ఫురించుటలేదు. సంసారమెట్లు జరుపుకొనవలయునో అట్లుమీరు నడుచుకొనలేక పోవుటవలననే మీకిన్ని కష్టములు కలుగుచున్నవి కాబోలు.

మరి, సాంసారిక విషయములందు దిట్టలైనవారు మాత్రము సుఖముగా నున్నారాయని విచారించినచో అదియు నిజమయినట్లు కనిపించదు. మొత్తముమీద నెవరికినీ సుఖము కలుగుటలేదు. అందువలన శ్రీకృష్ణభగవానుడు 'అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మాం' అని స్పష్టముగ నుపదేశించియున్నాడు.

ఈ సంసారమున సుఖ మావంతయు లేదు. ఏదో యూహించి యిట్లు చేసినచో సుఖమను భవింపగలమని తలంచుచుందుముగాని, అది పనికివచ్చునది కాదు. ఈ లోకమే సుఖరహితమయినది. కావుననే భగవానుడు 'ఇమం ప్రాప్యభజస్వమాం' అని ఆదేశించియున్నాడు. సుఖమయినను కష్టమయినను సరియే నాభజన చేయుచు కాలముగడుపుము. అనిత్యసంసారము కలకాలముండబోదు. సుఖదుఃఖములు రెండును తొలగును. నా భజన చేయనిచో సమస్తమును వృథాయగును. ఎందులకందువా, అందు సుఖదుఃఖము లావంతయైనను నుండజాలవు. నేనొక్కడనే నిత్యుడను. నాభజన చేసినచో ఆ నిత్యధనమును బడయగలవు. కావున 'భజస్వమాం' మీరదియే చేయుచున్నారు. 'వేదస్తుతి' మత్తు భయంకరమయినది. * అట్లు కానిచో మీ రెట్లు వ్రాయగలరు? మీరు భాగ్యవంతులు. ఇట్టి విషయమున మీకు మత్తుకలిగినది. సంసారమున మత్తుగలుగని వారి సంఖ్య తక్కువ. కాని వేదస్తుతియందు మత్తుకలిగెడివారు అత్యంతము తక్కువయనుట యందు సందియ మావంతయు లేదు. కష్టమో సుఖమో ఏదో యొకవిధముగ జరిగిపోవునని వచించితిరే అది నిజమయిన మాట. ఇంకనెన్నాళ్లు సంసారము. ఈ మూన్నాళ్లు ఏదో యొక విధముగా భగవానుని మఱువక తద్గత

* ఈ యుత్తరము ఎవరికి వ్రాయబడినదియో ఆ వ్యక్తి ప్రస్తావకాలమున భాగవతమునందలి 'వేదస్తుతి' యను నంశమును టీకాభాష్య సమేతముగ బఠించుచుండిరి.

ప్రాణులై గడిపివేయుడు. ఇంకేమి కలదు? ఏదో యొకవిధముగా జరిగినచో సరియే. భగవత్కృపవలన నేమియు నిలువదు.

సంసారము మీకొఱకుగాదు. ఎవరికొఱకై ననుసరియే దావావేయువారు వేయవచ్చును. మీరుమాత్రము 'జయగురు, జగదంబ' అని పలుకుచు మిగిలిన దినములుగూడ గడిపి వేయుడు. అట్లు చేయింపుమని భగవానుని ప్రార్థింపవలయును. మీయుత్తరము చూచి నంతనే 'దావా' వేయుడని చెప్పదలంచితిని. కాని పిమ్మట యోచించిచూడగా నివన్నియు మీకొఱకుగాదు, మీరు వేరుధాతువుచే తయారుచేయబడితిరని తెలియవచ్చినది. మీరు సంసారకష్టముల సహించుటయేకాని తక్కిన ఈపాట్లు పడలేరు. మీరేమియు తప్పు చేయలేదు కావున మీకు మానసికదౌర్బల్యముగూడ లేదు. మీరు సరియైన సంసారులు కారు. అట్లయినచో మీరు తప్పక 'దావా' చేయుటకు భయపడియుండరు. మీరు చూచుచున్నారుగదా! అర్థముకొఱకు మానవు డెన్ని పాట్లుపడుచున్నాడో! న్యాయాన్యాయము లన్న విషయముగూడ స్ఫురింపరాదు. ఎట్లో ఒకవిధమున ధనము సంపాదించుటయే వారి నిశ్చయము. కాని మీరో మీకుచెందవలసిన దానిని రాబట్టుకొనునపుడు సైతము పరులకది కష్టము కలిగించునేమోయని తలచి న్యాయమార్గముననైనను దానియందు బలప్రయోగము చేయబూనరు. అందువలననే మిమ్ము లను సహజసంసారులని ఎట్లు చెప్పగలను. కావుననే భగవంతునవలంబించి సమస్తమును సహించుకొనుచు జీవయాత్ర గడుపగోరుచున్నాను. 'సహించినవాడే జయించును. సహింపనివాడు నశించును' అన్న శ్రీ రామకృష్ణగురుదేవుని వాక్యము మనస్సున నుంచుకొని సుఖదుఃఖముల పాటింపక దినములు గడుపుచు అనంతకల్యాణమున కధికారులగుదురుగాక!

ఇట్లు,
నా శుభాశీర్వచనములతో,
శ్రీ తురీయానంద



# గౌరిమా

## శ్రీ దువ్వూరి రామకృష్ణారావు, బి. ఏ.

స్త్రీలు సహజముగ బృహస్పతివలె బుద్ధిమతులై బుట్టుదురనుట వేదకాలమునుండియు వచ్చుచున్న యార్యోక్తి. గార్గి, సులభ మొదలగు బ్రహ్మవాదినులు, అనసూయామాత, మైత్రేయి, సావిత్రి, అహల్యాబాయివంటి భక్తురాండ్రు, రాణీసంయుక్త, ఝాన్సీ లక్ష్మీబాయివంటి వీరవనితలు భారతావనియం దాదర్శనారీమతల్లులు. కాని, కాలదోషమున మనస్త్రీలను గాపాడుకొను దురవస్థ పట్టి, వారు సహజముగ శక్తిస్వరూపిణులైనను, ప్రస్తుతము వారి జవసత్వములు తగ్గి నిజముగా అబలలు, అసహాయలు, మూఢలు, విద్యావిహీనలునై స్వాతంత్ర్యమును గోల్పోయి, పురుషుని చేజిక్కియున్నారు. వీర్యవంతమగు సత్సంతాన మార్యావర్తమున లోపమగుచున్నది. దుష్కాలము ప్రవేశించినది. ఈ క్లిష్టసమయమున శ్రీ రామకృష్ణపరమహంసదేవులు తిరిగి ప్రాగ్సిద్ధమగు స్త్రీల గౌరవమర్యాదలను, విద్యాబుద్ధులను బునరుద్ధరింప సంకల్పించిరి. ఈ కృషియందు శ్రీ రామకృష్ణుల భక్తురాండ్రగు శ్రీ శారదామాత, జోగీన్మా, గౌరిమా, సోదరి నివేదిత మొదలగు నారీమణుల జీవితములు సుప్రసిద్ధములు.

పండ్రెండు సంవత్సరములు సరియగు బ్రహ్మచర్యవ్రత మాచరించినవారు ఓజశ్శక్తిగలవారలై, వారి మేధానాడి వికసింప, బ్రహ్మజ్ఞానసంపన్నులగుదురని పెద్దలమాట, శ్రీ రామకృష్ణుల ప్రబోధము. ఇప్పటికిని, హిందూస్త్రీలచ్చటచ్చట పరాప్రేమభక్తితో పాండురంగవిఠలుని, పూరి జగన్నాథుని పరిణయమాడి చరితార్థమును సాధించుట కానవచ్చుచున్నది. వైష్ణవప్రపత్తియం దాండాళ్ (తాయార్) పరిణయ మిట్టిదియే. శ్రీ రామకృష్ణుల శిష్యురాలగు గౌరిమా యను భక్తకన్నియ జీవిత చారిత్రమునం దీ విషయములు వ్యక్తములగును.

గౌరిమా లేక గౌరీమణి యను గౌర్‌దాసి పూర్వనామము మృడాని. ఈమె జననము 1857-వ సంవత్సర ప్రాంతము. ఈమె తండ్రి హౌరాయొద్ద శిబిపురమునకు జెందిన పార్వతీచరణ ఛట్టోపాధ్యాయుడు. ఈతడు పవిత్ర బ్రాహ్మణకుటుంబమునకు జెందినవాడు. ఆమె తల్లిపేరు గిరిబాలదేవి. ఈమె విద్యావంతురాలు. విజ్ఞానముతో గూడిన స్త్రీ. గిరిబాలదేవి వంగభాషలో కీర్తనలను, సంస్కృతమున శ్లోకములను రచించెను. ఆమెకు ఫార్షీ, ఆంగ్ల భాషలయందు పరిచయము గలదు. సదా ధర్మచింతనతోడి; యాధ్యాత్మిక సాధనలో నుండెడిది. ఆమెకు సోదరులు లేనందున తన తల్లియాస్తిని జూచుకొనుచు, మృడానితో గిరిబాలదేవి కలకత్తా యందలి భవాని పురమున నుండెడిది.

విద్యాభ్యాసనమునకై మృడాని బాలికా పాఠశాలకు పంపబడెను. ఆమె తెలివితేటల జూచి యందఱును మృడాని నభిమానముతో జూచువారు. క్రైస్తవ సాంప్రదాయముగల

పాఠశాలయందు విద్యాభ్యాసమునకై చేర్ప బడెను. అచ్చట హిందూబాలికలకు స్వమత మునం దభిమాన మడుగంటుచుండుటను గాంచెను. మృడాని యీ విషయమును గ్రహించి, అనేక తోడిబాలికలతో నద్దానిని బ్రతిఘటించుటకై యా పాఠశాలను వదలి వైచెను. ఇంత చిన్నటినాటనే, తన స్వతంత్ర భావముల నామె కనబరచెను. పాఠశాలకు స్వస్తిచెప్పినను, చండి, గీత, రామాయణ మహాభారతాది గ్రంథములం జదువుచు, సంస్కృత సాహిత్యమున గృషిసల్పుచు, మంచి జ్ఞానమును సంపాదించెను. ఆమె బుద్ధిసూక్ష్మత యెట్టిదన తాను జదివిన పుస్తకములనుండి యనేకఘట్టము లామెకు ముఖస్థముగనుండెడివి.

అమ్మయు, నమ్మమ్మయు వలె భక్తి మార్గము నవలంబించి, ధర్మచింతనచేయుచు, బూజలుసేయుచుండుట యామె కానందదాయకముగ నుండెడిది. చండి యామె కులదేవత యైనను, నామె తమూషాగా కృష్ణభక్తురాలాయెను. అప్పటిలో భవానిపురమునకు బృందావనమునుండి వచ్చిన కృష్ణభక్తురాలొకతె యామె యింట కొంతకాలముండుట తటస్థించెను. ఆ భక్తురాలు శ్రీకృష్ణు నారాధించెడిది. ఆమె మృడాని భక్తిని జూచి, యాకర్షింపబడి, తనంతట తాను చిరకాలము నుండి పూజలుసేయుచుండు తన శ్రీకృష్ణుని విగ్రహమును మృడాని కిచ్చెను. ఈ విగ్రహమును గౌరిమా యతిభక్తిప్రేమలతో దన యంతిమకాలమువరకు నారాధించెను.

జ్ఞానోదయమగుచుండుటచే పెండ్లీడువచ్చుసరి కామె చిన్మయునిదక్క (శుద్ధశక్తి) అన్యుని వరియింపనొల్లనని ప్రతిజ్ఞ బూనెను. ఈ సంగతి తెలియక పెద్దలు మృడానికి పరిణయము సేయుటకు సర్వమును సిద్ధపరచిరి. అంత వారందఱకు (చావులేని) అమృతు నొక్కని పరిణయమాడెదనని చెప్పెను. పెద్ద లీమె భావమును దెలిసికొని తలక్రిందులైరి. బలవంతమున నామెకు వివాహముసేయ ప్రయత్నము జరిపిరి. కాని పెండ్లిదినమున ఇంటినుండి ఆమె పారిపోయెను. ఒకటి రెండు దినములలో నామెను వెదకి, తిరిగి యింటికి తోడ్కొనివచ్చిరి. తిరిగి వివాహప్రయత్నములు జరుగుచుండెను. తిరిగి యామె పారిపోయెను గాని వీలుచిక్కలేదు. ఆమె తన యాధ్యాత్మిక జీవితమును గృహస్థాశ్రమమునకు సరిపుచ్చుకొనుట కష్టముగ నుండెను. ఆమెకు వైరాగ్యము మిక్కిలి ప్రబలియుండెను. ఇంతలో నామె బంధువులను మరపించి, జాడతెలియకుండగ గృహమునుండి తప్పించుకొని పారిపోయెను. ఆ యుక్తవయస్కురాలగు నా బాల త్యాగశీలముచే ప్రేరేపింపబడి, దేవుడే తనకు తోడు, దిక్కగనుండు నా యగోచరాంతరములోనికి దుమికినది. ఈ సాహసకృత్యము నెవ్వరైన బూర్తిగ యోజించినచో నామె కీశ్వరుడిచ్చిన ధైర్యస్థైర్యములకు విస్మయపడవలసినదే!

ఇట్లామె ప్రపంచమునబడి, యనేక పుణ్యక్షేత్రములను సేవించి హరిద్వారము చేరెను. తాను త్యాగిని ననుకొనుచు గాషాయాంబరముల ధరించెను. హిమాలయమునందలి కేదారము, బదరీనారాయణము దర్శించెను. ఆమె జీవితమును దలంచుకొనిన నొడలు గగుర్పొడచును. అనేక కష్టములను బ్రతిఘటించి, వానికి క్రమశః అలవాటుపడెను. తనసౌందర్య మాకర్షణీయముగ నుండకుండుటకై యామె శిరోజములను కత్తిరించుకొనెను. సమయాసమయముల శరీరమునకు మట్టిని, భస్మమును పూసి

గొనియెడిది. సన్యాసినీవేషమున నుండెడిది. భక్తి, వైరాగ్యము లామెయందు చూడ నత్యద్భుతములై విరాజిల్లెను.

పూరీజగన్నాథమున నుండ శ్రీరామకృష్ణులకు అత్యంతభక్తుడగు బలరామ్‌బోసుతో నామెకు పరిచయమైనది. శ్రీవారినిగూర్చి బలరామునివలన ఆమె విని, వెంటనే దక్షిణేశ్వరమున కేగి, శ్రీ రామకృష్ణులను జూచియు జూడకయే తన మొదటిచూపుననే శ్రీ రామకృష్ణులను గౌరాంగుని యవతారమూర్తిగ గ్రహించెను. గురుదేవుల జీవితమును, వారి బోధామృతమును ఆమె నాకర్షింపగా ఆమె వారి దాసురాలయ్యెను (గౌర్ దాసి). ఆమె శ్రీ రామకృష్ణుల దర్శించునప్పుడు నరేంద్రులు (స్వామిజి), కాళీ పిన్నవయస్కులరు. ఇంకను శ్రీ రామకృష్ణులచెంత శిష్యులంతగ జేరలేదు. నాటి నుండియు, నామె దక్షిణేశ్వరమున గలకత్తాయందు నివసించుచుండెను. ఆమె శారదామాతతో సహబత్ నందుండి, గురుదేవులకు మంచి పరిచర్యసేయ మొదలిడెను. శారదాదేవి, సహజమగు సిగ్గుచే బయటకు రాకుండెను. కాని గౌరిమా ధైర్యముగలది, సామర్థ్యముగలదియు, విద్యావతియు గాన, శారదామాత కామె గొప్ప యండగ నుండెను. శ్రీ రామకృష్ణుల యాదేశము ననుసరించి, గౌరిమా 1882–వ సంవత్సరము నుండియు స్త్రీ పురుషులతో నభేదముగ, భక్తిమై మెలగుచు, స్త్రీలకు భక్తిప్రబోధమును జేయుచు, వారికై తనజీవితమును ధారవోసిన ధన్యజీవి.

ఒకనాడామె శ్రీ గౌరాంగునియందు తఱచుగ ప్రత్యక్షమగు దివ్యభావతరంగముల నోలలాడు ననుభవమునకై వాంఛించెను. ఆమె తన మనోరథము నెవరికిని వెలిబుచ్చకున్నను, ఆ కోర్కె యత్యద్భుతముగ నీడేరెను. ఒకనాటి యుదయమున భక్తులనేకులు దక్షిణేశ్వరము చేరిరి. గురుదేవులకు వంటచేసి, గౌరిమా పళ్లెముతో భోజనము పట్టుకొని, శ్రీవారి గదిలోనికి వచ్చెను. కేదార్‌నాథ్ ఛట్టోపాధ్యాయుడుగూడ ఆ సమయమున నచ్చటనే యుండెను. గురుదేవు లాతనికి గౌరిమాను పరిచయముజేసిరి. కేదారనాథ్ గౌరిమావంటి విశ్వాసముగల భక్తుడే. అంత వారుభయులు నొకరి నొకరు జూచుకొనుచు నిలువబడ, నిర్ఝరకంట నశ్రువులు రాలజొచ్చెను. గురుదేవు లాహారమును ముట్టిరో ముట్టనే లేదో, వీరి భావముల జూచి, తన కంచమువద్దనుండి లేచి నిలువబడిరి. భక్తులందరు దగ్గర జేరిరి. అంత భక్తులందరియందు నా దివ్యభావమే పులకరింప, వారు దానిలో నిమగ్నులై ప్రపంచమును, దమ్మును మరచి తన్మయులైరి. కొందరు నవ్వుచు, గొంద ఱేడ్చుచు, గొందరు పాడుచు, గొందరు నృత్యముసేయుచు ఆనందాబ్ధి నోలలాడిరి. కొందఱి శరీరములు కంపించెను. కొందఱు క్రిందబడి దొరలుచు, శరీరస్మృతిని దప్పియుండిరి. ఇదంతయు కనురెప్పపాటుకాలములో జరిగిపోయినది. ఎవరు నిట్లగు ననుకొనలేదు. ఇటుల దివ్యభావోన్మత్తులై కొంతసేపగుసరికి, రామకృష్ణులు వారలందఱను స్పృశించి, యథాస్థితికి దెచ్చిరి. మనసున అనుకొనకుండగనే, గౌరిమా రామకృష్ణుల కృపచే చైతన్యలీలాతరంగముల నోలలాడి, శ్రీ రామకృష్ణులయందు ప్రత్యక్షముగ తన గౌరాంగుని జవిచూచెను.

శ్రీ రామకృష్ణుల నిర్యాణసమయమున, గౌరిమా బృందావనమున గాఢమగు నాధ్యాత్మికసాధన చేయుచుండెను. చివరిదశలో గురు

దేవులు గౌరిమా ఏది యని యడిగిరి. ఈ వార్త గౌరిమా వినగనే చాల దుఃఖపడినది. శారదామాత కమ్మరిపుష్కరమున నుండ, నామె ప్రజల గుసగుసలను విని సహింపలేక భర్తృవియోగమగుటచే దనచేతిగాజులను దీసి వేయుటయా, మానుటయా యని శంకించు చుండెను. ఈసమయమున శ్రీ రామకృష్ణులు శారదామాతకు దర్శనమిచ్చి, యా విషయ మును 'నీదర్శనార్థమై వచ్చుచున్న గౌరిమా వలన దెలిసికొనుము. నా గౌరినుండియే వైష్ణవ తంత్రములగూర్చియు గ్రహింపు'మనిరి. నాటి మధ్యాహ్న మాకస్మికముగ గౌరిమా శారదా మాతృదర్శనమునకై వచ్చెను. ఈ విషయము లను శారదామాత గౌరిమాతో యోజింప ఆమె యాడుదానికి (మృణ్మయుడగు భర్త భర్తగాక) ఆ చిన్మయుడే (శుద్ధశక్తి) భర్తయని శారదా దేవికి దెలియజెప్పెను. గౌరి ఆ చిన్మ యునే కార్యకారణభావమున భక్తిపరతను ప్రేమించి ధన్యత్వమును పొందెను. అంత రెండు మూడు సంవత్సరములయిన పిమ్మట, గౌరిమా తిరిగి తపస్సునకై హిమాచల ప్రదేశ ముల పర్యటించెను. ఆమె హిమాచల ప్రదేశము, బృందావనము, జగన్నాథము, పూరి, నవద్వీపము—వీనిని తపోనుకూలప్రదేశము లుగా భావించెడిది.

శ్రీ శారదాదేవియెడల గౌరిమాకు గల గాఢప్రేమయు, నపారమగు భక్తిగౌరవము లోకపర్యాయ మామె దుర్గాపూజసేయుతరి ప్రకటితములైనవి. దుర్గ నారాధించు దినము లన్నిటియందు శ్రీ శారదామాతయుకూడ నుండెడిది. ఆమె సమక్షమున గౌరిమా చండి (సప్తశతి) పారాయణము చేసెడిది. ఆఖరు దినమున నామె శారదామాతను నూటయెని మిది యెఱ్ఱకమలములతో నర్చనచేసి, "తల్లీ! నీవు ప్రత్యక్షముగనున్న చండివి. నీ సమక్ష మున చండీస్తోత్రమును పారాయణముజేసితిని. ఈ యుద్గ్రంథ పారాయణమును జేయుచుండు వ్రతము నా కీ దినముతో బరిసమాప్తమైనది. ఇక దుర్గాపూజ సమయమున నా పారాయ ణము నాకు తప్పనిసరిగాదు. నీ యిచ్ఛనుబట్టి నిర్ణయింపబడు"నని తెలిపెను.

(సశేషము)



# సంఘవార్తలు

## దుర్గాపూజా మహోత్సవములు

ఈసంవత్సరము చెన్నపురి శ్రీరామకృష్ణ మఠమున 24-9-'52 మొదలు 29-9-'52 వఱకు దుర్గాపూజ జరుపబడెను. భక్తులనేకులు ఈ పూజయందు పాల్గొని దేవీప్రసాదమునకు పాత్రులయిరి. 24-వ తేదీ బుధవారము సాయంత్రము బోధనపూజ ప్రారంభింపబడినది. 25-వ తేదీ ఉదయమున కల్పారంభము, చండీ పదమును సాయంత్రము ఆమంత్రణము, అభి భాషణమును జరుపబడినవి. 26 ఉదయమున సప్తమీ పూజానంతరము సాయంత్రము చం డీనిగూర్చి శ్రీ శ్రీరామమూర్తిశాస్త్రిగారు తమిళమున నుపన్యసించిరి. 27 న మహాష్టమీ కుమారీపూజలు జరుపబడినవి. నాటి మధ్యా హ్నము సుమారు 2000 భక్తులకు ప్రసాద

వినియోగము చేయబడినది. ఆసాయంత్రము శ్రీ యతీశ్వరానందస్వాములవారుపన్యసంచిరి.

28 న మహానవమీపూజ జరుపబడినది. మధ్యాహ్నము సుమారు 2000 భక్తులకును 3000 దరిద్రనారాయణులకును ప్రసాదము పెట్టబడెను.

నాటిసాయంత్రము సభకు చెన్నరాష్ట్ర దేవాలయ మత సంస్థల శాఖా మంత్రిగారగు పూజ్య శ్రీ కెత్తె వేంకటస్వామినాయుడుగారు విజయంచేసినారు. దుర్గా పూజోత్సవ నిర్వాహకులు శ్రీ మంత్రిగారిని అధ్యక్షపీఠ మలంకరింపఁజేసిరి. అధ్యక్షుల తొలిపలుకుల సారము-

"తలవని తలంపుగ వచ్చిన నాకు నేటి యీ యుత్సవానుభవము ఎదురుచూడని యానందము. మన దేశమున మనము కొని యాడు పండుగలు ఎన్నో ఉన్నవి. అన్నిటిలోను నవరాత్ర్యుత్సవములు గొప్పవి. ఇప్పుడు దేశమున ఏ వైపు చూచినను ప్రజల భక్త్యానందోజ్జృంభణము కన్నుల కఱవు తీర్చుచుండును. దేవాలయ మత సంస్థలకై ప్రత్యేకముగ ఒక శాఖ యుండుట చెన్న రాష్ట్ర ప్రభుత్వము యొక్క విశిష్ట లక్షణము. ప్రస్తుతము మన ప్రధాన మంత్రి [శ్రీ రాజాజీ] గారు తఱచు దైవమును ప్రమాణీకరించుకొను చుందురు. దానిని ప్రతిపక్షులు గేలి సేయు చుందురు. కాని ఆ పరిహాసము అవిచారితము. ఆస్తిక్యము అడుగంటి విప్లవములు పో టెక్కిన యీ కాలమున ప్రజలలో ఆ యాస్తిక్యమును మఱల లేపి దానినే వారి కొక మైక్య బంధముగ అమర్చుట ప్రభుత్వమువారి కర్తవ్యమై యున్నది. దానిని మేము ఎంత వఱకు సాధింపఁగల్గుదుమో అంత వఱకు మన రాజ్యాంగము లోని మా శాఖ కృతార్థ మగును. ఆస్తిక్యమును ఐకమత్యమును సాధించు నుద్యమమును శ్రీ రామకృష్ణసంస్థవారు చిర కాల ము గ సాగించుచున్నారు. వారికి నా యభినందనములు. వారి యుద్యమము అఖండ సిద్ధి గాంచుత మని నా యాశంస."

'మాతృపూజ'ను గుఱించి శ్రీ యతీశ్వరానంద స్వాముల వా రొసంగిన యుపన్యాస సారము—

"మాతకు నా జోహారులు. హిందువులలో 'మాతృపూజ'కు గల ప్రాధాన్యము అనిర్వాచ్యము. బ్రహ్మము నిర్గుణ మైనను విశ్వ వ్యాపారోన్ముఖ మైనప్పుడు ఆ బ్రహ్మమే పరాశక్తిగా కాళీ దుర్గాది నామ రూపముల నొందు చున్నది. బ్రహ్మమును స్వామిగా మిత్రునిగా బిడ్డగా గురువుగా తల్లిగా తండ్రిగా కాంతునిగా కాంతగా ఇంకను ఉత్తానుత్తము లయిన బహు విధములలో ఉపాసింపవచ్చును. అందు మాతృభావన చేసి యుపాసించు క్రమము ప్రపంచమున పెక్కు దేశములలో వాడుకలో నుండినది. కాని క్రైస్తవ మహమ్మదీయ మతములు పుట్టువంది పాశ్చాత్య దేశములను వశపఱచుకొన్నంతనే ఆ యా దేశములలో ఆ నూత్న మతములచే ఈ మాత్రుపాసనము నాశ మొందినది. వేయి మాట లేల? స్త్రీని 'తల్లి' యనుట గొప్ప పొగడ్తగా మనము భావింతుము కదా. పాశ్చాత్యులు స్త్రీని తల్లి యనుట ఇంచు మించు తిట్టినట్లే యని తలంతురు. క్రైస్తవ మత మందు మేరీ కన్యను పూజించు నాచార మున్నను ఆమెకు వా రొసంగిన స్థానము అప్రధానమే. మహమ్మదీయులును ఫతిమాబీబీకి గౌరవ స్థాన మిత్తురే కాని అగ్ర స్థాన మొసంగరు. పరబ్రహ్మమును మాతృరూపమున భావించి మాతృ స్థానమును

పరాత్పరమని కొనియాడు సంప్రదాయము భారతీయులలో మాత్రము అనాదికాలము నుండి అవిచ్ఛిన్నముగ సాగుచున్నది. యాజ్ఞవల్క్యులవారును మఱి కొందఱును ఆ సంప్రదాయమునకు లక్ష్య లక్షణముల జూపి యున్నారు. తండ్రి పదవి కంటెఁ గూడ పై పడినది మాతృ స్థానము. వాత్సల్యమే మాతృ శీలము. వాత్సల్య మనఁగా ఆశ్రితుల దోషములను నిగ్రహమునకు గాక అనుగ్రహమునకే హేతువులుగాఁ జేసికొను ప్రకృతి. కఠోపనిషత్తు, శ్వేతాశ్వతరోపనిషత్తు, శ్రీ మద్రామాయణ మహాభారతములు దేవీమాహాత్మ్యమును ఉద్ఘోషించు చున్నవి. అనేక సంవత్సరములు అనేక సాధనలు చేసి పరబ్రహ్మమును మాతృరూపమున సాక్షాత్కరించుకొన్నవారు శ్రీ రామకృష్ణ పరమహంస గురుమహారాజులవారు. విశ్వము నంతటిని మాతృమయముగఁ గన్నవారు వారు. కావున పత్ని యగు శ్రీ శారదా దేవియందు సైతము ఆయన ఆ దివ్య మాతృ స్వరూపమునే పొడగాంచినారు. ఆమెకు బిడ్డలు పుట్టుదురా అని బంధువులు నిరాశచే ఖిన్నులైరఁట. అప్పుడు శ్రీ శ్రీ రామకృష్ణులవారు "ఆమె కతిపయ శిశు మాత కానేఱదు. విశ్వమాత కాఁగల" దని సెల విచ్చిరఁట. పుణ్యమాత శ్రీ శారదా దేవి యొసంగిన చరమ సందేశ మే మనఁగా "బిడ్డలారా, ఒరుల తప్పులను తడవుట మానుఁడు. మీ యం దొక్కొక్కఁడును తన యందలి తప్పులను గుర్తించి దిద్దుకొన్నచో మీరు పవిత్రు లగుదురు" అని—వైరాగ్య సిద్ధి నొందిన వానికి దేవీ ప్రసాదము తప్ప దని శ్రీ వివేకానందస్వాముల వారును ఆనతిచ్చి యున్నారు. మనము ఒక్కొక్కరమును మనలో విలీనమై యున్న విశ్వమాతను ఏ నాఁడు సాధనా సంపత్తిచే సాక్షాత్కరించుకొనఁగలమో ఆ నాఁడు విశ్వైక మత్యము సాధ్య మగును. విశ్వము సుఖైక నిలయ మగును. ఈ మాతృ పూజను శ్రీ రామకృష్ణసంస్థవారమైన మేము యథాశక్తి జరుపుచున్నాము."

సభాధ్యక్షులైన శ్రీ వేంకటస్వామి నాయుడుగారి మలి పలుకులు—"మాతృభావమును గుఱించి శ్రీ యతీశ్వరానందస్వాముల వారు దివ్యముగ ఉపన్యసించిరి. వైష్ణవాగమములు కూడ దేవిపురుషకారభూత యనియు ఆమె ప్రభావము నిరతిశయ మనియు చాటు చున్నవి. శ్రీమద్రామాయణములోని కాకాసుర వృత్తాంతము కూడ సీతాదేవియొక్క యీ వైభవమునే ప్రతిపాదించు చున్నది. మనోహరాద్భుతముగ శ్రీ స్వాములవారు ఉపన్యసించిన విషయములం గూర్చి ఇంతకన్న విస్తరించి నేను చెప్పఁబూనుట అనుచితమును అనావశ్యకమును."

29 న విజయదశమీపూజలు జరుపబడినవి. మధ్యాహ్నము 3-30 గంటలకు విసర్జనోత్సవము మేళతాళములతో జరిగినది. దేవీ విగ్రహమును సముద్రమున విసర్జింపబడినది. సాయంత్రము 7-30 ఘంటలకు విజయ సమ్మేళనము జరుపబడినది.



# శ్రీ గురుదేవుఁడు శ్రీ మాతృదేవిని ఎట్లు పిలుచుచుండెను?

శ్రీ కందుకూరు మల్లికార్జునం, బి. ఏ.

మదరాసు శ్రీ రామకృష్ణ మఠమువారిచే 1940 వ సం॥న ప్రకటింపఁబడిన శ్రీ మాతృదేవి ఆంగ్లజీవితపు 8 వ అధ్యాయమున ఈక్రింది సంఘటనము ఉదాహరింపఁబడియున్నది "శ్రీ మాతృదేవి ఒకనాఁడు శ్రీగురుదేవునికిభోజనము పెట్టుటకై ఆయన గదిలోనికి ప్రవేశించెను. వచ్చినది తన అన్నకొమార్తె లక్ష్మి యనుకొని ఆయన 'తలుపు మూయు'మని కొంచెము పరాకుగా చెప్పెను. ఆచెప్పుటలో చిన్నలయెడలను, అల్పులయెడలను, వాడు 'తుయి' (నీవు) అను మాటను ఉపయోగించెను. కాని, వచ్చినది శ్రీ మాతృదేవి అని తెలియుటతోడనే ఆయన మిక్కిలి కలవరముతో 'ఏమీ, నీవా! లక్ష్మి యనుకొంటిని. క్షమింపుము'' అనెను. 'ఇందు తప్పేమి? లక్ష్మిని పిలిచినట్లు నన్నేల పిలువకూడదు?' అని యామె చెప్పెను గాని, ఆయన తృప్తినొందలేదు. మఱునాఁటి యుదయము ఆమె నివసించు వాద్యమండపమునకు పోయి 'నీతో అట్లు అమర్యాదగా మాటాడితినన్న పశ్చాత్తాపముచే రాత్రి నాకు నిద్ర పట్టలేదు' అని చెప్పెను.''

ఇందు మాతృదేవితో మాటాడినప్పుడు శ్రీ గురుదేవుఁడు ఉపయోగించిన బెంగాలీ మాట వ్రాయఁబడలేదు. విచారింపఁగా అది ''తుమి'' అనియు, అదికూడ ''తుయి''వలె ఏకవచనవాచకమేకాని నీచతార్థకముకాక సమానతార్థకమనియు, ''తుయి''కి సరియగు తెనుఁగుపదము లేదనియు,. తెలిసినది.

ఇంగ్లీషులో ఈ రెండుపదములకును ''you'' అనియే వాడఁబడినను, తెనుఁగున నెట్లో భేదమును సూచించుట ఆవశ్యకమేయగుటచే కాఁబోలును మద్రాసు మఠమువారి శ్రీ శారదాదేవిచరిత్రము'' లో ''తుయి'' కి ''ఏమే'' అనియు, ''తుమి''కి ''అమ్మా'' అనియు ప్రయోగింపఁబడినది (2 వ కూర్పు, 79 వ పుట). ఈ ''అమ్మా'' ప్రయోగము ''వివేకానందజీవిత చరిత్రము'' లో కూడ చేయఁబడి మిక్కిలి వ్యాప్తిలోనికి తేఁబడినది (6 వ కూర్పు, 51 వ పుట)'

''ఏమే'' అని కొమార్తను పిలుచుట ఆంధ్రదేశములో కొన్నిప్రాంతములలో ఆచారవిరుద్ధమైనను, భేదసూచనార్థము అంగీకరింపవచ్చును. కాని ''అమ్మా''అనునదిమాత్రము అపచారప్రాయమగు దోషము.''The Gospel of Sri Ramakrishna'' by M అనుప్రమాణగ్రంథములో ''Advice to Ishan'' అను 31 వ అధ్యాయమున శ్రీగురుదేవుఁడే తాను భార్యను ''అమ్మా'' అని పిలువఁజాలఁడని విస్పష్టముగా చెప్పియున్నాఁడు. కావున ఈ గ్రంథముల పునర్ముద్రణకాలమున ఈ తప్పు సవరించుట చాల ముఖ్యము

వంగదేశమున భార్యాభర్తలు ''తుమి'' అనియే మాటలాడుకొందురఁట. బహువచనప్రయోగము దూరతాసూచకమని వారి యభిప్రాయము. నే నిటీవల రచించిన ''శ్రీరామకృష్ణలీలామృతము'' (2 వ కూర్పు) లో ''అమ్మా'' అని వాడకపోవుట పొరపాటని పాఠకలోకము భ్రమపడకుండుటకై ఇది వ్రాసితిని. ఆగ్రంథమున శ్రీ గురుదేవునిచేత ఏకవచనప్రయోగమును, శ్రీమాతృదేవిచేత బహువచనప్రయోగమును, చేయించితిని. భార్యభర్తతో ''నీవు'' అని(229, 312పు)మాటాడుటమనదేశపుపాఠకులకు కటువుగా నుండును గనుక అట్లు చేసితిని.

ఇతరులతోడి సంభాషణలలో శ్రీ గురుదేవుఁ డెప్పుడెప్పుడు ఏవచనము వాడెనో మన మెఱుఁగుట అనావశ్యకము. అసాధ్యమును.

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

540 పుటలు సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీమద్భగవద్గీత

480 పుటలు శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకా తాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

432 పుటలు పండిత పామర రంజకమైన శైలి. అందమగు 6-వ కూర్పు రూ. 3-0-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

256 పుటలు ఇంటింటను ఉండతగిన దివ్యగ్రంథము. ముద్దులొలుకు రెండవ కూర్పు వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

186 పుటలు (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | | |
|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు | ... | 2 | 8 | 0 |
| ప్రబోధరత్నాకరము | ... | 2 | 4 | 0 |
| రాజయోగము | ... | 2 | 4 | 0 |
| కర్మయోగము | | 1 | 8 | 0 |
| భక్తియోగము | ... | 1 | 4 | 0 |
| వివేకానందలేఖావళి (మొదటి భాగము) | | 1 | 8 | 0 |
| వివేకానందలేఖావళి (రెండవ భాగము) | | 1 | 8 | 0 |
| అనుష్ఠాన వేదాంతము | ... | 1 | 4 | 0 |
| వివేక సూర్యోదయము | ... | 1 | 0 | 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | | 0 | 12 | 0 |
| భక్తిమార్గము | ... | 0 | 8 | 0 |
| చికాగో నగరోపన్యాసములు | ... | 0 | 8 | 0 |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| గురూపదేశములు | | | | ... | 0 | 8 | 0 |
| నా సంస్కరణ యుద్ధవిధానము | | | | ... | 0 | 6 | 0 |
| నా గురుదేవుడు | | | | ... | 0 | 6 | 0 |
| శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | | | | 0 | 4 | 0 |
| నవీన భారతదేశము | | | | ... | 0 | 4 | 0 |
| ముక్తిమార్గము | | | | ... | 0 | 8 | 0 |
| సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | | | | 0 | 8 | 0 |
| శ్రీ రామనామ సంకీర్తనము | | | | ... | 0 | 1 | 0 |
| యతిగీతము (పద్యకావ్యము) | | | | ... | 0 | 1 | 0 |
| నా మతము | 0 | 0 | 6 | డజను | 0 | 5 | 0 |
| సింహగర్జన | 0 | 0 | 6 | డజను | 0 | 5 | 0 |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

**వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)**

అను మాస పత్రికలును మా యొద్ద దొరకును

శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు
శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-10-52.

# వి ష య సూ చి క



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. ౩ లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగాఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరఁదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులలోఁగాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

౩. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఏట్టిమార్పుగలిగినను 10-వ తారీఖునకు ముందుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథిక భాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతి నెల మొదటి తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

౩. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీ రామకృష్ణ ప్రభ శ్రీ రామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాను వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.



# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౯ } ౧౯౫౨ - నవంబరు : : నందన - కార్తీకము { సంచిక ౫

## పరాపూజ స్తోత్రమ్

జగద్గురు శ్రీమచ్ఛంకరాచార్యులవారు

శ్లో. పూర్ణస్యా వాహనం కుత్ర సర్వాధారస్య చాసనమ్।
స్వచ్ఛస్య పాద్యమర్ఘ్యంచ శుద్ధస్యాచ మనంకుతః. ॥౧॥

శ్లో. నిర్మలస్య కుతఃస్నానం వస్త్రం విశ్వోదరస్యచ।
నిరాలంబ స్యోపవీతం పుష్పం నిర్వాసనస్యచ. ॥౨॥

శ్లో. నిర్లేపస్య కుతో గంధో రమ్యస్యాభరణం కుతః।
నిత్యతృప్తస్య నైవేద్యం తాంబూలంచ కుతో విభోః. ॥౩॥

శ్లో. ప్రదక్షిణా హ్యనంతస్య చాద్వయస్య కుతోనతిః।
వేదవాక్యైరవేద్యస్య కుతః స్తోత్రం విధీయతే. ॥౪॥

శ్లో. స్వయం ప్రకాశమానస్య కుతో నీరాజనం విభోః।
అంతర్బహిశ్చ పూర్ణస్య కథ ముద్వాసనం భవేత్. ॥౫॥

శ్లో. ఏవమేవ పరాపూజా సర్వావస్థాసు సర్వదా।
ఏకబుద్ధ్యాతు దేవేశే విధేయా బ్రహ్మవిత్తమైః. ॥౬॥



ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

# శ్రీ రామకృష్ణ వచనామృతము—'మ.'

## దక్షిణేశ్వర దేవాలయమున అంతరంగభక్తులతో గురురూపి శ్రీ రామకృష్ణుడు

ఆదివారము, 16 డిసెంబరు 1883,
మార్గశీర్ష బహుళ ద్వితీయ.

శ్రీ రామకృష్ణులవారు ముఖర్జీని జూచి యిట్లు పలుక నారంభించిరి: 'నీవు ధనికుడ వయినను భగవంతుని బిలుచుచుంటివి. ఇది చాల మంచిది. భగవద్గీతయందు యోగ భ్రష్టులే ధనికులై జన్మింతురని చెప్పబడి యున్నది.'

ముఖర్జీ:—(తన స్నేహితులవైపు తిరిగి నవ్వుచు) 'శుచీనాం శ్రీమతాం గేహే యోగ భ్రష్టోఽభిజాయతే.'

శ్రీరామ:—భగవానుడు తలంచినచో జ్ఞానులను సంసారమునందుంచగలడు. ఆయన యిచ్ఛవలననేకదా జీవము, జగత్తు - సమస్తమును సృష్టింపబడినది.

ముఖర్జీ:—(నవ్వుచు) ఆయనకు ఇచ్ఛ యేమిటి? ఏదయిన కొదవ యున్నదా?

శ్రీరామ:—అందలి తప్పేమి? జలము స్థిరమయినను జలమే, తరంగములతో నున్నను జలమే.

పాము చుట్ట చుట్టుకొనియున్నను పామే అట్లుగాక తిర్యగ్గతియందున్నను పామే. యజమాని ఊరకనే కూర్చున్నప్పు డే వ్యక్తియో పనిచేయుచున్నప్పుడును అత డా వ్యక్తియే యగును. జీవము, జగత్తు—వీని నెట్లు త్యజింపగలవు? అట్లు చేసినచో భారము తగ్గిపోవును. మారేడుపండునందలి గింజలు, తొక్క—ఇవన్నియు తీసినచో ఆ ఫలముయొక్క సంపూర్ణమైన తూనిక మనకు లభింపదు.

బ్రహ్మము నిర్లిప్తము. గాలిలో సుగంధము దుర్గంధము రెండును గలవు. కాని వాయువు నిర్లిప్తము. బ్రహ్మము, శక్తి—ఇవి రెండును అభేదములు. ఆద్యాశక్తియే జీవజగత్తుగా పరిణమించినది.

ముఖర్జీ:—పురుషుడు ఏల యోగభ్రష్టుడు కావలయును?

శ్రీ రామకృష్ణ గురుదేవు డీ విషయమున ఒక పాటయందలి కొన్ని చరణములను ప్రమాణముగ పాడి చాలించిరి. వాని భావము:

తల్లి గర్భమున యోగమునం దుంటిని. భూమిమీద బడి మన్ను దింటిని. రాత్రియందు నాభిసూత్రము ఖండింపబడినది, మాయా సూత్రము నెట్లు ఖండించుట?

కామకాంచనములే మాయ. ఈ రెంటిని మనస్సునుండి తొలగించినచో యోగము కలు

గును. ఆత్మ—పరమాత్మ అయస్కాంతము, జీవాత్మ సూది. భగవంతుడు తనవైపున కాకర్షించినచో అదియే యోగము. కాని సూదియందు మన్నున్నచో అయమును కాంత మాకర్షింపదు. మట్టిని పూర్ణముగా తొలగించినచో ఆకర్షించును. కామకాంచనములే ఈ మృత్తిక. దీనిని శుద్ధముచేయవలయును.

ముఖర్జి:—శుద్ధముచేయు టెట్లు?

శ్రీరామ :—భగవంతుని వ్యాకులముతో పిలిచినచో ఆ కన్నీరే మట్టిని కడిగివేయును. అట్లు పరిశుద్ధముకాగనే అయస్కాంత మీ సూదిని తనవైపున కాకర్షించుకొనును. అంతట యోగము స్వయముగనే కలుగును.

ముఖర్జి :—ఎంతటి చక్కని మాటలు!

శ్రీరామ :—భగవంతునికొఱకు నీవు విలపించినచో తప్పక ఆయన దర్శనము లభించును; సమాధి కలుగును. యోగము సిద్ధిపొందినచో సమాధి కలుగును. భగవదర్థమై విలపించినచో కుంభకము తనంతట తానే కలుగును. అటుతర్వాత సమాధి.

మరియొకటి ధ్యానమార్గము. సహస్రారమున శివుడు విశేషరూపమున నున్నాడు. ఆయనను ధ్యానింపవలయును. శరీరము కుండవంటిది. మనోబుద్ధులు జలము. సచ్చిదానందుడను సూర్యుడీ జలమున ప్రతిబింబించుచున్నాడు. ఈ సూర్యప్రతిబింబమును ధ్యానించుచున్నచో సూర్యుడే మనయందు దయగల్గి దర్శనమొసగును.

కాని సంసారియగువాడు సదా సాధుసంగము చేయవలయును. వానికి సాధుసంగమత్యంతావశ్యకము. అది అందరకును ఆవశ్యకమే. సన్న్యాసులకు సయితము అది ఆవశ్యకమే. అయినను సంసారులకే యది ఎక్కువగా కావలయును. ఈ వ్యాధి యుండనే యున్నది—కామకాంచనములలో సర్వదా పడియుండవలయునుగదా!

ముఖర్జి :—చిత్తము. ఈ వ్యాధి యుండనే యున్నది.

శ్రీరామ :—సమస్తమును ఆయన కప్పజెప్పుము. ఆయన యిష్టానుసారము చేయుగాక! నీవు పిల్లికూనవలె కేవలము భగవంతుని వ్యాకులముతో పిలుచుచుండుము. తల్లి పిల్లి ఎక్కడ తన్నుంచునో పిల్లకు దెలియదు. ఒకపుడు పడకపైనను మరియొకపుడు పొయిలోపలను నుంచవచ్చును.

ముఖర్జి :—భగవద్గీతాది శాస్త్రముల పఠించుట శ్రేయస్కరము.

శ్రీరామ :—ఊరక చదువుట వలనను వినుటవలనను ప్రయోజనమేమి? ఎందఱో పాలునుగూర్చి వినియున్నారు. అనేకులుచూచియున్నారు. కాని కొందఱే త్రాగియున్నారు. భగవానుని దర్శింపవచ్చును; ఆయనతో ముఖాముఖిగా మాట్లాడవచ్చును. ప్రవర్తకత భక్తుని ప్రథమావస్థ. అపుడు శాస్త్రపఠనము చేయును, శాస్త్రములను వినును. పిదప అతడు సాధకుడగును. ఆ స్థితియందు భగవానుని బిలుచును. ధ్యానము చేయును. భగవన్నామ గుణకీర్తనము గావించును. అటుపిమ్మట సిద్ధుడగును. అపు డీశ్వరుని బుద్ధిపూర్వకముగా గ్రహించును. ఇతడు భగవద్దర్శనమునుబొందినవాడు. తర్వాతి స్థితి సిద్ధులలో సిద్ధుడు. అది

చైతన్యదేవుని అవస్థవంటిది. అతడు ఒకపుడు వాత్సల్యభావముతో నుండును. మరియొకపుడు మధురభావముతో నుండును.

'మ.', రాఖాల్, లాటు, యోగీ మున్నగువారు దేవదుర్లభమగు భగవత్తత్త్వమును ముగ్ధులై వినుచుండిరి.

ముఖర్జీ వెళ్లుటకు సిద్ధపడి శ్రీ రామకృష్ణ గురుదేవునకు నమస్కరించి నిలుచుకొనియుండెను. శ్రీ రామకృష్ణులవారుగూడ ఆతని సమ్మానార్థమువలె లేచినట్లు లేచి నిలిచిరి.

ముఖర్జీ :—(నవ్వుచు) మీ రేల లేచుచున్నారు ?

శ్రీరామ :—(నవ్వుచు) లేచిన నేమి ? కూర్చున్న నేమి ? ఇందేమి తప్పు ? జలము స్థిరమయినను చలితమయినను జలమేకదా ! పెనుగాలిలో బడిన ఆకు గాలి యిష్టానుసారము కొట్టుకొనిపోబడును. నేను యంత్రమను. భగవానుడు యంత్రి.

ముఖర్జీ వెళ్లిపోయెను. 'మ.' ఇట్లు తలపోయ నారంభించెను : 'వేదాంతదర్శనానుసారిణి సమస్తమును స్వప్నతుల్యము. అయినను జీవము, జగత్తు, నేను—ఇవన్నియు మిథ్యలా ?' 'మ.' కొంతగా వేదాంతగ్రంథముల జదివియుండెను. అదియునుగాక అస్పష్టమగు వేదాంతము ప్రతిధ్వని **Kant, Hegel** మున్నగు జర్మనీ విద్వాంసుల విచారమునందు కొలదిగా పఠించియుండెను. కాని శ్రీ రామకృష్ణభగవానుడు దుర్బల మానవునివలె విచారము చేయలేదు—జగన్మాత వారికి సమస్త దర్శనములను గలిగించెను.—ఈ విషయముల గూర్చియే 'మ.' ఆలోచించుచుండెను.

కొంతసేపటికి శ్రీ రామకృష్ణ గురుదేవుడు 'మ.' తో నేకాంతముగ పడమటిదిక్కునందలి గుండ్రపువసారాయందు సంభాషించుచుండెను. ఎదుట గంగానది కలకల నినదములతో దక్షిణాభిముఖియై ప్రవహించుచుండెను. అది శీతకాలము. సూర్యభగవానుడు నైరృతిదిశయందింకను ప్రకాశించుచుండెను. ఎవరి జీవితము వేదమయమయ్యెనో, ఎవరి పలుకులు వేదాంతవాక్యములో ఎవరి శ్రీముఖారవిందమునుండి స్వయముగా శ్రీ భగవానుడే సంభాషించునో ఎవరి వచనామృతమున వేదము, వేదాంతము, భాగవతము—మున్నగు గ్రంథములు రూపొందెనో అట్టి అహేతుక కృపాసింధువు—పరమపురుషుడు, గురురూపధారియై తనతో మాటాడుచున్నట్లు 'మ.' గుర్తించెను.

'మ.' :—జగము మిథ్యయా ?

శ్రీరామ :—అది ఏల మిథ్యగావలయును? అదంతయు వేదాంత విచారవచనము. మొదట 'నేతి, నేతి' యన్న తత్త్వవిచారము చేయుచున్న బ్రహ్మము జీవుడు కాడు ; జగము గాదు ; చతుర్వింశతితత్త్వములును గావు—ఇట్లు అన్నియు స్వప్నములవలె స్ఫురించును. ఆపిదప అనులోమము విలోమము. అపుడు బ్రహ్మమే జీవజగత్తుగ నున్నట్లు గోచరించును.

నీవు మెట్లెక్కి డాబామీదికి వచ్చిచేరితివి. డాబా జ్ఞానమున్నంతవఱకును మెట్ల జ్ఞానమును నుండవలసినదియే. మిట్టనుగుర్తించినపుడు పల్లమునుగూడ గణింపవలసినదియే.

డాబామీదికి బోయి చూచునపుడు డాబా ఏ వస్తువులతో— సున్నము, ఇసుక, ఇటుకలు—తయారుచేయబడినదియో మెట్లుగూడ ఆ వస్తుజాలముతోడనే నిర్మింపబడినదని నీవు

తెలియుదువు. మా రేడుపండు విషయముగూడ నీకు గుర్తుండియుండును. పరిణామములేని దానికే తద్విపరీతస్థితియు గలదు.

'నేను' అన్న జ్ఞానము నశించుట మిక్కిలి కష్టము. ఈ 'నేను' ఉన్నంతవఱకును జీవమును జగత్తును నుండియుండునవియే. భగవానుని బ్రాపింపగలిగినచో ఆయనయే ఈ జీవము, జగత్తు—సమస్తముగా నున్నట్లు తెలియగలదు. ఇవన్నియు తత్త్వవిచారమువలన గలుగునవి గావు.

శివునకు రెండు స్థితులుగలవు— ఒకటి సమాధ్యవస్థ. అపుడాయన మహాయోగమున లయించియుండును. తనయందే యానందించువాడును ఆత్మారాముడునై విలసిల్లును. కొంచెము బాహ్యస్మృతి కలిగినంతటనే 'నేను' అన్న జ్ఞానము కొలదిగా కలుగును. అపుడు 'రామ, రామ' యని పలుకుచు నృత్యము చేయును.

శివుని మనోభావమును చెప్పుచు శ్రీ గురుదేవుడు తన్నే సూచించుచున్నారా యని 'మ.' తలంచెను.

సంధ్యాకాలమయ్యినది. శ్రీ గురుదేవుడు జగన్మాతృధ్యానముచేసి ఆమె నామజపము చేయుచుండెను. భక్తులుగూడ ఏకాంతస్థలములకుబోయి తమతమ ధ్యానము లారంభించిరి. దేవ్యాలయమునందును శ్రీ రాధాకాంతుని ఆలయమునందును ద్వాదశ శివాలయములందును దీపారాధన ప్రారంభింపబడెను. నాడు కృష్ణద్వితీయ. సాయంకాలమయిన కొంతసేపటికే చంద్రోదయమయ్యెను. తత్ప్రకాశము వలన ఆలయగోపురములు నలుదిశలగల; చెట్లు—వీని ప్రతిబింబము లపూర్వశోభను గలిగించుచుండెను. శ్రీ రామకృష్ణ గురుదేవుడు తన గదిలో గూర్చొనియుండెను. 'మ.' మాత్రము ఆ గదియందే క్రింద గూర్చొనియుండెను. మఱల వేదాంతవిషయక సంభాషణ ప్రారంభమయ్యెను.

శ్రీరామ:—జగత్తు ఏల మిథ్యయగును? భగవద్దర్శనానంతరము జీవమును జగత్తును బ్రహ్మమే యని తెలిసికొనగలవు.

నేను ఒకదినమున దేవాలయముననుండగా జగన్మాత కాళి సర్వమును తానేయైనట్టు చూపెను. సమస్తమును చిన్మయస్వరూపముగా గనబఱచెను. — దేవీప్రతిమ చిన్మయము, వేది చిన్మయము, పంచపాత్రయు ఉద్ధరణియు చిన్మయములు, గుమ్మము చిన్మయము. పాలరాలుగూడ చిన్మయములే. గదిలో నేమి కనిపించెనో తెలియునా? సమస్తమును రసభూయిష్ఠమయినట్లు గోచరించెను. సమస్తమును సచ్చిదానందరసముతోడనే గూడియుండెను.

ఒకనాడు దేవి ఆలయమునెదుట నొకానొక దుష్టునిజూచితిని. వానియందును భగవచ్ఛక్తి తళతళ మెఱయుచుండెను.

కావుననే గదా పిల్లికిగూడ నైవేద్యముగా సమర్పించిన పూరీని బెట్టితిని. దేవియే సమస్తమునై యున్నట్లు నాకు కనిపించినది—పిల్లియును. అంతట అర్చకులు పిల్లికి నైవేద్యపు పూరీలను దినబెట్టుచున్నారని నిర్వాహకులు (Manager) మథురబాబునకు ఉత్తరము వ్రాసిరి. మథురబాబు నాఅవస్థనెఱుగును గాన 'వారేమిచేసినను సరియే మీ రేమియుననవద్దు' అని యా యుత్తరమునకు బ్రత్యుత్తరమును వ్రాసిపంపిరి.

భగవద్దర్శనము కలిగినచో నివన్నియు స్పష్టముగా కనబడును. భగవానుడే జీవము, జగత్తు, చతుర్వింశతి తత్త్వములును నైయు న్నట్లు నీవు తెలిసికొనగలవు.

కాని భగవంతుడు 'నేను' అన్న భావమును సంపూర్ణముగ రూపుమాపినచో నపుడేమి జరుగునో మనము నోటితో జెప్పజాలము. రామప్రసాదు ఒక పాటయందు ఆస్థితిని వర్ణించుచు 'అపుడు నీవే మంచివాడవో నేనేమంచి వాడనో నీకే తెలియును' అనియెను. అట్టి స్థితియును నా కపుడపుడు కలుగుచుండును. తత్త్వవిచారమువలన మానవు డొక విధముగా జూచును. భగవంతుడే చూపునపు డాతడు చూచునది వేఱు.



# శ్రీ శారదా స్తోత్ర రత్నాని

శ్రీ దేవరకొండ నారాయణశాస్త్రి

శ్లో. శ్రీ రామకృష్ణ పరమేశ్వర పూజితాఽసి, తచ్ఛాత్రబృంద పరికీర్తిత జీవితాఽసి
విజ్ఞాతుమంబ తవగూఢ మహత్త్వ తత్త్వమ్, శ్రీ శారదేశ్వరి! కృపామయి! క స్సమర్థః? 1

శ్లో. బిభేమి ఘోరాత ర్భవసాగరేఽస్మిన్, మజ్జన్ కరాలంబన దానపశ్యన్
శారదే! పావని! సౌమ్యకాళి!, మాముద్ధరాగచ్ఛ హా మావిలంబం. 2

శ్లో. త్వాం స్మృత్వా దేవీతి విభావయేఽహం, పుత్రోఽయ మీడ్యే మమ కశ్చనేతి
సంభావ్యమాం త్వం తవ దివ్యమూర్తిం, ముక్తిప్రదం దర్శయ మే గభీరే! 3

శ్లో. నహి త్వం సమర్థా పరేషాం ప్రదోషాన్, సుబోద్ధుం తథాచేత్ కథం త్వం ప్రబుద్ధా?
అహో త్వన్మహత్త్వం సువిజ్ఞాతు మజ్ఞాః, వయంవై నశక్తా మహాయోగివేద్యే! 4

శ్లో. శ్రీసతీ భారతీ పార్వతీ రూపిణీం, రామచంద్రాత్మజాం రామకృష్ణప్రియాం.
సుప్రసన్నాననాం సుప్రసిద్ధప్రథాం, శారదా మాతరం భక్తితోఽహంభజే. 5

శ్లో. శాంతిం భక్తిం సమ్యక్ జ్ఞానం, సహనం పుష్టిం యాచే భవతీం
సరసిజనయనాం సంకటశమనీం, అస్మద్గురువర సేవితచరణాం. 6

శ్లో. "అనంగధక్ సతీసమే"తి రామకృష్ణ శంసితాం, విముక్తధీరపుంస్తుతాం వివేకపూర్ణమానసాం
విముక్తి మార్గదర్శనీం వినిర్మలప్రవర్తనాం, విభేదభావనాశినీం విశుద్ధభావ సంయుతాం. 7

శ్లో. స్వభక్త పాపమేఘ సంఘభీషణ ప్రభంజనాం, భవాటవీ కుఠారికామదభ్ర భద్రదాయినీం
నిరంతరం పరోపకార కారిణీం విరాగిణీం, నమామి శారదాం విశేషభక్తియుక్తచేతసా. 8

శ్లో. నమస్తే నమస్తే గుణానా మతీతే!, నమస్తే నమస్తే గుణానాం స్వరూపే!
నమస్తే నమ స్సద్గుణానాం నిధానే!, నమస్తే నమో దుర్గతై స్సన్నిరస్తే! 9

శ్లో. ఇమాని శ్రీ శారదాస్తోత్రరత్నాని సమర్పయే
కృత్వా శ్రీ విరజానంద గురవే గురుదక్షిణాం. 10



# శ్రీధరాచార్యస్వామి

అద్వైత వేదాంత విద్యా మార్గదర్శకులగు ప్రబల మహాపురుషులలో శ్రీధరాచార్యస్వామి వారొకరు. వీరు శ్రీ శంకర, రామానుజ, మధ్వాచార్యులవలె నుపనిషత్తులకుగాని బ్రహ్మ సూత్రములకు గాని భాష్యమును వ్రాయలేదు. శ్రీవారు భగవద్గీత, భాగవతము, విష్ణుపురాణములకు టీకా భాష్యములను వ్రాసియున్నారు. ఆ భాష్యములందు శ్రీ స్వామివారు అద్వైత వేదాంతమునందు భక్తికి ఎంతటి స్థానమున్నదన్న విషయమును ఉపాసకుడు సగుణోపాసన మార్గము నవలంబించి నిర్గుణ బ్రహ్మమును భావింపగలడా యన్న విషయమును సవివరముగ నిరూపించి యున్నారు. పాంచరాత్ర మతస్థుల అద్వైత వేదాంత ఖండనమునెల్ల ప్రతిరోధించిన వారు శ్రీధర స్వామివారు. శ్రీ వారి టీక యించుమించుగా సమస్త సంప్రదాయముల వారిచేతను ఆదరింపబడుచుండుటయే శ్రీవారి మహత్వమును జాటుచున్నది.

మహనీయుల పుట్టుపూర్వోత్తరములకు ఎన్నడును తగు ప్రాముఖ్యత నొసగుట భారతదేశమున పరిపాటిగాదు. కావున శ్రీవారి చారిత్రకాంశములు మనకు తక్కువగనే లభించుచున్నవి. * వీరు ఘూర్జర దేశీయులను వదంతి గలదు. లేబ్రాయముననే పరమానంద పూరి యను యతివరేణ్యుని యొద్ద వీరు శ్రీ నృసింహ మంత్ర దీక్షను గైకొనిరి. ఒక పుత్రుడు పుట్టిన యనంతరము శ్రీవారు కాశీ క్షేత్రమునకు బోయి యచ్చట సన్న్యాసమును బుచ్చుకొనిరి. విష్ణుపురాణ టీకయందు గురుస్తుతి గావించు నెడ శ్రీ పరమానందస్వామి వారినే గురువుగా బేర్కొనుటవలన వారే శ్రీధరస్వామి వారికి సన్న్యాసదీక్షను సయితము నొసగియుండ నోపును.

వీరేకాలమునాటి వారో కూడ సరిగా తెలియబడకున్నది. వంగదేశీయులు శ్రీ రాజేంద్రనాద్ ఘోష్ (తురీయాశ్రమమున - శ్రీ చిద్ఘనానందస్వామి) వారు 13 వ శతాబ్దము చివరిభాగమో లేక 14 వ శతాబ్దము పూర్వభాగమో వీరి జీవితకాలము కావచ్చునని తెలిపి యున్నారు.

వీరి జన్మకాలమునకు పూర్వమే శ్రీమద్భగవద్గీతకు ఎన్నియో భాష్యములు వ్రాయబడి యుండెను. కాని వీరు శ్రీ శంకరాచార్యుల భాష్యమునకే ఎక్కువ ప్రాధాన్యత నొసగుచున్నారు.

శ్రీధరస్వామివారి భగవద్గీత టీకకు సుబోధిని యని నామము. సాధారణ పాఠకులకు సయితము తేటతెల్లముగా బోధపడునట్లు సార్థకమగు నామానుగుణముగ నీ టీక వ్రాయబడి యున్నది. శ్రీ స్వామివారు భక్తిని మోక్షమార్గముగా ప్రవచించుట అద్వైత సంప్రదాయస్థులగు కాశీవాసులకు కొందఱకు నచ్చకపోవుటచే వారు కొంత ఆందోళనము గావించిరనియు, అందువలన శ్రీవారు తాము రచిం

* శ్రీధరస్వామి ఘూర్జరదేశమునందలి 'బలోడి' యను ప్రదేశమున జన్మించిరి.

చిన టీక భగవదంగీకారమును బడసినదాయని ఆత్మపరీక్ష గావించుకొనుటకు తమ గ్రంథమును విశ్వేశ్వరుని (కొందఱి మతానుసారము బిందు మాధవుని) ఆలయమున భగవద్పాద మూల మున నుంచినట్లును, అంతట ప్రతిపక్షులకు భగవానుడు స్వప్నమున గోచరించి శ్రీధరా చార్య గ్రంథమును కొనియాడి ఈ క్రిందిశ్లోక మును చెప్పినట్లును ఒక వదంతి కలదు.

శ్లో. అహంవేద్మి శుకోవేత్తి
వ్యాసోవేత్తి నవేత్తివా,
శ్రీధరః సకలంవేత్తి
శ్రీ నృసింహ ప్రసాదతః.

"శాస్త్రమర్మము లన్నియు నే నెఱుంగు దును. శుకుడు గూడ నెఱుంగును. వ్యాసునకు దెలిసియుండవచ్చును. లేక దెలియక పోవ చ్చును. కాని శ్రీ నృసింహుని ప్రసాదము వలన శ్రీధరుడు సకలమును నెఱిగియున్నాడు."

శ్రీధరుడు భక్తిమతమునకు సుముఖుడగుట వలన వంగదేశీయ వైష్ణవ పండితులు కొందఱు వారిని శ్రీ విష్ణుస్వామి సంప్రదాయులనెడివారు. కాని ఇట్టి వదంతికి ఎట్టి యాధారమును లేదు. శ్రీధరస్వామివారు విష్ణుభక్తులైనప్పటికిని అద్వైతమతము నేల పరిగ్రహించిరో యది యును వింతగనే గోచరించుచున్నది. ఇందుల కనుగుణమగు కారణమును దెలియుట అత్యంత కష్టసాధ్యము. శ్రీవారి గ్రంథములన్నియు జది విన యనంతరము శ్రీవారు భక్తుడు, జ్ఞాని-యను సాధారణ విభజనముల కతీతులని స్ఫురింపగలదు. వారి భగవద్గీత టీకయందలి యుపక్రమణికా శ్లోకములలో ఇట్లు వ్రాసి యున్నారు.

శ్లో. భాష్యకార మతంసమ్యక్
తద్వ్యాఖ్యాతృగిరి_స్తథా
యథామతి సమాలోక్య
గీతావ్యాఖ్యా సమాచరేత్.

తా. భాష్యకారుల మతము మరియు వారి వ్యాఖ్యాతృల వచనములను నా బుద్ధికి తగినట్లు చక్కగా పరిశీలించి గీతా వ్యాఖ్యానమును ప్రారంభించుచున్నాను.

ఇచ్చట భాష్యకారుడను పదము శ్రీ శంకరాచార్యుల వారినే సూచించుచున్నది. ఏలననగా మరి యే యితర మత వాదుల తోడను వీరి మతమునకు పోలికయే లేదు. అది-గాక ఎన్నియో స్థలముల 'శ్రీ శంకరుల వారు ఈ విషయమును మునుపే చెప్పియున్నందున నేను విశదీకరింప నవసరము లేదు.' అని పలికి యున్నారు. శ్రీ శంకరాచార్యుల వారి భాష్య మును శ్రీధరస్వామివారి టీకను ఎడనెడ నుంచుకొని చదివినచో శ్రీధరులు భక్తి మోక్షమునకు ఉత్తమమైన మార్గమని చెప్పుట తప్ప ఇరువురి మతములందును తారతమ్య మావంతయు గోచరింపదు.

ఇట్టిభావములు తరువాతి శతాబ్దములయం దెక్కువగా కనబడుచున్న విషయము వేదాంత ఇతిహాస పాఠకులే యెఱిగియుందురు. ప్రసిద్ధి గాంచినఅద్వైతసిద్ధరచయితయైన మధుసూదన సరస్వతి 'భగవద్భక్తి రసాయనం' అను గ్రంథ మును రచించిరనిన అద్వైత సంప్రదాయము లలో గూడ భక్తికి ప్రాముఖ్యత నొసగబడి నదియు ఋజువగుచున్నది.

# ఆధ్యాత్మిక సాధనవిధానము

## శ్రీ ఆత్మానంద

గీ. ధర్మముల సారమెరిగి సత్సంగివగుచు; సద్గురూత్తము కరుణ స్వశక్తి బడసి
ఈశ్వరుఁడు పరాశక్తియుఁ నేక మనక; రెండుగాగను మభ్యాసకుండ వగుచు.

గీ. ఆత్మయొక్కటే రెండు లేవనెడు నిజము; తీవ్రవైరాగ్యమొందకఁ తెలియలేవు
శబ్దశూన్యంబునగు ప్రదేశమున నీవు; నిర్మలానందమతితోడఁ నిశ్చలముగ

గీ. ఒక సుఖాసనమున గూరుచుండి యపుడు; విశ్వమయుని దర్శించు వివేక మూని
విస్తరించిన మాయనుఁ వేరుచేసి; అంతరింద్రియములు బాహ్యఁ మందు వెలయు

గీ. ఇంద్రియములను వెంటాడఁ నీయరాదు; వానిని స్వశక్తివలన నీలోని కనుప
పొందు జన్మస్థలంబునఁ యందె శాంతి; క్రమముగా బుద్ధి శాంతి వికాసమొందు.

గీ. అప్పుడే యింద్రియచలనఁ మంతరించు; గాలివిసరక మేఘముల్ఁ కదలనట్లు
ఏది బుద్ధియహంకారఁ హేతువయ్యె; నట్టి పరమాత్మునందునఁ పెట్టు బుద్ధి.

గీ. 'నేననుభవించువాడనుఁ నేను కర్త'; నంచు తప్పుగా నారోపణంబు జేయు
నహము బరమాత్మలోనికిఁ ననుపవలయు; అప్డు జీవాత్మ పరమాత్మఁ నంతరించు

గీ. నీటిలో వడగండ్లు జీర్ణించు పగిది; తాను పరమాత్మ వేరువేరనుచు దలచు
ద్వంద్వభావము లావెంటఁ దగ్ధమగును; చనును బాహ్యాంతర ప్రపంచములు రెండు

గీ. గలసి యాపరమాత్ముని గర్భమునకు; అతనిలోనవ్వి లీనమైఁ యంత్యమగును.
ఆర్యులనిరి జీవపరమాత్మైక్యమగుట; యోగ, ముపనిషత్సారముఁ నుత్తమోత్త

గీ. మంబు, గుప్త, మమృతము, మోక్షంబటంచు; తన్ను తాగని స్థూలభూతములదోలుత
యోగి విశ్వాత్మునందు సంయోగపరచి; యుక్తసరణివానిని సూక్ష్మశక్తులందు

గీ. లయమొనర్చిన తదుపరిఁ భయముదీరు; యోగివరుడు నిరంతరఁ యోగమందు
తాను పరమాత్మ దర్శింపఁ దానె విష్ణు; వగును లవణాలరాసులాఁ యప్పులందు

గీ. పూర్ణముగ మునిగి జలమయిఁ పోవుసరణి; అద్ది నిర్వికల్పసమాధిఁ యనబరంగు
శివుని సర్వచరాచరఁ సృష్టియందు; యోగి దర్శించును సమాధినుండి వెడలి,

గీ. అతనిఁ యహమునుస్వార్థంబుఁ నంతరింప; జనన మరణ శృంఖలములుఁ సడలిపోవు
అతడు ముక్తజీవుడుగానఁ నతనికెట్టి; ధర్మము లధర్మములు లేవుఁ కర్మ లేదు.



# శ్రీ వివేకానంద సంభాషణలు

అనువాదకుడు : శ్రీ పిన్నింటి సుబ్బారావు

[పునశ్చరణ—భారతదేశపు కఱవు సమస్య—స్వార్థత్యాగులు—ప్రాక్పశ్చిమములు—అది సత్వగుణమా—తమోగుణమా—యాచకుల జాతి—ఇచ్చి, పుచ్చుకొను సిద్ధాంతము—ఏకాంతముగా మానవునియందు గల లోపములను దెల్పుము ; ఇతరులముందు వాని గుణములను స్తుతింపుము—అందరును వివేకానందులుగా గావచ్చును—విడువని బ్రహ్మచర్యమే శక్తికి కీలకము—సమాధి—పని.]

(గతసంచిక తరువాయి)

నేను :—స్వామిజీ, యిది ఎట్లు సంభవము? వారు మనలను కోప దృష్టితో చూచు చుందురే. స్వార్థరహితులై వారు మన కెట్లు మంచిని చేయగలరు ?

స్వామిజి :—మనయందు కోపమును గలిగియుండుటకు అనేక కారణములు వారు చూపగలరు. దానిని వారు సమర్థించుకొనవచ్చును గూడ ? మనది పరతంత్రమైన దేశము. ప్రపంచమునం దెచ్చటను ఇచ్చట గల యాచకులు లేరు. ప్రజాసామాన్యము నిమ్న జాతులు. వీరు, పైవర్ణములవారిచే ఎడ తెగని బాధలను, చీవాట్లను, తన్నులను అనుభవించుటచే వారియందున్న పౌరుషము నశించి, యాచనయే వృత్తిగాగల భిక్షుకులైరి. ఇంతకంటె కొందరు, ఏ కొద్దిగనో హూణభాష నభ్యసించి, కచేరీల యెదుట అర్జీలను కరములందు దాల్చి గుమిగూడి యుందురు. ఏ యిరువదియో, ముప్పదియో రూకలు వేతనముగల యుద్యోగము ఖాళీయైన, దానికై యధమము ఐదువందల బి. ఏ. లు గాని, యం. ఏ. లు గాని దరఖాస్తులు పంపుకొన గలరు. ఇక ఈ అర్జీలలో వ్రాయు భాష విపరీతముగ నుండును "అయ్యా! తినుటకు ఇంట నేమియును లేదు. నా ఆలు బిడ్డలు మాడుచున్నారు. నా భార్యా బిడ్డలను నేను పోషించుటకై నాకేదైన ఇంతయుపాధి జూపగలందులకై తమ్ము అతిదీనముగా ప్రార్థించుచున్నాను. లేనిచో మే మందరము క్షుద్బాధచే మరణింపగలము" అని వ్రాయబడును. ఉద్యోగము చేయుచున్నప్పుడుగూడ ఆత్మ గౌరవమును పూర్తిగా విడనాడి నికృష్టమగు సేవాధర్మమునే యవలంబించు చున్నారు. ప్రజా సామాన్యస్థితి యీ రీతిగా నున్నది. ఇక పలుకుబడిగల విద్యాధికులు సంఘములుగా నేర్పడి, ఉచ్చైఃస్వరముతో

"అయ్యో, భారత దేశము, ఆనాటి కానాడు నాశన మగుచున్నది. ఓ ఆంగ్లేయ పరిపాలకులారా! మీ దొరతన మండలి పెద్ద యుద్యోగములను మా దేశీయులకు గూడ నిండు. కరవులను బారద్రోలుడు. ఈరీతిగా అహోరాత్రములు విరామములేక, "ఓ ఆంగ్లేయులారా మా కియ్యుడి. ఇంకను అధికముగా ఇయ్యుడి" అని మొరపెట్టు చుండిరి. ఓ ప్రేమ స్వరూపా! వారు ఇంత కంటెనధికముగా నింక నేమి యీయగలరు? రైళ్లను, తంతిమార్గములను, పటుతరమగు పరిపాలనా విధానమును, దొంగల గుంపులను పూర్తిగా నాశనము చేయుటయును, విజ్ఞాన శాస్త్రమును ఒసగిరి. ఇంకేమి యీయగలరు? పూర్తి స్వార్థత్యాగ బుద్ధితో ఇంతకంటె ఎక్కువగా మరెవ్వరీయగలరు? వారు మీకు అధికముగనే యిచ్చిరి. మీరు తిరిగి వారి కేమి యిచ్చితిరని నన్ను మిమ్ముల నడుగనిండు.

నేను:—స్వామిజి, మనమేమి యియ్యవలయును. పన్నుల నిచ్చుచుండుట లేదా?

స్వామిజి:—యథార్థముగా నిచ్చుచున్నారా? మీరు హృదయపూర్వకముగా పన్నులను చెల్లించుచున్నారా? లేక వారు దేశము నందు శాంతిని నెలకొల్పుటచే, మీ యొద్ద నుండి పన్నులను నిర్బంధముగా వసూలు చేయుచున్నారా? వారు మీ కొనర్చిన యుపకారములకై మీరు వారి కేమి యిచ్చితిరో నిజముగా చెప్పుడు. వారికి లేనిది, మీరు వారికి ఇయ్యవలసి యున్నది. మీరు ఇంగ్లండు దేశమునకు బోయెదరు. అదియును యాచక వేషముతో విద్యాసముపార్జనకై బోవుచుంటిరి. అచటికిపోయి వారి మతమును శ్లాఘించుచు కొన్ని యుపన్యాసము లిచ్చి తిరిగి వచ్చుటయేగదా కొందరు కావించు ఘనకార్యము! ఏమి ఘన కార్యము! వారి కిచ్చుటకు మీయొద్ద నేమి యును లేదా? విలువలేని ధనము మీయొద్ద గలదు. మీరు దానిని వారి కీయవచ్చును. మీ మతమును, మీ వేదాంతమును వారి కీయవచ్చును. ప్రపంచ చరిత్రను పఠింపుడు. అందు ప్రతి విశాల భావమునకును భారత దేశమే పునాది యని గ్రహింపగలరు. పురాతన కాలము నుండియు భారతదేశము, విశాల భావములకు నిలయమనియు, ఆభావములను, ప్రపంచమంతటను వెదజల్లిన దనియు నీవు గ్రహింపగలవు. భారత దేశమునం దాంగ్లేయులు నేడు ఆ విశాల భావములను గ్రహించుటకును, వేదాంత జ్ఞానమును సంపాదించుటకును, మన మత ధర్మముల యాంతర్యమును గ్రహించుటకును నిలిచియున్నారు. నీవు వారియొద్ద గ్రహించు చున్నందులకు ఈ యమూల్య రత్నములను వారి కిమ్ము. పరమేశ్వరుడు, మనపై వారిచే మోపబడిన బానిస లను అపనిందను రూపుమాపుటకై వారి దేశమునకు నన్ను బంపెను. యాచించుటకు మాత్రమే మన మింగ్లండు దేశమునకు బోవుట మంచిది గాదు. ఎల్లప్పుడు వారొక్కరుమాత్రమే మనకేల ధర్మము చేయవలయును? ఎల్లకాలము ఆ రీతిగానెవ్వరు చేయగలరు? కరములను జాపి ఎల్లకాలము భిక్షుకులవలె యాచింప వలెననుట ప్రకృతి శాసనము గాదు. ఇచ్చి పుచ్చుకొనుట ప్రకృతి ధర్మము. వ్యక్తిగాని, సంఘము గాని, జాతిగాని, ఎవ్వరైనను సరియే యీ

సూత్రము ననుసరింపనిచో నభివృద్ధి నొంద జాలవు. మనముగూడ ఈ ధర్మము ననుసరింప వలయును. అందులకే నేను అమెరికా ఖండమునకు బోయితిని. అచ్చట నేడు ప్రజలయందున్న మతపిపాసను గమనించిన, నావంటి వేలకొలది సేవకు లా దేశమున కవసరమని తెలియగలదు. చాలకాలము నుండియు, వారికున్న యైశ్వర్యమును మన కిచ్చుచుండిరి. ఇప్పుడు మీ యమూల్య ధన రాశియందు వారికి పాలిచ్చుట విధ్యుక్త ధర్మము. వారికి మనపైనున్న కోపము వెంటనే శాంతించి విశ్వాసము, భక్తి, వినయము మీయెడ వృద్ధిచెంది, మీ రడుగక పూర్వమే మీకు వారు తోడ్పడుటను మీరు గమనింప గలరు. వారిది యోధ జాతి. చేసిన మేలును ఎన్నడును మరచు జాతిగాదు.

నేను :—అయ్యా, స్వామిజీ! తమరు పాశ్చాత్య దేశములయం దొసగిన యుపన్యాసముల యందు తరచుగను, స్పష్టముగను, మన ప్రత్యేక గుణములగు బుద్ధిసూక్ష్మతను, సుగుణ సంపత్తిని మతమందలి మన హృదయ పూర్వకానురాగమును శ్లాఘించితిరి. కాని యిప్పుడు మీరు మనము పూర్తిగా తమోగుణమునం దుంటిమని యొకచో చెప్పుచు, మఱియొకచోట, ఋషుల మతసత్యములను ప్రపంచమునకు వెదజల్లు అధికారము గలవారమనియు శ్లాఘించుచుంటిరి. ఇదెట్లు పొసగును?

స్వామిజి :—నేను దేశదేశములు తిరిగి, మన దోషములను వారి ఎదుట బహిరంగ పరతు ననియా యనుకొనుచుంటివి? మన జాతీయాదర్శములను వారికి బహిరంగ పరతు నని విశ్వసింప గూడదా? సూటిగా ఒకని తప్పిదములను చెప్పుట మంచిది. స్నేహ ధర్మముతో వానిని సవరించు కొనునట్లు నమ్మకము గలుగజేయ వలయును. కాని యితరుల ఎదుట వాని సుగుణ సంపత్తిని వేనోళ్ల బొగడవలయును. శ్రీ రామకృష్ణుడు దుర్మార్గుని సయితము సన్మార్గుడవని సంబోధించుటచేతను సన్మార్గుడేయగు ననియు, సన్మార్గుని సయితము దుర్మార్గుడవని సంబోధించుటచే దుర్మార్గుడే యగు ననియు, నుడివియుండిరి. పాశ్చాత్యులకు వారి లోపములను గూర్చి తృప్తికరముగా దెల్పియుంటిని. మన దేశమునుండి నాకు పూర్వము పోయిన వారందరును, వారి సుగుణములను గూర్చి శ్లాఘించుటయు, మన దోషములను స్పష్టముగా వారికి బహిరంగ పరచుటయును మాత్రమే యొనర్చిరని మాత్రము గ్రహింపుడు. తత్ఫలితముగా వారు, మనమన్న, అసహ్యించుకొనుచుండిరనిన, ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఈ కారణము చేతనే ఇచ్చట మీకు మీ యందలి లోపములను, వారి సుగుణములను దెల్పుచున్నట్లు అచ్చట మీ సుగుణములను వారి దోషములను బహిరంగ పరచితిని. మీరెంతటి తమోగుణ ప్రధానులైనను మన పూర్వ ఋషుల స్వభావము అతి స్వల్పముగా నైనను, చివరకు దాని బాహ్యస్వరూప మైనను, మీయం దింకను గలదు. అంతమాత్రము చేత, తొందరపడి, పాశ్చాత్య దేశములకుబోయి మతబోధను చేయుట కుద్యమింపరాదు. మొదట ఏకాంత వాసము జేసి, తన జీవితమును మత సాధనలచే సరిదిద్దుకొనవలయును. పరిపూర్ణ

త్యాగము, విడువని బ్రహ్మచర్యము గలిగి యుండవలయును. నీయందు తమోగుణము ప్రవేశించినది. అయిననేమి? తమోగుణమును నాశనము చేయలేమా? ఈ క్షణముననే చేయవచ్చును. శ్రీ రామకృష్ణ భగవానుడీ తమోగుణమును నిర్మూలించుటకే యవతరించెను.

నేను :—స్వామిజీ! మీ వలెనే యుండుట కెవ్వరుత్సహింప గలరు?

స్వామిజి :—నేను చనిపోయిన పిమ్మట నిక వివేకానందు లుండరనియా, నీ యభిప్రాయము? ఏ యువకబృందము, ఇంతకు పూర్వమే, తమ ఎదుట గానము నభినయించెనో, ఎవరినిజూచి మీరందరును నిషిద్ధ భోజకు లనియు, మత్తు పదార్థములను సేవించు వారలనియు నీచముగా చులకన చూపు చూచియుంటిరో, ఆప్రభు విచ్ఛగించుచో, వారిలో ప్రతియొక్కరును వివేకానందులుగావచ్చును! ప్రపంచము గావలయు ననిగోరుచో వివేకానందులకులోపము లేదు. వేలకొలది, లక్షల కొలది వివేకానందు లుద్భవింపగలరు. ఎచ్చటినుండియో, ఎవరి కెరుక! నేనొనర్చిన పనియంతయును వివేకానందు డొనర్చినది గాదనియు, ఆ ప్రభువు యొక్క స్వంతపనియే యనియు విధిగా గ్రహింపుము. ఒక గవర్నరుజనరలు విశ్రాంతి గైకొనిన ఇంకొకరిని చక్రవర్తి వాని స్థానమున నియమింపడా? ఎంతతీవ్రముగా మీరు తమోగుణమునందు మునిగి యున్నను, హృదయ పూర్వకముగా ఆ ప్రభువును శరణువేడిన అది యంతయును విడివడి దారి నొసగగలదు. ఇప్పుడు యుక్తమైన కాలము. భవరోగమునకు చికిత్స చేయు ఘనవైద్యు డవతరించి యుండెను. ఆతని నామమును గైకొని, పనిచేయుట కుద్యమించిన, నీయందుండి యాతడీ సర్వమును నెరవేర్చగలడు. తమోగుణము, తనంతటతానే యుత్కృష్టమగు సత్వగుణముగా పరిణమింపగలదు.

నేను :—తమరు ఏమి చెప్పినను సరియే. మీ మాటలను నమ్మజాలను. వేదాంతము నుపన్యసించుటలో తమకున్న యుపన్యాస శక్తి యింకెవ్వరి కుండగలదు?

స్వామిజి :—నీకు తెలియదు. ఆశక్తి యందఱకును గలుగ వచ్చును. భగవంతునికై ద్వాదశవత్సరము లెవ్వరు ఏకాగ్రముగా బ్రహ్మచర్య దీక్ష నవలంబింతురో వారి కందరకును ఆశక్తి కల్గును. నేను స్వయముగా ఆ రీతిగా అనుష్ఠించియున్నాను. నా బుద్ధియందలి మాయయను తెర పటాపంచలైనది. అందుచేతనే అతి సూక్ష్మములగు వేదాంత విషయములను గూర్చి యుపన్యసించుటకు పూర్వము నే నేమాత్రమును ఆయత్తపడ నవసరము లేదు. నేను రేపైనను ఉపన్యసింపవలసి వచ్చినచో, ఆ యుపన్యాస విషయమంతయు ఈ రాత్రి నా యెదుట చిత్రప్రతిమల పగిది గానబడుటచే మఱునాడు నేజేయు కార్యమంతయు ఆ విషయమంతటిని శబ్దజాలముతో నింపి యుపన్యసించుటయే. ఇది నాయొక్కని ప్రజ్ఞయే గాదను విషయము నీకు ఇప్పటికైనను బోధపడినదా? ఎవ్వరైనను సరియే ఏకాగ్రముగా పండ్రెండు సంవత్సరములు బ్రహ్మచర్య దీక్ష నవలంబించుచో వారి కిట్టి శక్తి యలవడగలదు.

గా ఆచరించుచో నీకును ఆ శక్తి

లభ్యము కాగలదు. ప్రత్యేకముగా ఫలానా వారికే యాశక్తి కలుగు ననియు, మిగిలిన వారి కా శక్తి లభ్యము గానేరదనియు, మన శాస్త్రములం దెచ్చటను జెప్పియుండ లేదు.

నేను :—స్వామిజీ! మనము —ఫలానా వారి ఇంటియందున్నప్పుడు, ఒకానొక రోజున తమరుపన్యసించుటకు పూర్వము, సమాధి యొక్క చిత్రచరిత్రను మాకు చెప్పిన విషయము తమకు జ్ఞాపకమున్నదా? మీ మాటలు సత్యములా యనియు, ఈ కలి యుగమున సమాధిస్థితి కలుగునా యనియు నేను ప్రశ్నించినపుడు, తమరు ఔత్సుక్యముతో "నీవు సమాధిని చూడదలచితివా, లేక పొందదలచితివా? నేను సమాధిస్థితిని పొందితిని. నీవు పొందునట్లు చేయగలను." అని నుడివితిరిగదా. ఈ మాటలు ముగిసి నంతనే, ఎవ్వరోయొక నూతన పురుషుడు తమయొద్దకు వచ్చుటచే ఆ ప్రసంగమును గూర్చి ముచ్చటించుట కవకాశము లభింప లేదు.

స్వామిజి :—అవును. ఆ విషయ మంతయును జ్ఞాపకమున్నది.

తర్వాత స్వామిజీని సమాధి స్థితిని గలుగ జేయుడని నేను ప్రార్థింపగా, వారు, "చూడుము. నేను విడువకుండ ఉపన్యాసము లిచ్చి, శ్రమపడి యనేక సంవత్సరములు కృషి చేయుటచే, నాయందిప్పుడు రజోగుణము తీవ్రముగా విజృంభించి యున్నది. అందుచే ప్రస్తుతము నాయందాశక్తి యణగియున్నది. హిమాలయములకు బోయి, కొంతకాలము ఏకాంతముగా ధ్యానమొనర్చిన, ఆ శక్తి మరల నాయందుండి బహిర్గతము కాగలదు." అని నుడివిరి.



కోడి ఎక్కడో కూర్చొనియుండును. కాని గ్రుడ్లు పెట్టుట దాని గొప్పదనము. నెమలి ఎందో అడవులలో విహరించుచుండును. స్వతస్సిద్ధమయి వివిధవర్ణములతో ఆకర్షణీయమయిన తన పింఛమును విప్పి ఆడుటయే దాని మహత్త్వము; ఊరక శాంతిమయచిత్తముతో గూర్చొని యుండుటయే యోగియందలి ఆధిక్యము.

భూమ్యాకాశములు రెండును తమ దాతృత్వమును వెల్లడించుకొనవు, సమస్తప్రపంచమును వానికి తృణమయశ్వానములు. ఋషి తానొనర్చు దానమునుగూర్చి వెల్లడింపడు. ప్రజలందరు ఆయనకు గడ్డిబొమ్మలవంటి వారు. భూమ్యాకాశముల మధ్యప్రదేశ (రోదసీకుహర) మంతయు కమ్మరితిత్తివంటిది. లోపల నేమియు లేనట్లు కనిపించును. కాని కదలి నంతనే దానిలోపలినుండి యెంతయో బయలుపడును.

ఎక్కువగా మాటాడినవాడు త్వరగా అలసిపోవును, కావున తన లోపలి విషయమును జెప్పకుండుటయే శ్రేయస్కరము.

—టికింగ్ టాంవో నుండి:



# గౌరిమా

శ్రీ దువ్వూరి రామకృష్ణారావు, బి. ఏ

(గతసంచిక తరువాయి)

గౌరిమాకు శారదామాతయందు గల భక్తి గౌరవములు గౌరిమా చెప్పిన యీ వాక్యముల వలన స్పష్టమగుచున్నవి. "శ్రీ శారదా దేవి, శ్రీ గురుదేవులు తమ జీవితమును ధారవోసిన కృషియందు శ్రీవారి భాగిని. ఇంతియగాక నిశ్చయముగ దన భార్యను తాను శ్రీమాతగా శ్రీ రామకృష్ణు లారాధించిన స్వరూప మేకాలమునందును గాంచని మహాద్భుతము. శ్రీ శారదా మాతృ గుణములను ప్రజలింకను సరిగ గుర్తింప జాలకుండిరి. ఆమె యొక్క శీలము ప్రకాశ మయినకొలది సర్వలోక హృదయవిస్తరణమును వృద్ధియగుచుండును."

శ్రీ శారదాదేవికిని గౌరిమా యందిట్టి వాత్సల్యము గలదు. ఆమెను దన కూతురుగనే ప్రేమించుటయే గాక, యామెయెడల గొప్ప గౌరవముతో మెలగెడిది. ఆమెను శారదామాత ముద్దుగా గౌర్‌దాసి యని సంబోధించుచుండును. శారదామాత జబ్బుగానున్నప్పుడు రాత్రియంతయు గౌరిమా శారదామాతకు పరిచర్య చేయుచుండెను. శారదామాత చదువు కొనకపోయినను, గౌరిమా పాండిత్య ప్రకర్షను, సర్వముఖ సామర్థ్యమును మెచ్చుకొనిమెడిది. ఒకప్పుడామె యిట్లు వచించెను, "ఒక గొప్ప జీవి చాల అరుదు. ఉన్నచో అట్టిజీవితో తుల తూగదగువా రుండరు. గౌరిదాసి యట్టి యపూర్వమగు జీవి." చెన్నపట్టణమున, శారదాదేవిని ప్రసంగింపుడని స్త్రీలు వేడుకొనిరి. అప్పుడామె "నేను బహిరంగోపన్యాసముల నీయజాలను, నాతో గౌరిదాసి వచ్చియున్నచో ఆమె ప్రసంగించెడిది," అని వారితో జెప్పెను.

గౌరీమణిని స్త్రీల యభ్యుదయమునకై పాటుపడ వలసినదిగా శ్రీ రామకృష్ణుల వాక్కు. కాని గౌరిమా యప్పటి తపస్సునందలి ప్రీతిచే, బట్టణములందు సందడి, యల్లరియు గనుక నచ్చోట నుండ నొల్లదయ్యె. కాని కర్మ పరిపక్వ మయినది. ఆమె దేశ, దేశముల సంచారములో స్త్రీల యధోగతిని జూచినది. తన ముక్తికై ఎంతశక్తిని ధారపోసెనో, యిప్పుడా శక్తియంతయు భక్తియై యనేకుల క్షేమమునకు, వారి సేవకై వినియోగపరచ వలెనను ధ్యాస యామెకు గల్గెను. ఆమె తన తుది నలువది సంవత్సరముల జీవితమును వంగ దేశ స్త్రీల యభ్యుదయమునకై సమర్పణ జేసెను. దేశాటనవలన గల్గిన యనేకానుభవములు, తీవ్రమగు సాధన, యా గొప్ప సంస్కృతితో నీ కార్యమున కామె చక్కగ దగి

యుండెను. 1880-వ సంవత్సరమున ననాథలగు స్త్రీలకు, బాలికలకు రక్షణ నిచ్చుచు, వారి యైహికాముష్మిక శిక్షణ గరపుటకై యేర్పాట్లు గల యాశ్రమమును స్థాపించెను. శ్రీ శారదా మాత యందలి తన భక్తి గౌరవములను బురస్కరించుకొని యీ యాశ్రమమును శ్రీ శారదేశ్వరీ ఆశ్రమము, పాఠశాల యను పేరుతో గలకత్తాకు ఉత్తరమున ఈ సంస్థ నెల కొల్పబడినది. ఇది మన హిందూ స్త్రీలకొక విద్యాసంస్థ. ఇది బాలికలకు మామూలు విద్య గరపునదియే కాక, పవిత్రత, సేవ, భక్తి మొదలగు భారతాదర్శముల బురస్కరించు కొనిన విద్యాసంస్థ. సమర్థులైన స్త్రీలు కొందఱు గౌరిమాయొక్క యభినివేశముతో మేళవించి, వైరాగ్యముతో గూడిన సేవా పరాయణలుగ జీవించువారు దీని కార్య నిర్వాహమునకు బూను కొనిరి.

ఈ సంస్థను వృద్ధిలోనికి దెచ్చుటకు గౌరిమా చాలకష్టములకు లోనైనది. ఆ కాలమున స్త్రీ విద్య కాదరణ లేదు సరిగదా, పెక్కు అవరోధ ముల నామె యెదుర్కొనవలసి వచ్చెడిది. ఆశ్రమ వాసులకు దగు శిక్షణ నిచ్చుట, తన వంట మొదలగు నిత్య కృత్యములను జేసి కొనుట మొదలగునవి గాని, వంగదేశమున, బీహారమున, నస్సామ్ రాష్ట్రమున స్త్రీ విద్యను గూర్చి ప్రబోధము చేయుచు, సంస్థకై చందా లను వసూలుచేయుచు, దన సంస్థకు నభి మానులను జూడవలసి వచ్చెడిది. ఆమె తన సంస్థకితరులపై నాధారపడుట కంటె, తాను పూనుకొనిన కార్యమునందలి బలముపైనను, గురుదేవుల యాశీర్వచనము మీదను ఆధార పడి యుండెను. తాను జేయు లోకహితైక కార్యములన్నింటికి శారదాదేవి హృదయ పూర్వకమగు నంగీకారమును, దీవనలను పొందెడిది. శారదాదేవియు ఆ యాశ్రమమును జూచి, యా పద్ధతులను ప్రశంసించుచుండెడిది. ఇంగ్లాండ్లవిద్య నభ్యసించుటతోపాటు, హిందూ ధర్మములు నశింపకుండ దన బాలికలకు ఐహి కాముష్మిక సంపత్తిని గలుగ జేసెడిది. తన శిష్యులకు, భక్తులకు శారదామాతచే నుప దేశము గూడ నిప్పించెడిది. ఇప్పుడు గౌరిమా యొద్ద శిక్షణ పొందినవారిలో గొందరు తమ సర్వమును ధారవోసి ఆ సంస్థను నడుపు చున్నారు.

శారదామాత తన రాధుకిచ్చిన శిక్షణ గూర్చి మాట్లాడుచునిట్లనియె: "రాధునుగూర్చి నే నెన్నిచిక్కులలో బడుచుంటిని. గౌరిదాసి తన బాలిక కెట్లు శిక్షణ గఱపినది. నేనుకోతి పిల్లను తయారుచేసితిని! నిశ్చయముగ గౌరిమా పెంచిన యా పిల్ల పుష్పమువలె పవిత్రురాలు. ఆమెయందు సుగుణములను గౌరిదాసి చక్కగ నచ్చు బోసినది. ప్రపంచమున ననేకులు తమ మనంబులు పూర్తిగ తగుల్కొని యున్నప్పట, భగవన్నామ సంకీర్తనమును మొదలిడుదురు. కాని చిన్ననాటినుండియు నీశ్వరధ్యాననిమగ్న లైయుంట ధన్యత. గౌరిమా యా పిల్లను జిన్న నాటనే తన వశమున నుంచుకొనెను. ఆమె సోదరు లాపిల్లకు వివాహము చేయ నెంతయో ప్రయత్నించిరి. గౌరిమా యామెను అనేక స్థల ములకు బిల్లిపిల్లనువలె ద్రిప్పుచు, నామెను గాచి, సంరక్షించెను. చివరకామెను గౌరిమా పూరీకి తీసికొనివెళ్లి జగన్నాథునికి గళ్యాణము చేయించెను. వారి యుభయుల పూలదండలు మార్చుకొన బడినవి. అటుల నా బాలిక జగ దీశ్వరుని పరిణయ మాడెను. అంత నామె యోగినిగా మారెను. ఆమె సంస్కృతమున

బరీక్షల నారితేరి, మంచి విద్యాబుద్ధుల బడసెను.'' ఇట్లు "గౌరిమా యనేకులకు తన శక్తిని ధారవోసి విద్యాబుద్ధుల గరపెను. సుస్త్రీగానున్న బాలికలకు దాదివలె పరిచర్య చేసెను. ఆమెకు స్వకుటుంబము లేదు. ఈ పిల్లల యెడల నామె తన మాతృప్రేమను జూపెడిది. ఈ యనుభవములు, గష్టములు పడుచుండుట—యిది యామెకు తుదిజన్మ.''

ఇట్లు గొప్ప సాధనను, గఠినములగు సేవలను చేసి (1938) గౌరిమా ఎనుబదవయేట పరమపదించెను.

శ్రీ రామకృష్ణ పరమహంస దేవుల తపోవాహిని వారి యర్ధ శరీరేశ్వరియగు శారదా మాత, వారి ఛాష్యకారులగు వివేకానంద స్వామి, బ్రహ్మచారిణియగు గౌరిమా మొదలగు వారిద్వారా ప్రవహించి, స్త్రీలలో నూతనోత్సాహము, పవిత్రజీవితము రేకెత్తించినది. సత్వరముగ బ్రహ్మచారిణులు, సన్న్యాసినుల కొరకై కేంద్రస్థానమగు మఠము శారదా దేవి పేరున స్థాపింపబడుట తథ్యము.



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

ఆల్మోరా,
12-10-'16.

ప్రియ దే...

విజయదశమినాటి నీ యుత్తరము జూచి యెంతయు సంతసించితిని. నీ శారీరక మానసికారోగ్యములు చక్కబడినవని విని యానందించుచుంటిని. ముఖ్యముగ భగవద్భజన మెక్కువగా చేయుచున్నట్లు వ్రాసియుంటివి. అంతకంటె మనస్సున కానందకరమైనది యేది గలదు ?

శ్లో. ఏషాం త్వంత గతం పాపం
జనానాం పుణ్యకర్మణాం,
తే ద్వంద్వమోహ నిర్ముక్తా
భజంతే మాం దృఢవ్రతా.—గీత, 7-28.

దేహధారణమైనంతనే రోగశోకములు తప్పక వెంబడించుచుండును. కాని ఇవన్నియు నున్నను ఎవడు ద్వంద్వమోహనిర్ముక్తుడై, దృఢవ్రతముతో భగవద్భజనము చేయగలుగునో అతని పాపములన్నియు నంతమయినవి. అనగా అతడింక ద్వంద్వమోహములకు వశీభూతుడు కానేరడు—భగవంతుడు సరియైన

శ్లోకమున దీనిని సూచించియున్నాడు. శ్రీ రామకృష్ణ గురుదేవుడుగూడ 'శరీరమును తనదుఃఖమును జూచుకొననిమ్ము. మనసా! నీ వానందముతో నుండు'మని పలికెడివారు: నీవు ఇదంతయు చక్కగా గ్రహించినట్లు వ్రాసియున్నావు. ఇది నీకు గొప్ప లాభము. భగవద్భజనమే సారవంతము. ఎందున్నను సరియే ఆయనను హృదయస్థుని గావించుకొన్నచో సమస్తమును సుఖమే. ఆయన గుమ్మము నొద్ద పడి! గాపులు గాచినచో ఆయన దయ తప్పక కలుగును. అట్లే పడియుండవలయును. దృష్టినంతయు ఆయన కభిముఖము గావించియున్నచో సమస్తవిషయములను ఆయనయే చక్కబెట్టును. ఆయన మంగళమయుడన్న నమ్మకముతో నున్నచో సుఖశాంతులు తమంత తామే కలుగగలవు. సాధారణబుద్ధితో ఈ జగత్తునుగూర్చి విచారణ సలిపిన యెడల ఎన్నో పొరపాట్లు జరుగగలవు. కావుననే శ్రీ రామకృష్ణ గురుదేవుడు 'మొదట భగవానుడు పిదప జగత్తు' అని యుపదేశించియున్నాడు. భగవత్పాదపద్మముల బట్టుకొనియుండుము. సమస్తకల్యాణములకును అధికారి వగుదువు.

ఇట్లు,
శుభాకాంక్షతో,
శ్రీ తురీయానంద

శ్రీహరిశరణమ్

కాశి,
17-12-16.

ప్రియ దే...

నీ యుత్తరమునందలి నీ యాధ్యాత్మిక మానసికోన్నతిని జదివి యెంతయు సంతసించితిని. నీవు ఆయనమీద సంపూర్ణముగా నిబ్బర పడియుండి, అనంత శాంతిని బడసి నీ యీ మానవజన్మమును సార్థకము గావింపగల సామర్థ్యము నీకు కలుగవలయునని నేను భగవానుని బ్రార్థించుచున్నాను. ఇంతకంటె మరి యెట్లు ప్రార్థింపగలము? సంపూర్ణ ఆత్మసమర్పణమే మానవజన్మయందలి చరమోత్కర్షమును శేషగతియును.

ఇట్లు,
నా శుభాశీస్సులతో
శ్రీ తురీయానంద

ఓం శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# భగవ

## శ్రీ దా. వేంకట అప్పలనాయుడు

శ్రీమత్ సత్యజ్ఞానానందస్వరూపుడగు సర్వేశ్వరునిచే సృజింపబడిన యీ లోచనగోచరమగు జగత్తులో గల చరాచరాత్మకమగు జీవరాసులలో ఏ జీవియు పరజీవిచే నిందితార్హము కాదు. ఏలయన సర్వశక్తియుక్తుడగు సర్వేశ్వరుడు, సకలజీవజంతు హృత్కమలకర్ణికా మధ్యంబున, క్షీరాంతర్గతంబగు ఘృతంబురీతిని వ్యాపించియుండి, జంత్రపువానిచేతిలోని యంత్రపు కీలుబొమ్మల కైవడి తన నిజ ప్రకృతి మాయాజగజ్జాలరంగంబున జీవులచే కర్మతంత్రపు నాటకంబు లాడించుచు సృష్టి వైచిత్రి గల్పించి వినోదంబులు సల్పుచుండును. ఇట్లు భగవత్పరికల్పితమైన సకలజీవులలో సత్యాసత్య, నిత్యానిత్య, ధర్మాధర్మ, జ్ఞానాజ్ఞాన విమర్శనాశక్తిగల మానవజీవియే సర్వోత్కృష్టముగా, సర్వులచే పరిగణింపబడుట చేత తన సహజ విజ్ఞాన బలంబు నుపయోగించి ఈశ్వర జగత్సృష్టి మర్మంబులు గుర్తించి, సర్వేశ్వరుని సర్వదా భక్తితో భజించుచు, సన్మార్గ ప్రవర్తకుడై. తన మానవ జన్మను సార్థక మొనర్చు మానవశ్రేష్ఠుడే ఉత్తముడు, మహాజ్ఞాని, పండితుడు, మోక్షశిఖరారోహణార్హుడు.

సహజ సంవర్ధమాన నిరంతర భగవధ్యాన పరాయణులగు, మహర్షులచే, ముక్తిసౌధారోహణ సోపానంబులు పెక్కులు వేర్కొనబడినవి. అందు భక్తి, జ్ఞాన, వైరాగ్యంబులు ముఖ్యంబులు. వీనిలో "మోక్షకారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" యను ప్రమాణ రీత్యా భగవద్భక్తిమార్గమే ప్రధానము. భక్తి యననెద్ది? మున్ను దేని సహాయమునం జేసి ప్రహ్లాద, నారద, తుంబుర, శౌనకాది మహాభక్తులు విదేహకైవల్యముక్తిప్రాప్తులై బ్రహ్మానందపరవశంబున అసమాన శేముషీ ధురంధరులై విరాజిల్లిరో అదియే భక్తియనబడును. అనగా నిత్యసచ్చిదానందప్రదంబగు పరబ్రహ్మమును సగుణమూర్తిగా భావించి, తన్మూర్తిని త్రికరణశుద్ధిగా ధ్యానించుటయే భక్తి యనబడును.

శ్లో. నిర్గుణం చేంద్రియాతీతం
నిరాకారం నిరంజనం,
స్వభక్తరక్షణార్థాయ
జాయతేన యుగే యుగే.

అను ప్రమాణమునే వ్యక్తీకరణము చేయుచు కృష్ణభగవానులు గీతలో

శ్లో. పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతం,
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే.

అని చెప్పియున్నారు. అట్లు లోకోద్ధరణార్థము అవతరించిన పరబ్రహ్మ ప్రతిబింబమూర్తు లనేకములు గలవు. వారిలో శివ, కేశవులు అగ్రస్థానమును వహించిరి. వీరిలో ఎవరిని భక్తితో పూజించినను నామస్మరణభేదమే గాని ఫలభేదమేమియు లేదని యీ క్రింది కృతి దృఢ పరచుచున్నది.

శ్లో. యో విష్ణు స్స స్వయం రుద్రో
యో రుద్ర స్స జనార్దనః,
ఇతి మత్వా భజే ద్దేవం
స యాతి పరమాం గతిం.

ఎవడు విష్ణువో వాడే రుద్రుడు. ఎవడు రుద్రుడో యాతడే జనార్దనుడు. ఇట్లెరింగి యా దేవుని భక్తితో భజించువాడు పవిత్రమగు పరమపద మును పొందుచున్నాడు. మోక్షాపేక్షకునకు భగవద్భక్తి ప్రథమకర్తవ్యము. భక్తికంటె సులభోపాయము మరిలేదు, భక్తియే ముక్తికి కారణము.

శ్రుతి. కారణేన వినా కార్యం నోపైతి భక్త్యా
వినా బ్రహ్మజ్ఞానం కదాపి న జాయతే,
తస్మా త్త్వమపి సర్వోపాయాన్
పరిత్యజ్య భక్తిమాశ్రయ.

అను నారాయణోపనిషత్తు ప్రమాణము నను సరించి కారణములేక కార్య మెటుల లేదో అట్లే భక్తి లేక బ్రహ్మజ్ఞానము లభింపదు.

"జ్ఞానం వినా మోక్షో న సిద్ధ్యతి" అను శాంకరమతానుసారముగా బ్రహ్మజ్ఞానము లేక మోక్షము లభింపదు. గాన ప్రతి ముముక్షు వును ప్రప్రథమమున సర్వోపాయములను విడిచి దైవభక్తిని బూనవలయును.

సీ. నారాయణుని దివ్య నామాక్షరములపై
గరగని మనములు కఠినశిలలు
మురవైరి కథలకు ముదితాశ్రు రోమాంచ
మిళితమై యుండని మేను మొద్దు
చక్రికి మ్రొక్కని జడునియాదలనున్న
కనక కిరీటంబు కట్టె మోపు
మాధవార్పితముగా మనని మానవుసిరి
వనదుర్గచంద్రికా వైభవంబు

గీ. కైటభారిభజన గలిగియుండనివాడు
గాలిలోన నుండి కదలు శవము
కమలనాభు పదము గననివాని బ్రతుకు

పసిడికాయలోని ప్రాణి బ్రతుకు.

✦

బండిని రోడ్లవెంట వేగముగా బరుగిడజేసినచో బాటయందలి ధూళి యంతయు మనలనే గప్పును. అట్లే నీ యాతృతను వృద్ధిచేసినచో నీకే వ్యాధి కలుగజేసికొందువు.

—టికింగ్ ట్వావో నుండి.

# శ్రీ వాసుదేవ మననము

## ద్వితీయ వర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

"అదెట్లన.—

"ప్రభవౌ సర్వవిద్యానాం సర్వజ్ఞౌ జగదీశ్వరౌ, నాన్య సిద్ధామల జ్ఞానం గూహమానౌ నరేహితైః। అథోగురు కులేవాస మిచ్ఛంతావుపజగ్మతుః। కాశ్యం సాందీపనిం నామహ్యవంతిపురవాసినం। యథోప సాద్యతౌ దాంతౌ గురౌ వృత్తి మనిందితాం। గ్రాహయంతా వుపేతౌ స్మ భక్త్యా దేవ మివా దృతౌ॥" (భాగ. 10-45-30, 31, 32.) "అథోసర్వ విద్యానాం ప్రభవౌ ఉత్పాదకౌ। సర్వజ్ఞౌ జగదీశ్వరాదపి తౌ। అనన్యసిద్ధం। గురూపదేశం వినాస్వతస్సిద్ధమమల మప్రతిహతం జ్ఞానం। నరేహితైః (నర + ఈహితైః) నరచేష్టితైః। గూహమానౌ ప్రచ్ఛాదయంతౌ। లోక సంగ్రహార్థం విద్యాగ్రహణార్థం గురుగృహేవాసమిచ్ఛంతౌ। కాశ్యం కాశ్యగోత్రజం। కాశ్యజాతంవా। అవంతిపురవాసినం సాందీపన్యాఖ్యం గురుంహేతి ప్రసిద్ధతయా ఉపజగ్మతుః। తౌయథాయథావత్ సమిత్పాణిత్యాది ప్రకారేణతం గురుముప సాద్య ప్రాప్య। దాంతౌ జితేంద్రియౌసంతౌ అనిందితాం నిర్దుష్టాం గురౌవృత్తిం గ్రాహయంతౌ అన్యాన్ శిక్షయంతౌ। ఆదృతౌ ఆదరయుక్తౌ గురుణాపి బుద్ధిప్రకర్షా త్సమ్మానితౌ। వాసుదేవ మివభక్త్యా గురుముపేతౌస్మ। సేవితవంతౌ॥" (అన్వితార్థ ప్రకాశిక)

సర్వ విద్యానాం ప్రభవౌ = సకల విద్యలకు మూలకారణమై, సర్వజ్ఞౌ = సర్వజ్ఞులై, జగదీశ్వరౌ అపి = సర్వజగంబులకును నియామకు లైనను, న-అన్యసిద్ధం. అనన్యసిద్ధం = గురూపదేశము లేకయే తమకు స్వభావసిద్ధమైన, అమలజ్ఞానం = అప్రతిహతమైన జ్ఞానమును, నరేహితైః = మానవ చేష్టలచేత, గూహమానౌ = ఆచ్ఛాదనము చేయుచున్నవారై, లోక సంగ్రహార్థం = లోకులకు సన్మార్గమును బోధించుట కొఱకు; విద్యా గ్రహణార్థం=విద్య నభ్యసించుటకొఱకు, గురుగృహేవాస మిచ్ఛంతౌ = గురుకుల వాసము జేయ గోరుచు, కాశ్యం = కాశ్యప గోత్రజుండును కాశీపురమునందు జన్మించిన వాడును, అవంతి పుర వాసినం = అవంతిపుర నివాసియునగు, సాందీపన్యాఖ్యం గురు = సాందీపనియను పేరం బ్రసిద్ధుడైన సద్గురుని గూర్చి, హేతి = ప్రసిద్ధముగ నుపసదనము చేసిరి. తౌ = ఆ బలరామకృష్ణు లుభయులును, యథా = విధ్యుక్తప్రకారముగ సమిత్పాణులై, తం గురుం ఉపసాద్య = సాందీపనియను సుప్రసిద్ధుండైన సద్గురుని పొంది,

దాంతౌ = జితేంద్రియులై, అనిందితౌ౦ = నిర్దుష్టమైన, గురౌవృత్తిం = సద్గురు విషయమై చేయందగిన యుపచారమును, గ్రాహయంతౌ = తాము చేయుట పూర్వకముగ నితరులకు బోధించుచున్న వారగుచు, ఆదృతౌ = గురుని సమ్మానించు వారును, తమ బుద్ధి విశేషము వలన గురునిచేతం గూడ సమ్మానింప బడిన వారునై దేవమివ = భగవంతునియందు వలె, భక్త్యా=పరమ ప్రేమతో, గురుం = సాందీ న్యాఖ్య సద్గురుని, ఉపేతౌస్మ = సేవించిన వారైరి. "శా॥ ఉర్విన్ మానవు లెవ్వరైన గురువాక్యోద్యుక్తులై కాని త। త్పూర్వా రంభము సేయ బోలదనుచున్ బోధించు చందంబునన్। సర్వజ్ఞత్వముతో జగద్గురువులై సంపూర్ణులై యుండియున్। గుర్వంగీకరణంబు సేయజని రా గోవిందుడున్ రాముడున్" "తస్మాత్సర్వ ప్రయత్నేన గురుపాదం సమాశ్రయేత్॥" (యోగశిఖ ఉ. 6-23) అందు వలన సమస్త ప్రయత్నముల చేతను సద్గురు పాదముల నాశ్రయింపవలయును:

"పరోపదేశ పాండిత్యం సర్వేషాం సుకరం నృణాం। ధర్మేస్వేయ మనుష్ఠానం కస్యచిత్సు మహాత్మనః॥" పరులకు ధర్మములనుపదేశించుట బహు సులభము. ఇతరులకు ధర్మోపదేశమును జేయుటయందు సర్వజనులకును పాండిత్యము శరవేగమున బయలుదేరును. స్వధర్మానుష్ఠానమునందు నిష్ఠగల మహాత్ముడు మాత్ర మరుదై యుండును. "గురవో బహవస్సంతి శిష్య విత్తాపహారకాః। తమేకం దుర్లభం మన్యే శిష్య హృత్తాపహారకం॥" పరమ భాగవతోత్తముల వలెను మహావేదాంతుల రీతిని తత్త్వజ్ఞానుల భంగిని సర్వసంగ పరిత్యాగుల చందమునను నటించుచు తన్మూలమున శిష్య ధనాపహారణమే ముఖ్య జీవనోపాధిగ నేర్పఱచుకొని దేశ మంతట ద్రిమ్మరుచు నజ్ఞాన లోకమునుండి ధనము నాకర్షించుచు వారిని భ్రమప్రమాదములకు లోనుగాజేయు జ్ఞానశూన్యులైన నామమాత్ర గురువేషధారు లిక్కాలమున పెక్కురు గలరు. కాని "గుశబ్దస్త్వంధకారస్స్యాద్రుశబ్ద స్తన్నిరోధకః। అంధకార నిరోధిత్వాద్గురు రిత్యభిధీయతే॥" (అద్వయతారక. ఉ.) 'గు' అను శబ్దముచేత అంధకారము సూచింప బడుచున్నది. 'రు' అను శబ్దముచేత అంధకార నివర్తకమైన తేజస్సు సూచింప బడుచున్నది. కనుక అంధకార నిరోధకమైన తేజస్సు 'గురుః' అను సంజ్ఞచే సంభవింపబడు చున్నది. ప్రస్తుతమున శిష్యుని ఆవరించియున్న అజ్ఞానాంధ కారమును సుబోధిత జ్ఞానరూప తేజస్సుచేత నశింపజేసి శిష్యుని హృదయతాపమును నివర్తింపజేయ సమర్థుడైన మహాత్ముడే ఆ తేజస్స్వరూప సద్గురువని శ్రుతి ప్రతిపాదించు చున్నది. "గుం అజ్ఞానం రుణద్ధీతి నాశయతీతి గురుః" అజ్ఞానము నంతమొందించు నతడు గురువని వ్యుత్పత్త్యర్థము. శిష్యహృత్తాపహారుడగు సద్గురువు వేల సంఖ్యలలో నొక్కడు మాత్రమే యుండును. అట్టిమహాత్ము డతి దుర్లభుడని భావింపవలయును. "జటిలో ముండీ లుంఠితకేశః కాషాయాంబర బహుకృత వేషః। పశ్యన్నపిచ న పశ్యతిమూఢో హ్యుదర నిమిత్తో బహుకృతవేషః॥" (తోటకాచార్యః) జడలు గలవాడైనను కాషాయ వస్త్రములచేత విశేషముగ కల్పింపబడిన రూపము గల వాడైనను మూఢుడనగా "దేహవర్ణాశ్రమ కర్తృత్వ భోక్తృత్వా ద్యహంకారభావనా రూఢో మూఢః॥" (నిరాలంబ. ఉ.) దేహవర్ణాశ్రమ కర్తృత్వభోక్తృత్వాదుల యందు

ఆత్మాత్మీయత్వ భావముతో పరిపూర్ణుడై ఆత్మ జ్ఞాన శూన్యుడైన యవివేకి "పశ్యన్నైవతన్న పశ్యతి" (బృ. 4-3-23) జగదాకార వివర్త సత్యవస్తువును సర్వదా చూచుచున్నవాడై నను తత్త్వమును గ్రహింపజాలకున్నాడు. తానెవరో బ్రహ్మమెవరో తెలియ నేరకున్నాడు. ఎట్టి వైరాగ్యము చేతనో కాషాయాంబర జటాధారణాదుల స్వీకరించు వాని నిట్లననగునా యన విస్తృతమగు నీ లాంఛనము ఉదరపోషణ నిమిత్తమే గదా! "పఠంతి వేదశాస్త్రాణి బోధయంతి పరస్పరం। నజానంతి పరంతత్త్వం దర్వీ పాకరసంయథా" వేదశాస్త్రములను పఠించుచున్నారు. ఒకరికొకరు బోధించుచున్నారు. అయినను పాకరసగ్రహణ మెఱుంగజాలని గరిటెవలె పరబ్రహ్మ తత్త్వగ్రహణ పారీణులు గాజాలకున్నారు. "కుశలో బ్రహ్మవార్తాయాం వృత్తిహీనః సురాగ్యపి। న సజ్ఞానీ నాఽపియోగీ కేవలో దుఃఖభాగసౌ" (తేజోబిందు ఉ. 1-46) పరబ్రహ్మతత్త్వమును గూర్చి పలువిధముల నేర్పుతో నుపన్యసింప గలిగినను అఖండాకారాకారితవృత్తిగలవాడు గాక రాగద్వేషాద్యంతః కరణవృత్తి పరిపూర్ణుడైన పురుషుడు కేవల దుఃఖభాగుడే యగును కాని జ్ఞానియు గాజాలడు, యోగియు గానేరడు. "తేఽప్యజ్ఞానతయానూనం పునరాయాంతి యాంతి చ" (తేజోబిందు. ఉ. 1-46) అట్టి యజ్ఞాను లీ సంసారమునందు గమనాగమనముల నవిచ్ఛిన్నముగ బొందుచుందురు. "విషయావిష్టచిత్తానాం విష్ణ్వావేశః సుదూరతః" విషయములయందత్యంత సక్తమైన చిత్తముగల వారలకు ఆత్మ విజ్ఞాన మతిదూరము, "అనుభూతం వినామూఢో వృథా బ్రహ్మణిమోదతే। ప్రతిబింబిత శాఖాగ్ర ఫలాస్వాదన మోదవత్" (మైత్రేయ. ఉ. 2-22.) ఆత్మసాక్షాత్కారము ననుభవించకయే వేదాంతశాస్త్ర పఠన మాత్రమున బ్రహ్మానుభవ జ్ఞానమును బొందినట్లు మూఢుడు వ్యర్థముగా సంతోషించుచున్నాడు. అది నీటియందు ప్రతిఫలించిన తరు శాఖాగ్రస్థ ఫలమును చూచి తా ననుభవించి నటుల ఆనందించెడి అవివేకియొక్క సంతోషము వంటిదే యగును. "జ్ఞానహీనం గురుం ప్రాప్య కుతో మోక్షమవాప్నుయాత్। భిన్న నావాశ్రయో స్తబ్ధో యథాపారం న గచ్ఛతి" సముద్ర తరణము కొఱకు శిథిలతరణి నాశ్రయించి సముద్రమును దరింపనేరక మున్నీటమునిగిన మూఢుని వడువున భవమహార్ణవ తరణము కొఱకు, జ్ఞానహీను డగుటవలన నంధప్రాయుడును, అనుష్ఠాన శూన్యుడగుటవలన పంగుప్రాయుడును, ఆత్మజ్ఞానానుష్ఠానములు రెండును గలిగియుండని వాడగుటవలన స్వరూపోజ్జీవన కారి కానటువంటి జడుడును అగునట్టి కుహనా గురువు నాశ్రయించి యజ్ఞానులు ఆత్మజ్ఞానము నెట్లు పొందగలరు? సంసార సాగరమున సదా మునుగుచు తేలుచునుందురుగాని యెన్నటికిని జ్ఞానము సిద్ధించదు, ముక్తులు గాజాలరు. కనుక బ్రహ్మవిద్య నభ్యసించుట కొఱకు సత్యవస్త్వనుభవజ్ఞాన శూన్యులైన కుహనా గురువుల నాశ్రయించిన ప్రయోజనము లేదు. "అర్కేచేన్మధువిందేత కిమర్థం పర్వతం వ్రజేత్" ఊరి ప్రక్కనున్న జిల్లేడు చెట్లయందే తేనె లభించు నెడల బర్వతారణ్యములం గూర్చి బోవ బనియేమి? "త్రిజగతి సజ్జన సంగతి రేకాభవతి భవార్ణవ తరణే నౌకా" (పద్మపాదం) ముల్లోకముల యందును సత్పురుష సహవాస మొక్కటియె సంసార దుస్తర ఘోర పారావార సంతరణమున నోడయగుచున్నది.

సత్పురుషు డనగా "నకామకర్మ బీజానాం యస్యచేతసి సంభవః। వాసుదేవైక నిలయః సవై భాగవతోత్తమః" (భాగ. 11-2-50) కామమన విషయ భోగాభిలాష. తన్నిమిత్త కములును, జీవుల పునశ్శరీర గ్రహణహేతు భూతములు నగు పుణ్యా పాపకర్మ బీజములకు ఉత్పత్తి యెవని చిత్తమునందు గలుగదో, ఎవ్వనిచిత్తము వాసుదేవునికి మాత్రమే ఆశ్రయమై సదా వర్తించుచుండునో అనగా నిరంతర కేవల పరబ్రహ్మ నిష్ఠం దగిలి యుండునో అట్టి అకామహతుడైన శ్రోత్రియుడే పరమ భాగవతోత్తముడైన సత్పురుషుడని శ్రీమద్భాగవత వచనము. "మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽ మోఘశ్చ" (నారదభక్తి. సూ. 39) అట్టి మహాత్ముల సహవాసము బహు దుర్లభము. అగమ్యము. అమోఘము నగును. అనగా అట్టి మహాత్ముల సాంగత్యము లభించుటయె కడు దుర్లభము. అట్టి మహాత్ముల సహవాసము ప్రాప్తించినను వారిని గుర్తించి గ్రహించుట మిక్కిలి దుర్లభము. అట్టి మహాత్ముల సహవాసము లభించి వారిని గుఱుతుపట్టి తెలిసికొనజాలకున్నను వారితోడిసాహచర్యము మాత్రము వ్యర్థము గానేరదు. అమోఘ ఫల ప్రదమగును. అట్టి మహాత్ములు స్వభావసిద్ధముగ సర్వదా లోకమునకు శ్రేయోదాయకులు గనే యుందురు. లోకబాంధవుడైన భాస్కరుని జనుపాంధుడు గ్రహించ జాలకున్నను ఎండలో నిలువబడిన వానికి చలి దూరమగును. అట్లే మహాత్ములను గుర్తించి గ్రహింపజాలకున్నను వారి సహవాసముచే అజ్ఞాన మంతరించును. ఆత్మానంద మనుభూతమగును. సత్సాంగత్యమే ముక్తికి నిధానము. "సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం। నిర్మోహత్వే నిశ్చలతత్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః" (శంకరాచార్యః) జ్ఞానుల సహవాసము లభించెనా కామినీకాంచనాదులయందు ప్రేమానుబంధము వీడును. ఆ ప్రేమానుబంధము వీడెనా సంసార వ్యామోహము విడుచును. సంసారమునందు వ్యామోహము విడిచెనా నిశ్చల పరతత్త్వ జ్ఞాన ముదయించును. ఆ పరతత్త్వ జ్ఞానము యొక్క నిత్యనిరంతర నిష్ఠచేత జీవన్ముక్తి సిద్ధించును. "యదాపుణ్య విశేషేణ లభతే సంగతిం సతాం। మద్భక్తానాం సుశాంతానాం తదా మద్విషయా మతిః। మత్కథాశ్రవణే శ్రద్ధా దుర్లభా జాయతేతతః। తతస్స్వరూప విజ్ఞాన మనాయాసేన జాయతే" (భక్త పారిజాతము) అనేక జన్మసమనుష్ఠిత పుణ్యపుంజ విశేష పరిపాక వశమున నా భక్తులును సుశాంతులునగు సత్పురుషుల యొక్క సాంగత్య మెన్నడు లభించునో అప్పుడు నాయందనన్య భక్తిప్రయుక్త బుద్ధికలుగును. అంతట నాయొక్క కథాశ్రవణాదికము నందు దుర్లభమగు శ్రద్ధజనించును. అటు తరువాత స్వస్వరూప విజ్ఞాన మనాయాసముగ నధిగతమగును. దానం జీవన్ముక్తి తటస్థించును. "సకల వేద శాస్త్ర సిద్ధాంత రహస్యం జన్మజన్మాభ్యస్తాత్యంతోత్కృష్ట సుకృత పరిపాక వశాత్సద్భిః సంగోజాయతే। తస్మాద్విధినిషేధ వివేకోభవతి। తతస్సదాచార ప్రవృత్తిర్జాయతే। సదాచారాదఖిల దురితక్షయో భవతి। తతస్సద్గురుకటాక్ష మంతఃకరణ మాకాంక్షతి। తస్మాత్సద్గురు కటాక్షలేశ విశేషేణ సర్వసిద్ధయ స్సిధ్యంతి। సర్వబంధాః ప్రవినశ్యంతి। శ్రేయోవిఘ్నాస్సర్వే ప్రలయం యాంతి। సర్వాణిశ్రేయాంసి స్వయమేవాయాంతి। యథా జాత్యంధస్యరూప జ్ఞానం నవిద్యతే తథా గురూపదేశేన వినా కల్పకోటి

శ్తైరపి తత్త్వజ్ఞానం నజాయతే। తస్మాత్సద్గురు
కటాక్షలేశ విశేషాణా చిరాదేవ తత్త్వజ్ఞానం
భవతి। యదాసద్గురు కటాక్షోభవతి తదాభగవ
త్కథాశ్రవణ ధ్యానాదౌ శ్రద్ధాజాయతే।
తస్మా ద్ధృదయస్థితానాది దుర్వాసనాగ్రంథి
వినాశోభవతి। తతోహృదయ స్థితాః కామా
స్సర్వే వినశ్యంతి। తస్మాద్ధృదయ పుండరీక
కర్ణికాయాం పరమాత్మావిర్భావో భవతి।
రా వైష్ణవీ భక్తిర్జాయతే। తతో
వైరాగ్య ముదేతి। వైరాగ్యా ద్బుద్ధివిజ్ఞానా
విర్భావోభవతి। అభ్యాసాత్తజ్జ్ఞానం క్రమేణ
పరిపక్వం భవతి। పక్వ విజ్ఞానా జీవన్ముక్తో
భవతి" (మ, నా. ఉ. 5 అ.) సమస్త వేద
శాస్త్ర సిద్ధాంత రహస్యము అనేక జన్మముల
యం దవిచ్ఛిన్నముగ నభ్యసింపబడిన దగుట
వలన నా యత్యంతోత్కృష్ట సుకృత పరిపాక
వశమువలన సత్పురుష సహవాసము సమ
కూడును. సజ్జన సహవాసము వలన విధినిషేధ
వివేకజ్ఞాన ముదయించును. అంతట సదాచార
ప్రవృత్తి కలుగును. సదాచారము వలన సకల
దురితక్షయ మగును. అంతట నిర్మలమైన అంతః
కరణము సద్గురు కటాక్షము నాకాంక్షించును.
సద్గురు కటాక్షలేశ విశేషముచేత సర్వసిద్ధులు
సిద్ధించును. భావిజన్మ బీజములై సర్వకర్మ బంధ
ములు సంపూర్ణముగ నశించును. పొందదగు
పరమ పురుషార్థ ప్రాప్తికి రాదగు విఘ్నము
లన్నియు విశేషముగ నివర్తించును. సకల సుభ
ములు స్వయముగ చేకూరును. జాత్యంధునకు
రూపజ్ఞానము కలుగని విధమున బ్రహ్మవిద్గురుని
బోధన వినాగా అనంతకోట్ల కల్పములకైనను
తత్త్వజ్ఞానము తెలియబడదు. అందువలన
సద్గురు కటాక్ష లేశముచేతనే ఆత్మజ్ఞాన మచిర
కాలమున అనుభూత మగును. అదెట్లనగా
సద్గురు కటాక్ష మెప్పుడు కలుగునో అప్పుడు
భగవత్కథా శ్రవణాదులయందు శ్రద్ధ జనిం
చును. భగవత్కథా శ్రవణధ్యానాదుల వలన
అనాదిగ హృదయము నధిష్ఠించి యున్న దుష్ట
ములగు వాసనాగ్రంథు లన్నియు దూరీకృతము
లగును. అంతట మానసస్థితములై యున్న మనో
రథములన్నియు నిశ్శేషముగ నశించును. అందు
వలన బరిశుద్ధమైన యంతఃకరణము నందు పర
మాత్మా విర్భావము (పరోక్షజ్ఞానము) కలు
గును. అంతట దృఢతరమైన వైష్ణవ భక్తి
యంకురించును. అపుడు తీవ్రమైన వైరాగ్య
ముదయించును. తీవ్రవైరాగ్యము వలన బుద్ధి
యందు పరమాత్మ విజ్ఞానావిర్భావము (ఆత్మా
పరోక్షజ్ఞానము) కలుగును. నిదిధ్యాసనాభ్యా
సము వలన క్రమముగ నాయపరోక్షజ్ఞానము
పరిపక్వ మగును. పరిపక్వ పరమాత్మ విజ్ఞానము
వలన జీవన్ముక్తుడగును". అని శ్రుతిస్మృతులు
బోధించు చున్నవి. "మహత్సేవాంద్వార
మాహుర్విముక్తేః। తమోద్వారం యోషితాం
సంగిసంగమ్॥" (భాగ. 5-5-2.) "వామా
హేమాది విషయ వాంఛలయం దత్యంత సక్తు
లగు కాముకుల సంగంబు నిరయరూపంబైన
సంసారద్వారము. మహాత్ముల సేవ మోక్ష
ద్వారము" అని బంధమోక్ష నిదానము ప్రతి
పాదింప బడినది. "సంసారేఽస్మిన్ క్షణార్థోఽ
పి సత్సంగశ్శేవధిర్నృణాం। యస్మా దవాప్యతే
సర్వం పురుషార్థ చతుష్టయం" (భాగ.
11-2-30) "ఏ సత్సాంగత్యమువలన పురుషార్థ
చతుష్టయము సర్వము సంప్రాప్త మగు
చున్నదో అట్టి సత్పురుష సహవాసము ఈ
ప్రపంచమునం దొక్క యరక్షణ కాలము
లభించినను మానవులకది పరమానంద ప్రద
మగు పెన్నిధి ప్రాప్తియె"యని చెప్పబడు

చున్నది. కనుక విధ్యుక్త స్వధర్మానుష్ఠాన విహీనులును వేదశాస్త్ర దైవద్విజాదులయందు ద్వేషులును ("ద్విజత్వం విధ్యనుష్ఠానాత్ విప్రత్వం వేదపాఠతః। బ్రాహ్మణ్యం బ్రహ్మ విజ్ఞానాత్ ఇతి వేదాంత డిండిమః" స్వవర్ణాశ్రమధర్మాచరణపరుడే ద్విజుడు. స్వాధ్యాయ ప్రవచన కుశలుడే విప్రుడు. బ్రహ్మవేత్తయే బ్రాహ్మణుడు.) స్వధర్మ నిర్వహణమునం దభిప్రాయమే లేక సంసారలంపటత్వము చేత విషయాసక్తులు నగుచు విముక్తిమార్గం బెఱుంగక, వర్తమాన కాలమున విరివిగ ప్రకటితములై సులభసాధ్యము లగుచున్న వేదాంత గ్రంథములను స్వయముగ నించుకించుక పఠించి యంతమాత్రముననే తాము కృతార్థులై నటుల నిశ్చయించుకొని బ్రహ్మజ్ఞులమని చెప్పుకొనుచు పరులకు దత్త్వోపదేశముల జేయుచు, జ్ఞానుల చందమున యోగుల భంగి యతీశ్వరుల రీతిని మునీశ్వరుల విధమున సాధువులవలె నుదర పోషణార్థమైన బహుకృత వేషముతో ధన సంపాదనమే ముఖ్యవృత్తిగ దేశమున సంచరించుచు అజ్ఞానులైన ప్రజలను భ్రమప్రమాదముల పాలుజేయుచుండు తమ్ము దామెఱుంగని కుటిల వర్తనుల సంసర్గము దుస్సంగమగును. "భగ్నా కృషేర్భాగవతా భవంతి" = అన్ని కృషులు భగ్నమైనవారు భాగవతులయ్యెదరు. భాగవత వాలకముతో లోకమును మోసము చేయుచుందురు. "దుస్సంగః సర్వథైవ త్యాజ్యః॥" (నారదభక్తి. సూ. 3-10) అట్టి దుస్సంగము అనగా దుర్జనసంసర్గము సర్వ విధముల చేతను వర్జనీయము. "యాత్యేవాభక్త సంసర్గాదుష్టాత్సర్పాద్య థానరః॥" మనుష్యుడు దుష్టోరగమును జూచి దూరముగ పాఱిపోవు రీతిని ముముక్షువు దుస్సంగమునకు దూరముగనే యుండవలయును" అనున్యాయమున ఆస్తికులు బుభుత్సువులు ముముక్షువులు నగు పురుషులు ఖ్యాతి లాభ పూజల నపేక్షించు కుహనా గురువుల సహవాసము నెన్నడు నపేక్షింపక వారి నుపేక్షించుటయె మిక్కిలి శ్రేయస్కరము. ఎన్నడు నట్టివారిచెంత జేరి ఆశ్రయింపంజనదు. "గురుకరుణ యైవనావా ప్రాక్తన భాగ్యానుకూల మారుతయా। దుస్సహదుఃఖ తరంగస్తుంగస్సంసార సాగర స్తీర్ణః॥" (అద్వైతతారావళి. 27) దుస్సహదుఃఖములనెడి ఉత్తుంగ తరంగసంకులమైన సంసారసముద్రమును, బహుజన్మార్జిత పుణ్యమనెడి యనుకూల వాయుసహాయముతో సద్గురు కటాక్షమనెడి తరణి సాంగత్యముననే తరింపవలయును. "న తపాంసి నతీర్థాని నశాస్త్రాని జపోనహి। సంసారసాగరోత్తారే సజ్జనా సేవనంవినా॥" (యోగవాశిష్ఠము.) సద్గురు సంశ్రయమును, సేవయువినాగా తపస్సులు తీర్థములు శాస్త్రములు జపములును సంసారసాగరము నుత్తరించుటయందు సాధనములు గానేరవు. "రామోహం జనయత్యేవ రామోహమితి ధీర్నచేత్ । స రామోహమితి జ్ఞాతుం న రామ స్సజ్జనాంతికే॥" శ్రీరాముడ నేనెయనెడి అప్రతిబద్ధ శేముషి సిద్ధించని యంతవఱకు పత్నీపుత్ర ధనాదిసంసారము మోహమును కలుగజేయుచునే యుండును. ఆ శ్రీరామాత్మైకత్వజ్ఞాన సంపాదనార్థము సద్గురు నాశ్రయింప బోవుదము' అనెడి శాస్త్రము ననుసరించి శ్రోత్రియుడును త్యక్త సర్వైషణుడును ఆశాపాశ విముక్తుడును మనోలయ వాసనాత్యాగ పూర్వకముగ నిరంతర పరబ్రహ్మ నిష్ఠుడును అగు సద్గురువునే ఆశ్రయించి వారి సాన్నిధ్యముననే బ్రహ్మవిచారణజేసి ఆత్మానుభవమును పొందవలయును. (సశేషము)



# లక్ష్యసిద్ధి

'చింగ్' అను రాజుగారి వడ్రంగి సంగీతవాద్యముల దగిలించు చిలుకకొయ్య నొకదానిని జేయుచుండెను. అది అసాధారణ ప్రతిభాసమన్వితమై యుండుటవలన నెందరో దానిని జూడ వచ్చుచుండిరి. వారెల్లరు 'ఇది మానవసృష్టికాదు. దైవికమే' అని చెప్పుకొనువారు. ఈ మాట విన్న రాజకుమారుడు 'లూ' 'మీ పనియందేమి విచిత్రము గలదు?' అని వడ్రంగి నడిగెను.

వడ్రంగి: విచిత్రమేమియు లేదు గాని ప్రభూ! ఒక్క విషయము మాత్రము చెప్పవలసి యున్నది. నేను ఆ చిలుకకొయ్యను చేయుచున్నంతవఱకును నాలోని ప్రాణశక్తి కొంచెమయినను తక్కువపడక (సంపూర్ణముగా) నున్నదా యని చూచుకొనువాడను. మొట్టమొదట నా మనస్సును శాంతిమయముగా జేసికొందును. మూన్నాళ్లు గడచుపర్యంత మిట్లే యుండి ఆపైన ఈ కార్యమువలన నాకు గలుగనున్న లాభాలాభముల సంపూర్ణముగ మఱచిపోవుదును. అయిదు దినములయిన పిదప దానివలన నాకు రాగల కీర్తినిగూడ మఱతును. ఇట్లే ఏడుదినములకు నా శరీరము అవయవములు—వీనినన్నిటిని సంపూర్ణముగా విస్మరింతును. ఆ పిదప మీ దర్బారు మాటగూడ జ్ఞాపకమే యుండదు. అప్పుడే నా నేర్పరితనము ఏకాగ్రతను బడయును. అపుడు నాకు కలతనొందింపగల విషయ మణుమాత్రమును నుండదు. అంతట లోయల దరినున్న అడవికి బోవుదును. మంచి చెట్టును వెదకుదును. ఆ చెట్టున నేను గోరు రూపమున్నదా యని జూచుకొందును. నేను చేసినపిదప నెట్టి రూపము గావలయునని తలంతునో ఆ రూపము ఆ చెట్టున గోచరించుచున్నదా యని పరీక్షింతును. అట్లు గోచరించిన వెంటనే నే నా కార్యము నారంభింతును. ఇదియే విషయము. స్వభావసిద్ధమయిన నా నేర్పును ఈ చెక్కలమీద జూపుచుందును. నా కార్యములందు దేనిని దైవికమని చెప్పుకొనుచున్నారో దానికంతటికి నిదియే కారణము.

—(చువాంగ్ ట్జి – చీనాదేశపు ట్వావో మతగ్రంథమునుండి)

# గ్రంథసమీక్ష

**చతుశ్శ్లోకీగీతా - భాగవతము**

సైజు: డెమ్మీ ⅛ పుటలు: 28. వెల: ఆరు అణాలు. సమీకరణ – సమర్పణ: "శ్రీ. శేషి". ప్రకాశకులు: వాసుదేవ గ్రంథమాల, శ్రీ వాసుదేవాశ్రమము, ఆలపాడు (పోష్టు), గుంటూరు జిల్లా.

యాతనామయమైన జీవితములోబడి ఆత్మశాంతిని అభిలషించు ముముక్షువులకు దివ్య తత్త్వజ్ఞాన గవేషణకు శ్రీ భగవద్గీత భాగవతమువంటి పెద్ద పెద్ద గ్రంథములను చదువుటకవకాశము సంకుచితము. ఇట్టివారి సంకుచితావకాశములో గీతారహస్యమును భాగవత మహిమను తెలిసికొనెడి సౌకర్యార్థముగా "శ్రీ శేషి" గారు సమీకరించి సమర్పించిన చతుశ్శ్లోకీగీతా - భాగవతము ఇది. నిత్యమనన సమునకు అత్యంతోపయోగకరమైనది.

సర్వమతాంతర సమన్వయ సిద్ధికొరకు తద్వారా లోకాభ్యున్నతికి శ్రీ వాసుదేవ గ్రంథమాల చేయుచున్న సేవ కొనియాడ దగినది.

+

### యజ్ఞఫలము

అనువాదకులు: విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వరులు, బి. ఏ., ఆంధ్ర పండితులు, పి. ఆర్. కాలేజి, కాకినాడ. సైజు: డెమ్మీ 1/8 పుటలు: 120. వెల: రెండు రూపాయలు.

తొలిసారి భారతి 1952, ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ సంచికలయందు ప్రకటితమైన దిది.

శ్రీమద్రామాయణ కథ ననుసరించి వ్రాయబడిన శతాధికములగు రూపకములలో యజ్ఞఫలమొకటి. ఏడంకముల నాటకము. దశరథుని యజ్ఞఫలముగా శ్రీ రామావతారము, విశ్వామిత్రుని యజ్ఞఫలముగా శ్రీ రామాస్త్ర పరిగ్రహణము, జనకుని యజ్ఞఫలముగా శ్రీ సీతారాముల కల్యాణము ఈ నాటకకథా వస్తువులు.

రాజవైద్య జీవరామ్ కాళిదాసశాస్త్రిగారు 1941 వ సంవత్సరములో సంస్కృత "యజ్ఞఫలము" వ్రాతప్రతిని పరిశోధించి ప్రకటించుచు ఏతద్గ్రంథ గవేషణలో కృతికర్త గోత్రనామాదులు కానరాకపోయినను భాసకృతమని భాసించుచున్న ప్రతిమాభిషేకాది పదుమూడు నాటకముల కెక్కువ సాజాత్యమున్న యజ్ఞఫలము భాసకృతమే యని నిర్ణయించినారు.

భాసుని జీవచరిత్ర సాధకమగు అంశము లేవియు నిన్న నేటివరకు చిక్కలేదు. ఇంతియగాక 'ఇది భాసకవికృత'మని చెప్పుకొనదగిన గ్రంథ మొక్కటియు లభించలేదు. ఇట్టి విషమస్థితిలో మరికొందరు పరిశోధకులు (డాక్టరు ఎ. డి. పులస్కర్, శ్రీ గోపాలదత్తశాస్త్రిగారు మొదలగువారు) బయలుదేరి యజ్ఞఫల కర్తృత్వమునుగూర్చి వాదప్రతివాదనలు కావించుకొనుచున్నారు. ఇక అనువాదకులును ఈ నాటకము భాసునిదే యనుటకు శ్రీ పులస్కరు మున్నగువారు తెలిపిన హేతువాదమును విపులీకరించారు.

భాసునివని చెప్పబడుచున్న యితర నాటకములతో సాజాత్యమందియున్నంతమాత్రమున నిది భాసకృతమని చెప్పనొప్పదేమో! భాస రచనా విన్యాసమును విధానమును శైలిని అనుసరించి భాసుని అడుగుజాడలలో అన్యులెవరైనను రచియించుటకుకూడ అవకాశ ముండగలదు.

యజ్ఞఫల నాటక కర్తృత్వవిషయమైన శుష్కవాదనలను పరిశోధక మహాశయులకే విడిచి పాఠకలోకము అనువాద స్వారస్యమును అనుభవించెదరుగాక! శ్రీ బులుసువారి నాటకానువాదములలో రసపుష్టి కలిగిన ఉత్తమోత్తమ నాటకము యజ్ఞఫలము.

---

**శ్రీ శారదాదేవి జన్మతిథిపూజ: సోమవారము 8-12-1952**

**మఠమున బహిరంగోత్సవము: ఆదివారము 14-12-1952**

సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి; శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు

శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 20-11-52.

# విషయసూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

## చందాదారులకు

౧. పత్రిక ప్రతిమాసము 20-వ-తేదీన వెలువరింపఁబడును. ఒక వారము, పదిరోజులు చూచి ప్రతి మీకు అందకపోయినయెడల ఉత్తరము వ్రాయుఁడు.

౨. సంవత్సర చందా రు. 3 లు మాత్రమే. జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని చందాదారులుగఁ జేరవచ్చును. ఇతర మాసములలోఁ జేరఁదలచు వారికి జనవరి నెల నుండిగాని జూలై నెల నుండిగాని సంచికలు చేర్చిపంపఁబడును. విడిప్రతి రూ. ౦—౬—౦ లు. హిగిన్‌బాదంస్ వారి స్టాలులోఁగాని, మా పత్రిక ఏజెంటును గాని అడుగుఁడు.

3. ఉత్తర ప్రత్యుత్తరములు వీలైనంతవఱకు ఇంగ్లీషున వ్రాయుచు మీ చందాదారు సంఖ్య నుదాహరింపుఁడు. ఉత్తరములను "మేనేజరు, శ్రీరామకృష్ణప్రభ" అను చిరునామాకు వ్రాయుఁడు.

౪. చిరునామాయందు ఎట్టిమార్పు గలిగినను 10-వ తారీఖునకు ముంగుగా మా కార్యాలయమునకుఁ దెలుపవలయును. లేనిచో, పత్రిక పూర్వపు చిరునామాకే పంపఁబడును.

## వ్యాసకర్తలకు

౧. కేవలము నైతిక ధార్మిక వైజ్ఞానిక విషయకములైన వ్యాసములేకాక, సాహిత్యమునకును కవిత్వమునకును సంబంధించిన ఏ వ్యాసములైనను బంపవచ్చును. సులభ సుందరమగు గ్రాంథికభాషలో వ్రాయవలయును.

౨. వ్యాసములు అచ్చులో మూఁడు పుటలకు మించరాదు. ప్రతినెల మొదటి తేదీకి వ్యాసములు మాకు అందవలెను.

3. వ్యాసములను, విమర్శకుఁ బంపు గ్రంథములను, వినిమయముగఁ బంపెడి పత్రికలను "సంపాదకుఁడు, శ్రీ రామకృష్ణ ప్రభ శ్రీ రామకృష్ణ మిషన్ స్టూడెంట్స్ హోమ్, మైలాపూరు, చెన్నపురి" అను చిరునామాకు వ్రాసి పంపవలెను.

౪. వ్యాసము తిరుగఁ బంపఁబడవలయుననుచోఁ దగు పోస్టేజి చేర్చి పంపవలయును.





# శ్రీరామకృష్ణ ప్రభ



సంపుటము ౯ ౧౯౫౨ – డిసంబరు : : నందన – మార్గశిరము సంచిక ౬

శ్రీ కృష్ణపరబ్రహ్మణేనమః

## శ్రీ రా ధా స్తు

〃 నమస్తే పరమేశాని రాసమండలవాసిని
రాసేశ్వరి నమస్తేఽస్తు కృష్ణప్రాణాధిక ప్రియే! ౧

〃 నమ స్త్రైలోక్యజననీ ప్రసీద కరుణార్ణవే
బ్రహ్మవిష్ణ్వాదిభిర్దేవై ర్వంద్యమాన పదాంబుజే! ౨

శ్లో. నమ స్సరస్వతీరూపే నమ స్సావిత్రి శంకరీ
గంగా పద్మావతీరూపే షష్ఠి మంగళచండికే! ౩

శ్లో. నమస్తే తుళసీరూపే నమో లక్ష్మీస్వరూపిణీ
నమో దుర్గే భగవతీ నమస్తే సర్వరూపిణీ! ౪

శ్లో. మూలప్రకృతి రూపాత్వం భజామః కరుణార్ణవాం
సంసారసాగరాదస్మా నుద్ధరాంబ దయాంకురుః. ౫

〃 ఇదం స్తోత్రం త్రిసంధ్యంయః పఠేద్రాధాం స్మరం నరః
న తస్య దుర్లభం కించిత్కదాచిచ్చ భవిష్యతి. ౬

〃 దేహాంతేన వసేన్నిత్యం గోలోకే రాసమండలే
ఇదం రహస్యం పరమం న చాఖ్యేయంతు కస్యచిత్.

—బ్రహ్మవైవర్తపురాణము, శ్రీకృష్ణజన్మఖండము.

ఓం నమో భగవతే శ్రీ రామకృష్ణాయ!

# శ్రీ రామకృష్ణ వచనామృతము —'మ.'

## దక్షిణేశ్వర దేవాలయమున అంతరంగభక్తులతో గురురూపి శ్రీ రామకృష్ణుడు

సోమవారము,
17 డిశంబరు, 1883.

అది ఉదయము ఎనిమిది గంటల వేళ. శ్రీ రామకృష్ణ గురుదేవుడు తన గదియందు చిన్నమంచముమీద గూర్చొనియుండెను. రాఖాల్, లాటు మున్నగు భక్తులును నచట నుండిరి. 'మ.' క్రింద గూర్చొనియుండెను. డాక్టర్ మధుబాబు వచ్చియుండెను. ఆయన గూడ శ్రీ గురుదేవుని మంచముమీద గూర్చొనెను. ఆయన వృద్ధుడు, మంచి రసికుడు. శ్రీ రామకృష్ణ గురుదేవునకు ఆరోగ్యభంగము కలిగినపుడంతయు ఆయనవచ్చి వైద్యముచేయుచుండును.

శ్రీరామ:—ముఖ్యమయిన విషయమిదియే. మనమెల్లరమును ఆ సచ్చిదానందవస్తువుమీద ప్రేమను కలిగియుండవలయును. ఎట్టి ప్రేమ? ఎట్లు ఆ ప్రభువును ప్రేమించుట? గౌరీపండితు డిట్లు చెప్పెడివాడు: "శ్రీరామచంద్రుని దెలిసికొనవలయునన్నచో మనము సీతాదేవిగా మారిపోవలయును. భగవంతుని దెలియవలయునన్నచో భగవతిగా మారిపోవలయును. అనగా భగవతి శివునికొఱకెట్టి కఠోరతపస్సొనరించెనో అట్టి తపము చేయవలయును. పురుషుని దెలిసికొనవలయునన్నచో ప్రకృతిభావమును ఆశ్రయింపవలయును: సఖీభావము, దాసీభావము, మాతృభావము—ఇట్టివి?

నేను సీతామూర్తిని దర్శించితిని. ఆమె మనస్సంతయు శ్రీరామచంద్రునియందే లగ్నమైయుండెను. తన కాలుసేతులు, బట్టలు, నగలు—వీనియందే దానిమీదను ఆమె దృష్టి ప్రసరింపలేదు. జీవితమంతయు రామమయమయినట్లుండెను. రాముడువినా ఆమె బ్రదుకదేమో యన్నట్లుండెను.

'మ.':—ఆమె రామోన్మత్త.

రామ:—ఉఁ, నిజమే, ఆమె రామోన్మత్తయే. రామలాభార్థము మన మున్మత్తులము కావలయును. మనస్సు కామకాంచన లగ్నమైనచో, ఇట్టియవస్థ కలుగదు. కామినీగమనమున నేమి యానందము గలదు? భగవద్దర్శనము కలిగినచో ఈ సుఖమునకంటె కోటిమడుంగుల యానందమును బడయగలుగుదువు. గౌరీపండితు డిట్లు పలుకువాడు: "మహాభావమును బొందినచో శరీరమునందలి ప్రతిఛిద్రమును రోమకూపముల పర్యంతము మహాయోనిగా పరిణమించును. ఈ ఛిద్రములన్నింటిలో ప్రతిదానివలనను ఆత్మతోడి సంభోగ సౌఖ్యము ననుభవింపవచ్చును. భగవానుని అత్యంతవ్యాకులభావస్థులమై పిలువవలయును.

భగవల్లాభ మెట్లు బడయగలమన్న విషయ మును గురువునొద్ద నేర్వవలయును. గురువు పూర్ణజ్ఞానియైననేకాని సరియైన మార్గమును జూపజాలడు. పూర్ణజ్ఞానము కలిగినచో నెట్టి వాసనయు నుండదు. పంచవర్ష ప్రాయుడగు బాలకుని స్వభావ మతనికి గలుగును. దత్తాత్రేయునకును జడభరతునకును నిట్టి బాలక స్వభావము కలిగియుండెను.

'మ.':—వీరినిగూర్చియే కొంత వఱకు మనము దెలిసికొనగలుగుచున్నాము. కాని యిట్టివారు మరియెందరు జన్మించిరో వారిని గూర్చి ప్రపంచ మెఱుగనే యెఱుగదు గదా!

శ్రీరామ:—అవును, జ్ఞానికి సమస్తవాసన లును నశించును. ఏదయిన వాసన మిగిలి యున్నను దానివలన ఆయన కే హానియు కలుగదు. స్పర్శవేది నంటినచో ఖడ్గము బంగా రముగా మారిపోవును. అపు డా ఖడ్గ మెట్టి హింసయు చేయదు. అట్లే జ్ఞానియందు కామ క్రోధములు కనిపించినను అవి నామమాత్రా వశిష్టములే యగును. వానివలన నెట్టి యరిష్ట మును గలుగబోదు.

'మ.':—జ్ఞాని త్రిగుణాతీతుడని తమరు సెలవిచ్చియుంటిరిగదా! అత డే గుణములకును వశీభూతుడుగాడు. సత్త్వరజస్తమములన్నింటికి నతీతుడు. ఈ మూడు గుణములును ముప్వురు దొంగలవంటివి.

శ్రీరామ:—వీనినన్నింటిని మనస్సున చక్కగా ధారణచేయవలయును.

'మ.':—పూర్ణజ్ఞానులు పృథ్వియందు ముప్వురు నలువురకంటె నెక్కుడుగా కని పించరు.

శ్రీరామ:—ఎందువలన? ఉత్తరప్రాంత మఠములం దెందరో సాధుసన్న్యాసులు గలరే?

'మ.':—చిత్తము, నేనుగూడ అట్టి సన్న్యాసిని కాగలను.

రామకృష్ణ గురుదేవు డీ పలుకు విని ఏకదృష్టితో కొంతకాలము 'మ.' వైపు చూచెను. అటుపిమ్మట 'మ.' తో: 'వీనినన్నిం టిని విడిచియా? మాయాపాశము వీడనిచో నేమి ప్రయోజనము? మాయను జయింపని వాడు సన్న్యాసియైనంతమాత్రమున ప్రయో జనమేమి? (అందరును కొంతసేపూరకుండిరి.)

'మ.':—చిత్తము, త్రిగుణాతీత భక్తి యెట్టిది?

శ్రీరామ:—ఏ భక్తివలన సమస్తమును చిన్మయస్వరూపముగా గనిపించునో అదియే త్రిగుణాతీతభక్తి. చిన్మయశ్యాముడు, అతని నికేతనము చిన్మయము, భక్తుడు చిన్మయుడు— సమస్తమును చిన్మయమే. ఇట్టి భక్తి ఏ కొలది మందికో కలుగును.

డాక్టర్ మధు:—త్రిగుణాతీతభక్తి యనగా భక్తుడు ఏ గుణములకును వశీభూతుడు కాకుం డుట.

శ్రీరామ:—అవును, ఐదేండ్ల పసిబాలు డెట్టి గుణములకును నెట్లు వశీభూతుడు కాకుం డునో అట్లుండుటయే.

మధ్యాహ్న భోజనానంతరము శ్రీ రామ కృష్ణ గురుదేవుడు కొంతకాలము విశ్రాంతి తీసికొనెను. పిదప మణిలాల్ మల్లికుడు వచ్చి శ్రీవారికి నమస్కరించి, క్రింద గూర్చొనెను. 'మ.' కూడ క్రిందనే కూర్చొనియుండెను.

రామకృష్ణ గురుదేవుడు శయనించియే మణిలాలుతో నపుడపుడు ఒకటి రెండు మాటలు మాట్లాడుచుండెను.

మణిలాల్:—మీరు కేశవసేనుని జూడ వెళ్లితిరా?

శ్రీరామ:—అవును, ఆయన ఇపుడెట్లు న్నాడు?

మణిలాల్:—ఆయనకు కొంచెమయినను నయమనిపించ లేదు.

శ్రీరామ:—అతడు మిక్కిలి రాజసికుడుగా కనిపించుచున్నాడు. ఆయనను జూడబోయి నప్పుడు ఎంతోసేపు కాపెట్టుకొని నిలువవలసి వచ్చినది. ఆ పిదపనే ఆయనను సందర్శింప గలిగితిని.

శ్రీ రామకృష్ణ గురుదేవుడు లేచి కూర్చొని భక్తులతో కొంతకాలము మాటాడ నారంభించెను.

శ్రీరామ:—('మ.' తో) రామునికొఱకై నాకున్మాదము కలిగెను. ఒకానొక సన్న్యాసి నాకొసగిన రామలాలా (శైశవ రామచంద్రుని) విగ్రహము దీసికొని తిరిగెడివాడను. దానికి నీళ్లుపోయుట, అన్నముపెట్టుట, శయనింపజేయుట—ఇట్లు సమస్తము చేయువాడను. ఎందుబోయినను సరియే ఆ విగ్రహమును నాతో తీసికొనిపోవువాడను. 'రామలాలు' కొఱకై నాకు ఉన్మాదావస్థ కలిగినది.



"సమస్తము భగవంతునిదే, ఆతడే నా ప్రియుడు, నే నాతని ప్రేమింతును, కామింతును" అని భక్తుడు పల్కును. అంతయు భగవానునిదే కావున విశ్వమంతయు ఆతనికి పవిత్రమై కన్పట్టును. ఆతనికి అందఱును భగవానుని బిడ్డలే, భగవచ్ఛరీరమే, భగవత్స్వరూపమే. అట్టిచో భక్తుడు ఎవ్వనికిగాని హానిచేయుట అసాధ్యముగదా. ఎవ్వనినిగాని, ఏ జీవజంతువునుగాని ప్రేమింపకుండుట అసంభవముగదా! ఇట్టి విశ్వేశ్వర ప్రేమతో విశ్వమానవప్రేమ కలుగుననుట నిక్కువము. పరమేశ్వరుని సమీపించినకొలదియు సర్వము పరమేశ్వరునందే సంస్థితమైయున్న దని బాగుగా గ్రహింపనారంభింతుము. ఇట్టి పరమప్రేమను—పరభక్తిని—బడసినంతనే సర్వభూతములందును భగవానుని దర్శింప నారంభింతుము. అపుడు మన హృదయము శాశ్వత ప్రేమఝరియై విరాజిల్లును. ఈ ప్రేమ వికాసము చెందినకొలదియు ప్రాపంచిక భేదము లన్నియు అదృశ్యము కానారంభించును; మానవుడు ఇక మానవుడుగా గాన్పింపడు, సాక్షాద్భగవత్స్వరూపుడై గన్పట్టును; జంతువు కేవలము జంతువువలెగాక జగదీశ్వరుడై కన్పట్టును; పులిగూడ నిక పులిగాదు, సాక్షాత్పరమేశ్వరస్వరూపము. ఇటు లీ పరమభక్త్యవస్థలో ప్రతి మానవుని, ప్రతిప్రాణిని, ప్రతిభూతమును భక్తుడు ఆరాధించును.

—శ్రీ వివేకానందస్వామి



# శ్రీ శారదాదేవి

కీ. శే. శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావు

"ఈ దేవాలయమందలి దేవతయగు జగన్మాత—ఈ శరీరమును కని, ప్రస్తుతము నహాబత్తులో నివసించుచున్న తల్లి—ఆమెయే నా పాదము లివ్వి యొత్తుచున్నది. జగన్మాతృస్వరూపిణిగ మిమ్ము భావింతును." ఒకనాడు దక్షిణేశ్వర దేవాలయమున తన పాదసేవచేయుచు, "మీరు నన్నెట్లు భావింతురు?" అని శ్రీ శారదాదేవి అడిగినప్పుడు, ప్రత్యుత్తరముగ భగవాన్ శ్రీ రామకృష్ణులు పలికిన మాట లివి.

నవయుగ ప్రవర్తకమైన శ్రీ పరమహంస దేవునిచే నిట్టి మన్ననలనొందిన సాధ్వీరత్నము శ్రీ శ్యామసుందరీ, రామచంద్రముఖోపాధ్యాయులను ఆదర్శనీయ బ్రాహ్మణ దంపతులకు వారి బహుజన్మతపఃఫలముగ, 1853-వ సంవత్సరాంతమున కలకత్తాకు నించుమించుగ అరువదిమైళ్లదూరమునగల జయరాంబటి గ్రామములో జన్మించెను. వీరెంత దయార్ద్రహృదయులో, సనాతనధర్మదీక్షాబద్ధులో మనము గ్రహించుటకొక నిదర్శనమే చాలును. 1864 లో వంగరాష్ట్రమును పీడించిన క్షామరాక్షసికి జయరాంబటికూడ బలియయ్యెను. వందలాదిగ జనులు కూడు గుడ్డలులేక మలమల మాడిపోవుచుండిరి. ఆ నిరుపేదలు లెక్కకుమించిన తండోపతండములుగ తనయింటికి నిత్యము వచ్చినప్పుడు, గాదెలోగల ధాన్యమునెల్ల స్వార్థ మణుమాత్రము పాటింపక ఆ దుర్భిక్ష పీడితజనుల క్షుద్బాధా నివారణార్థము విని యోగపఱచిన పరోపకార ధురీణుడు, రామచంద్రుడు. ఇట్టి ధర్మకార్యములయందు తల్లిదండ్రుల కెంతో సాయపడి, చిన్ననాడే వారి సుగుణసంపద నలవరచికొనిన మానినీమణి, శ్రీ శారదామణి. ఈరీతిగ నాంగ్ల విద్యావిశారదకాకపోయినను, జగద్వ్యాప్తమైన రామకృష్ణధార్మికోద్యమమును నిర్వహింపగలుగుటకు ఆవశ్యకమైనయోగ్యత నీమెయార్జించుచుండెను.

రెండేండ్ల శిశువుగనుండినప్పుడు, శారదను చేతులందిడుకొని శ్యామసుందరీదేవి సిహారు గ్రామదేవత జాతరను జూచుటకు వచ్చెను. అచ్చటికి నిరువదేండ్లప్రాయముగల శ్రీ రామకృష్ణుడు మఱికొందరు యువకులతోగూడ నరుదెంచెను. అట్టి తీర్థములకుబోయెడి యాత్రికులేసత్రముననో విశ్రాంతికొఱకు గుమికూడి కూర్చుండుట పరిపాటి. ఇట్లు సిహారులో వీరందరు సమావేశమైనప్పు డచ్చటి అమ్మలక్కలు చిన్నిపాపయగు శారదకు ఆయువకులనుజూపి, 'అమ్మా! వీరిలో నీ వెవరినిపెండ్లియాడెదవమ్మా?' యని అడిగిరట. అంత శారద తన వ్రేలితో శ్రీ రామకృష్ణుని జూపెనట. నిజముగ నిదియే, యీ దివ్యదంపతుల వివాహనిశ్చితార్థముహూర్తము!

ఇక మనదృష్టి నించుక శ్రీ పరమహంస దేవుని స్వగ్రామమగు కమార్పుకూరునకు మరలింపవలయును. దక్షిణేశ్వర దేవాలయమున తీవ్రాధ్యాత్మికసాధనలవలన తనకుమారుని శరీరారోగ్యముతోపాటు మనస్స్వాస్థ్యముకూడ చెడినదనువార్తను విని, చంద్రాదేవి స్వగృహమునకు రామకృష్ణుని రప్పించెను. యౌవనప్రాయుడైన ప్రియపుత్రుని వర్తనను కొలది నాళ్లు కనులారజూచి, తాను కర్ణాకర్ణిగ వినినంత వైపరీత్యమందేమియు కనుపడకపోయినను, శీఘ్రముగ నాతనికి వివాహముచేసినచో నాతని శారీరక, మానసికారోగ్యమున కెట్టి ప్రమాదమును వాటిల్లుట కవకాశము కలుగదనియెంచి, తగినకన్యను వెదకుటకై యామెతన పెద్దకొమరుని రామేశ్వరునినియమించెను. కాని, వీరెచ్చటకుపోయినను, వీరి శక్తికిమించిన కన్యాశుల్కములను తమతమ పుత్రికలకు వారి తల్లిదండ్రులడుగుటచే, తన తల్లియును, అన్నయును మిగుల నిరాశాపూరితులై యుండుట గ్రహించి, శ్రీరామకృష్ణుడే, తనకు సహధర్మచారిణిగ నుండుటకు భగవంతుడు నిర్ణయించిన కన్య జయరాంబటిలో రామచంద్ర ముఖోపాధ్యాయునియింట గలదని, అచట ప్రయత్నించినయెడల వారి సంకల్ప మీడేరునని సూచించెను. అట్లే వారి ప్రయత్నము కొనసాగి, జగత్కల్యాణసూచకమగు శారదారామకృష్ణుల కల్యాణమహోత్సవము 1859 వ సంవత్సరము 'మే' నెలలో జయరాంబటియందు జరిగెను.

భార్యవిషయమున భర్త నిర్వహింపవలసిన విధాయక ధర్మమేమి యని యెవరో యొకరడిగినప్పుడు, ఆమె కాత్మవికాసమును కలుగజేయుట యని శ్రీ రామకృష్ణుడు బదులు చెప్పెను. స్వవిషయమున ఈ ధర్మమును ఆయన ఆదర్శప్రాయముగ నిర్వహించెను. దీపమును చక్కచేయుట మొదలుకొని మహోన్నతాధ్యాత్మికసాధనయగు నిర్వికల్పసమాధి వరకుగల యిహపర కార్యకలాపమునంతయు తన సతీమణియగు శారదామణికి ఆయన బోధించెను. ఇంతేకాదు, జగత్సృష్టి, స్థితి, లయకర్త్రియగు పరశక్తిగ నామెను నెలకొల్పి, షోడశీపూజచేసి తనజపఫలమునేకాక, తనను, తన సర్వస్వము నామెకు ధారవోసెను. దీనిని బట్టి యామె మహిమాతిశయ మెట్టిదో మనము గ్రహింపవచ్చును. ఒకసారి శ్రీ రామకృష్ణుని సమక్షముననే, ఆయనబంధువు హృదయు డామెపట్ల నిరసన భావముతో ప్రవర్తించినపుడాయన అతని నిట్లు మందలించెను: ''నీవు నన్ను తఱచుగ చులకనచేయుచుందువు. కాని, యామె విషయమున నీ విట్లు ప్రవర్తింపకూడదుసుమా. ఈ శరీరమందున్న జీవాత్మ ఆగ్రహించినచో నీకు రక్షణకలుగవచ్చును కాని, యామె యాత్మ నొచ్చుకొని, కోపగించినచో, బ్రహ్మ, విష్ణు మహేశ్వరులుకూడ నిన్ను రక్షింపజాలరు.''

శ్రీ రామకృష్ణుని దివ్యశక్తులనన్నిటిని నివురుగవిసిన నిప్పువలె శ్రీ శారదాదేవి హృద్గతముగావించికొని, సమయము వచ్చినప్పుడు భక్తులశ్రేయస్సుకొఱకు ప్రదర్శించుచుండెను. విశ్వమాతృప్రేమ విషయమున తన ఘనతరవ్యక్తిత్వము నామె చాలసారులు ధృవపరచెను. ఒకప్పుడు కర్తాభాజ వైష్ణవ శాఖకుజెందిన యొక స్త్రీవచ్చి, తనను భార్యగ స్వీకరింప పరమహంసను వేడుకొనెను. అందుపై నాయన బిగ్గరగా పరుషోక్తులాడుచు, నామెను గద్దించుచుండెను. అప్పుడు దక్షిణేశ్వర దేవా

లయమున నహబత్తులో నివసించుచుండిన శ్రీ మాతృదేవి యాకేకలనువిని, బయటకువచ్చి చూచి యాసంఘటనను పూర్తిగ గ్రహించి, తనయెదుట తన కుమార్తె యవమానము పాలైనప్పుడు నొచ్చుకొను తల్లివలె సిగ్గుపడి, "చూడుము! ఆమె యేమైన అవివేకముగ ప్రవర్తించినచో నిట్లు తిట్టుటకు మారుగ నామె నాయన నాకడకు బంపియుండవచ్చునే" అని చెప్పి గోలప్‌మాయిని బంపి యామెను తన బసకు రప్పించి మిక్కిలి దయతో నాదరించి, "అమ్మాయీ! నీ యునికి యాయనకు కష్టముగ తోచినయెడల, నీవు నాయొద్దకు రావచ్చు నమ్మా!" యని ఆమె నోదార్చెను.

1886 వ సంవత్సరములో పరమహంస దేవుని నిర్యాణానంతరము శారదాదేవి హైందవాచారము ప్రకారము తన చేతిగాజులను దీసివేయుటకు బ్రయత్నించుచుండినప్పుడు శ్రీ రామకృష్ణు డామెకు గనుపడి, "ఏమి నీవు చేయుచున్నపని? నే నొక గదిలోనుండి మరియొక గదిలోనికి వెళ్లినానేకాని మరణింపలేదు." అని యభయమిచ్చెను. ఇటుతరువాత వలసినప్పుడెల్ల శ్రీ రామకృష్ణుని దివ్యదర్శనమునుబడసి, ప్రతివిషయమున నాయన యభిమతమును శారదాదేవి గ్రహింపగలుగుచుండెను. ఈ కారణమున వివేకానందస్వామి మున్నగు సుప్రసిద్ధ శిష్యులు రామకృష్ణధార్మికోద్యమ నిర్వహణము విషయమున నేపనినైన చేయ దలపెట్టినప్పుడు శ్రీమాతృదేవికి దానిని తెలిపి యామెసలహాను గైకొనెడివారు. అమ్మగారును శ్రీ రామకృష్ణుని శిష్యులను, భక్తులను తన సొంతబిడ్డలవలెనే చూచెడివారు. ఒకసారి కోల్పరా ఆశ్రమాధిపతి తన యాశ్రమమందు శిక్షణమందుచుండిన బ్రహ్మచారులు శారదాదేవి నివాసమునకువచ్చి, పరిపూర్ణ మాతృవాత్సల్యముతో నామెయిడిన మృష్టాన్నముల రుచిమరగి తాను చెప్పినమాటవినుట లేదని, వారికి తగురీతి బుద్ధిచెప్పి తనకడకు పంపుడని కోరినప్పుడు, సర్వసంగపరిత్యాగులై రామకృష్ణ శరణాగతులయిన భక్తులపట్ల తమ మాతృవాత్సల్య మామె యిట్లు వెల్లడించినారు: "మీ రెంత అవివేకముగ ప్రసంగించుచున్నారు! మా ప్రధాన దృక్పథము ప్రేమ తప్ప వేరేదియుకాదు. ఈ ప్రేమద్వారముననే శ్రీ రామకృష్ణుల పారమార్థిక కుటుంబము సర్వతోముఖముగ పెరిగి, వికసించుచున్నది. ఇంతేకాక, ఆ కుటుంబమునకు నేను తల్లిని. కనుక, వారి అన్న, వస్త్రవసతులను నా సమక్షమందు విమర్శించుటకు మీకేమి అధికారము కలదు? ఆహా! నా బిడ్డలకొఱకై శ్రీ గురుదేవుని సన్నిధిని నే నెంత విలపించి, ప్రార్థించితిని! అందుచేతనే మీకు నే డెల్లయెడల శ్రీ వారి దయావిశేషములును, మతములును కనుబడుచున్నవి. శ్రీవారి నిర్యాణానంతరము వారి ముఖ్య శిష్యులు స్వల్పకాల మొకచోట గలసియుండి, పిమ్మట నొక్కొక్కరు స్వతంత్రించి దేశాటనముచేయ నారంభించిరి. ఈ దృశ్యము నాకెంతో దుఃఖము కలిగించినది. శ్రీగురుదేవునకిట్లు మొఱపెట్టితిని: ఓ ప్రభూ! మీరీభూమిపై నరరూపమున నవతరించి, మీ జీవితమును కొలదిమంది శిష్యులతో గడపితిరి. ఇప్పుడు మీ నిర్యాణముతో సర్వమును పూర్తియైనదా? అట్లైనచో, బహుకాయక్లేశకారణమైన మీ మానవావతారమునకు అగత్యమేమి? కాశీ, బృందావనములలో బిచ్చమెత్తి జీవించుచు, చెట్లనీడల నాశ్రయించి కాలముగడపు సాధువుల నెందరినో నేను చూచితిని. ఆ రకము

సాధువులు లెక్కకు మీరియున్నారు. కాని, మీకొఱకై సర్వము త్యజించిన నాబిడ్డలొక కబళమన్నముకొరకై తిరుగులాడుట నేను చూచి సహింపజాలను. ఓ ప్రభూ! అన్న వస్త్రములకై వారు కష్టపడకుండునట్లు మీరు చూడవలయునని నా ప్రార్థన * * *'' దీనినిబట్టి శ్రీ రామకృష్ణ ధార్మికోద్యమ నిర్వహణమునం దీమె యెంత బాధ్యతవహించెనో పాఠక మహాశయులకు విశదముకాగలదు.

బీదజనులయం దెంత దయ, ఆదరము శ్రీ మాతృదేవికి కలదో యీ క్రింది సన్నివేశము ఋజువుచేయగలదు. అది మాధ్యాహ్నిక పూజాసమయము. సరిగా ఆవేళకు బహుదూర ప్రాంతమునుండి కొందరు పురుషులును, మువ్వురు స్త్రీలును ఆమె దర్శనార్థమువచ్చిరి. కలకత్తాకు వచ్చుటకు పైకమును వారు యాచించి, సంపాదించిరి. వీరిలో నొకపురుషుడు అమ్మగారితో రహస్యముగ మాటలాడుచుండెను. ఆ ప్రసంగమునకు అంతుకనుపడదయ్యెను మాధ్యాహ్నికపూజకు కాల మతిక్రమించుచుండెను. పూజను శ్రీ మాతృదేవియే చేయవలసియుండెను. "ఉద్బోధన" కార్యాలయవాసులకిది మిక్కిలి ఆయాసకరముగ నుండినందున, వారిలో నొకరాభక్తునితో "మీరేమైన నింకను చెప్పదలచినచో, మీరు క్రిందికిదిగివచ్చి, అచ్చటి పెద్దస్వాములతో మాట్లాడవచ్చును.'' అని హితవొసంగిరి. అందుపైని అమ్మగారు "పూజకు కాలాతిక్రమణమైనందున ప్రమాదమేమియు లేదు. వారు చెప్పదలచినది నేను తప్పక వినవలయును.'' అని యించుక తీవ్రముగబలికి, యా పురుషుని ప్రసంగమును మిక్కిలి యోరిమితో వినుచునే యుండిరి. ఆతనికి కొన్ని యుపదేశములను జేసి, యాతని భార్యనుగూడ మేడమీదకు తోడ్కొనిరమ్మనిరి. వారు స్వప్నములో నేదో యొక పవిత్రమంత్రోపదేశము నొందిరని యచ్చటివారికి తరువాత తెలియ వచ్చెను. ఇంచుమించుగ నొక గంటయైన తరువాత వారు శెలవుగైకొని వెళ్లినపిమ్మట, "అయ్యో! వీరెంత బీదవారు. ఎంతో కష్టపడి వారిచ్చటకు వచ్చిరి.'' అని శ్రీ మాతృదేవి తమ దయార్ద్రహృదయమును వెల్లడించిరి.

తమ నిర్యాణమునకు అయిదునాళ్లు ముందుగ, 'అన్నపూర్ణతల్లి' యని చెప్పబడు నొక భక్తురాలు తమ్ము చూడవచ్చెను. అప్పుడు శ్రీ మాతృదేవి గదిలోనికి నెవరినిగాని పోనిచ్చుట లేనందున, నామె అమ్మగారిగది గుమ్మముకడ కూర్చుండెను. ఆమెను జూచి, అమ్మగారు తమదగ్గరకు రమ్మని సంజ్ఞచేసిరి. ఆమె లోనికిబోయి శ్రీ మాతృదేవికి ప్రణమిల్లి, "అమ్మా! ఇటుతరువాత మాగతి యేమగునో?'' అని వెక్కి, వెక్కి బిగ్గరగ నేడ్వసాగెను. "నీకు భయమెందుకు? నీవు శ్రీగురుదేవుని దర్శించియుంటివే.'' అని కొంతతడవూరకొని అమ్మగారు, "అయినను నేను నీకొక విషయమును చెప్పుచున్నాను. నీవు మనశ్శాంతిని కోరునెడల, ఇతరుల విషయమున తప్పులు పట్టకుము. అంతకంటె, నీ తప్పులనే చూచుకొనుచుండుము. ఈ ప్రపంచమునెల్ల నీ సొంతముగ గ్రహింప నేర్చుకొనుము. ఇందు పరాయులెవరును లేరు. ఈ ప్రపంచమంతయు నీ సొంతము!'' అన్నపూర్ణతల్లికేకాక, ప్రపంచమునకుగూడ శ్రీ శారదాదేవి యొసంగిన కట్టకడపటి సందేశము బహుశః ఇదియే.



# మానసబోధ

బాలకవి శ్రీ ఓరుగంటి నారాయణప్ప

(సెప్టంబరు సంచిక తరువాయి)

తే॥ గీ॥ మాయభోగాలకై పుట్టిʒమరలగిట్టి ; యెన్నిజన్మాల బాసితో ʒ యెంచలేను
మాయకై జన్మశతములʒమాడ్చి యుంటి ; బలియొనర్చితి వజ్ఞానʒబలము మనస॥ 25

తే॥ గీ॥ దేవదేవునిగూడంగ ʒ తెగువజేసి ; సద్గురుప్రోక్తమంత్రాన ʒ సదమలాత్మ
నంది సచ్చిత్సుఖంబున ʒ నలర నాత్మ; బలియొనర్పుమ యీజన్మ ʒ పరగ మనస॥ 26

తే॥ గీ॥ నీవు గల్గినశాంతికి ʒ నెలవులేదు ; నీవు లేకున్న బ్రహ్మమే ʒ నిలుచు మదిని
నీదు సఖ్యత జగమయి ʒ నెగడుగాదె ; దలపు మమనస్కమవుటకు ʒ తాల్మిమనస॥ 27

తే॥ గీ॥ నిత్యసుఖముననుండెడి ʒ నిర్మలాత్మ ; కేమొ కొంగ్రొత్త సుగుణము ʒ లేర్పరచగ
బాహ్యమున వాంఛ విషయాల ʒ ప్రబలజేసి ; దుఃఖమేదెచ్చికూర్తువు ʒ ధూర్తమనస॥

తే॥ గీ॥ ఎండమావుల జలమని ʒ యెంచిలేడి ; పరుగులిడి యసువులఁవీడు ʒ భాతినీవ
విషయ సుఖములు స్థిరమని ʒ వేగనమ్మి ; ఏల చెడెదవు బ్రహ్మమె ʒ యొసగు మనస॥ 29

తే॥ గీ॥ చక్రవర్తితనూజుడై ʒ జగతిబుట్టి ; పొందగల్గిన భోగాల ʒ పొందువిడచి
యేలజనె బుద్ధుడడవికి? ʒ నెఱుగవైతి ; ఘోరసంసారమున్ బాయʒగోరి మనస॥ 30

తే॥ గీ॥ ఆనృసింహునియెదుట ప్రహ్లాదుడనడె ; "వెఱువ నీరూపమునకేను ʒ వెఱతునయ్య !
తాపరూపక సంసార ʒ కూపమునకు ; ముక్తునిగజేయుమని" మున్ను ʒ మూఢమనస!॥31

తే॥ గీ॥ సార్వభౌముని తనయుడై ʒ జననమొంది ; చిన్నవయసున సంసృతి ʒ జెందవెఱచె
దలప ప్రహ్లాదుడిదిదుఃఖʒదాయియంచు ; దలచి మదికాదె? నీవది ʒ దెలియుమనస॥ 32

తే॥ గీ॥ అల విమానాది వాహనా ʒ లర్థిజేసి ; కీర్తి కొందఱు బొందిరి ʒ ప్రీతిగల్గి
విమల శాంతినిబొందిరే ʒ విజ్ఞులగుచు ; తత్త్వసుఖమందరెవ్వరు ʒ ధరణి మనస॥ 33

తే॥ గీ॥ పూర్వులు విమానములʒనెక్కి పోయిరవని ; ననియెడిపురాణగాథల ʒ నన్ని వినమె ?
దాని గొప్పగనెంచిరేʒదలప ఋషులు ; ఎంచి రధికంబుగా బ్రహ్మʒచింత మనస॥ 34

తే॥ గీ॥ దేని యాధారమున భువి ʒ ధీరులెల్ల ; ప్రకృతి శక్తుల గనుగొని ʒ ప్రబలకార్య
ముల నొనర్చుచు కీర్తిని ʒ పొందుచుండ్రొ ; దానిగనుగొన యత్నింపుʒధరణి మనస ! 35

తే॥ గీ॥ మునులు భౌతికసుఖముల ʒ మోసపోక ; దిగవిడచి దీనియాశను ʒ ధీరులగుచు
బ్రహ్మచింతననాయువు ʒ పరగబాసి ; ధన్యులై మాన్యులైరిల ʒ దలప మనస ! 36

తే॥ గీ॥ దైవచింతనజేయంగ ౯ దగిన కాల; దేశసత్కర్మ సత్సంగ ౯ దివ్యశాస్త్ర
దేశికులసంగమెప్పుడు ౯ వాసిగూర్పు; ప్రార్థనము జేయు దేవుని ౯ భక్తి మనస॥ 37

తే॥ గీ॥ ఘోరమజ్ఞాననిలయమౌ ౯ గుణము తమము; భోగలాలసగుణమగు ౯ బుద్ధి రజము
శాంతి విజ్ఞానదాయిని ౯ సత్త్వగుణము; శుద్ధసత్త్వంబు బ్రహ్మను ౯ జూపు మనస॥ 38

తే॥ గీ॥ ఆత్మసుఖమున కధికమౌ ౯ నట్టి సుఖము; అల చతుర్దశలోకము ౯ లందు లేదు
లేదు లేదంచు శాస్త్రము ౯ లెల్లదెల్పు; దలచి యీనుడి నాత్మను ౯ దలపు మనస॥ 39

తే॥ గీ॥ గోవుకై దూడ తల్లికై ౯ కొడుకు పతికి; సతియు దిలకింప వ్యథజెందు ౯ సరణి నీవు
ఆత్మసుఖమంద చింతింపు ౯ మనవరతము; గాంచగల్గుదు వాత్మను ౯ ఘనత మనస॥ 40

తే॥ గీ॥ వ్యాపకాత్మయె నీపొత్తు ౯ వలనగాదె; పాంచభౌతిక దేహాన ౯ పట్టువడియె
జీవుడై ద్వంద్వకర్మల ౯ జేయనాయె; జీవుడే బ్రహ్మనినుబాయ ౯ స్థిరము మనస॥ 41

తే॥ గీ॥ మూడవస్థల జీవుని ౯ ముంచి తేల్చి; వివిధసంస్కారముల జేర్చి ౯ వేగిరముగ
జన్మకోటులనొసగెడి ౯ జాడ్యమీవ; నీకు జోహార్లు నిలువుమా! ౯ నిజముమనస॥ 42

తే॥ గీ॥ బ్రహ్మచింతనకై నీకు ౯ భక్తిగలుగ; వేదగురువులు సత్సంగ ౯ వితతినీకు
వెనుకసాగియొవత్తురు ౯ వేగిరముగ; నీకుధన్యత గలిగింప ౯ నిజము మనస॥ 43

తే॥ గీ॥ బ్రహ్మలోకాది సుఖముల ౯ భాగ్యమైన; బ్రహ్మసుఖమున లవలేశ ౯ మనవె శ్రుతులు
అట్టి సచ్చిత్సుఖంబును ౯ నాశ్రయింప; మరులుకొనియత్నమొనరింపు ౯ మాయమనస॥ 44

తే॥ గీ॥ మంచి చెడుగుల దెలియక ౯ మమత శిశువు; కన్నవస్తువులనుబట్టి ౯ కాంక్షసేయు
భాతి నైహికభోగాల ౯ భ్రాంతినొంది; కోరుచున్నావు నిలువక ౯ కుటిలమనమ! 45

తే॥ గీ॥ మరణభీతిని బొత్తిగా ౯ మరచినావు; తిరముగా బ్రదుకుదేనంచు ౯ దెలిసినావు
సురల కబ్బక నరులకు ౯ సులభసాధ్య; మైన పరతత్త్వమరయుమా! ౯ మంద మనస!

తే॥ గీ॥ కామరాగాది దుర్గుణ ౯ గణమడంగ; శాంత శమదమ సద్గుణ ౯ సమితిగల్గ
నెపుడు చిత్సుఖ మొదవంగ ౯ నెఱుక గలుగ; దేవదేవుని జంతింపు ౯ దినము మనస!

తే॥ గీ॥ శుద్ధమౌ దర్పణంబున ౯ జూడముఖము; ప్రతిఫలించునుగాదొక్కొ ౯ సతము నట్టె
ప్రతిఫలించును బ్రహ్మము ౯ ప్రవిమలమగు; చిత్తమున దాన శుద్ధమై ౯ చెలగు మనస॥

తే॥ గీ॥ 'ఎప్పు డెదియెట్లు జేయుట ౯ లెఱుగుదీవు; పాలకుడవీవు పాలింప ౯ బడెడివాడ
నేన' నన్బ్రోవు మెప్పుడు ౯ నిర్మలాత్మ; యనుచు బ్రార్థింపు దేవుని ౯ నర్థి మనస॥ 49

తే॥ గీ॥ కోపతాపాదులన్ భువి ౯ కుమిలి చెడక; శాంత సౌభాగ్య సదనంబు ౯ చక్కజేర
నహరహంబును పోరాట ౯ మట్టి సల్పి; కోరు మీశుని జేరంగ ౯ కోర్కె మనస॥ 50



# శ్రీ వివేకానంద స్మృతి

[భగవంతుని నెవరును జూపనేరరు. ఆ భగవద్దర్శనము ఇంద్రియగోచరము కొనిదగుటయే యిందులకు గల ప్రబలకారణము. కాని భగవత్సాక్షాత్కారము నందినవారిని మన మపుడపుడు జూడవచ్చును. వారి ఆధ్యాత్మికజీవనము, ప్రపంచమున వారు వ్యవహరించు రీతి—వీనినిబట్టి వారు భగవత్సాక్షాత్కారభాగ్యము బడసినవారని మనము తెలిసికొనవచ్చును. ఇటీవల భారత దేశమునం దవతరించిన మహాపురుషులలో శ్రీ వివేకానందులవా రొకరని సమస్త జగత్తు నెఱిగిన విషయము. ఆ మహానుభావునితో నెంత స్వల్పకాలము కలిసియున్నను ఎందరో తమ జీవిత మంతయును నిత్యనూతనము జేసికొని యున్నతస్థితికి రాగలిగిరి. అట్లు శ్రీ స్వామివారితో కలిసికొను భాగ్యమును బడసి తమ జీవితమును సంపూర్ణముగ పవిత్రముజేసికొని జీవితాంతము (1949) వఱకు శ్రీవారి గుణకీర్తనము చేయుచుండిన జోసఫీన్ మెక్లాడ్ (Josephine Macleod) ఇట్లు తన స్మృతిని వెల్లడించుచున్నది. ఈ స్మృతి పఠనమున శ్రీ స్వాములవారి మహత్త్వము, ఉదారస్వభావము అత్యద్భుతమును కూలంకషమునగు నైపుణ్యము తేటతెల్లము కాగలవు.

—సంపాదకులు.]

1895 వ సంవత్సరము జనవరి 25 వ తారీఖున న్యూయార్కు పట్టణమున 33 వ వీధి యందు 54 వ కవాటసంఖ్యగల గృహమున శ్రీ స్వాములవారిని జూచుటకై నేను నా సహోదరియును వెళ్లితిమి. శ్రీవారు కూర్చొని యుండిన గదియందు ఇరువురు ముప్పురు పురుషులును, పదునైదు లేక ఇరువదుగురు స్త్రీలును వారితో సంభాషించుచుండిరి. గదియంతయు ఆగంతుకులతో నిండిపోయినది. కుర్చీలేవియు ఖాళీలేకపోవుటవలన నేను మొదటి వరుసలో క్రింద గూర్చొంటిని. శ్రీ స్వామివారు ఒక వైపున (మూలయందు) ఏవో కొన్ని పలుకులు పలికిరి. వారేమి పలికినదియు నాకు జ్ఞాపకము లేదు. కాని తక్షణము అది సత్యమని నాకు స్ఫురించెను. రెండవ వాక్యము మూడవ వాక్యము సైతము నంతయే. నేను శ్రీవారి పలుకులను ఏడుసంవత్సరముల పర్యంతము విని యున్నాను. వారు చెప్పిన పలుకులన్నియును సత్యములైనవి. వారిని సందర్శించినప్పటి నుండియు నా జీవితము నూతనపథమును ద్రొక్కినది. అప్పటినుండియు మనలను శ్రీవారు నిత్యమునకు దీసికొనిపోయి వదలిపెట్టుచున్నట్లు గోచరించినది. అందు మార్పులేదు. అది వృద్ధిపొందజాలదు. దీని పోలిక ఒకటే—సూర్యుడు. సూర్యుని ఒకసారి చూచినచో మరల నెన్నడును మరువజాలము.

ఆ సంవత్సరము శీతకాలమంతయు శ్రీవారి యుపన్యాసములు వినియుంటిని. వారమునకు మూడుదినములు ఉదయము 11 ఘంటలు మొదలు ఉపన్యసించెడివారు. నేను శ్రీవారితో నెన్నడును మాటాడలేదు. కాని మేము శ్రీవారి యుపన్యాసములకు తప్పక వచ్చెడివారమగుట వలన మాకొఱకు రెండు కుర్చీలు అట్టిపెట్టు చుండెడివారు. ఒకనాడు వారు మమ్ముజూచి 'ఏమి మీ రిరువురును ఏకోదరులా ?' అని యడిగిరి. మేమును 'ఔనండి' యని ప్రత్యుత్తర మిచ్చితిమి.

శ్రీవారు:—చాలదూరమునుండి వచ్చు

చుంటిరా యేమి?

మేము:—ఎంతోదూరములేదు. ఈ హడ్సన్ నదిలో ముప్పదిమైళ్లదూరమునుండియే.

శ్రీవారు:-ఎంతదూరము! చాలఆశ్చర్యము!

ఇదియే శ్రీ స్వాములవారితోడి మా ప్రప్రథమ సంభాషణము.

నేనెప్పుడును శ్రీ స్వాములవారి యనంతరము మిసెస్ రోయిత్ లిస్ బర్గర్ (Mrs. Roeth Lis Berger) అను మహనీయురాలు మిక్కిలి ఆధ్యాత్మిక ఔన్నత్యము గలదిగా దలంతును. ఆమెయే మమ్ము శ్రీవారిదగ్గరకు దీసికొనివెళ్లెను. శ్రీవారును ఆమెకు తగిన గౌరవమొసగెడివారు. ఒకనాడు ఆమెయు మేము శ్రీస్వాములవారిదగ్గరకుబోయి 'స్వామీ ధ్యానముచేయుట యెట్లో మీరు మాకు నేర్పవలయు'నని ప్రార్థించితిమి. అందులకు శ్రీవారు ఓంకారముమీద ఒకవారము ధ్యానముజేసి యనంతరము మీ యనుభవమును నాకెఱిగింపుడు' అని పలికిరి. వారానంతరము మేమిరువురమును శ్రీవారి సన్నిధి జేరితిమి. మిసెస్‌రోయిత్ లిస్ బర్గర్ 'నాకొక జ్యోతి కనిపించుచున్నది' అని పలికెను. అది విని 'ఇంకను అభ్యసింపు'మని శ్రీవారు చెప్పిరి. 'అట్లుగాదు, నాకొక దీపకాంతివలె హృదయమధ్యమున గనిపించుచున్న'దని నేను జెప్పితిని. 'మంచిది, నీ అభ్యాసమును అట్లే జరుగనిమ్ము.' వారు నాకు నేర్పినదంతయు నింతమాత్రమే. కాని మేము శ్రీవారిని కలిసికొనుటకు పూర్వమే ధ్యానము చేయుచుండెడివారము. భగవద్గీతయంతయు మాకు కంఠస్థమైయుండెను. కావుననే కాబోలు వారియొక్క అత్యద్భుత జీవశక్తిని మేము కొంతవఱకు గుర్తింపగలిగితిమి. ఎదుటివారికి స్థైర్యము గల్పించుట యందే శ్రీవారి శక్తి పుంజీభూతమైయుండెడిదేమో. శ్రీవారికి స్వీయస్పృహ యున్నట్లే గోచరించెడిది కాదు. ఎదుటనుండినవారే వారి మనస్సు నాకర్షించుచుండిరి. 'జీవగ్రంథము తెఱచినంతనే తమాషా ఆరంభమగును' అని శ్రీవారు చెప్పుచుండెడివారు. మన జీవితము నందు వ్యావహారికమనునది లేనేలేదనియు సమస్తమును పారమార్థికమే యని మమ్ము గ్రహింపజేసెడివారు. మీరు తాత్కాలిక అమెరికా నారీమణులుగాని సార్వకాలికముగా భగవానుని వత్సలే యని మదియందు నిశ్చయముగా జ్ఞప్తినుంచుకొనుడు. రేయింబవళ్లీ విషయమును మీరు తలంచుచుండవలయును. ఇది యెన్నడును మఱువరాదు.' ఇదియే వారు మాకొసగిన యుపదేశము. వారి సందర్శనమే మామానసములకు నూతనశక్తిని రేకెత్తించెడిది. నీవా శక్తి నితరుల కీయజాలవు. ధనముండిననే మన మీయగలము. నీవూహింపవచ్చును, కాని చేయజాలవు.

నేనెన్నడును శ్రీవారితో మాటాడలేదు. వారితో మాటాడవలసిన విశేషకార్యమేదియు నుండెడిది కాదు. ఆ వసంతకాలమున ఒకనాడు రాత్రివేళ మిస్టర్ ఫ్రాన్సిస్ హెచ్ లెగెట్ వారియింటభోజనముచేయుచుంటిని. (కొన్నాళ్లపిమ్మట వీరు నా సోదరిని వివాహమాడిరి.) మేము భోజనము చేయుదుముగాని సాయంకాలమంతయు మీతో మెలగదలంపలే'దని వారితో జెప్పితిని. 'సరే ఆలాగే, భోజనము చేసి వెళ్లుడు' అని వారు పలికిరి. భోజనానంతరము 'మీ రెందులకేగెదరేమి?' అని వారు మమ్మడిగిరి. 'మేమొకానొక యుపన్యాసమునకు వెళ్లుచున్నా'మని చెప్పితిమి. 'నేను రాగూ

డదా' యని వారనిరి. 'సరే' యని మేము పలుకగా వారు వచ్చిరి. ఉపన్యాసమంతయు విని ముగియగనే శ్రీ స్వాముల వారియొద్దకు వెళ్లి కరచాలనముచేసి, 'స్వామీ మీరు మా యింటికి ఎన్నడు భోజనమునకు వత్తు'రని యడిగిరి. మా సాంఘిక జీవనమున శ్రీ స్వాముల వారికిని మాకును పరిచయము లభించినది.

కాట్స్‌హిల్ కొండలలో లెగెట్‌గారికి రిడ్జీ మేనర్ అను ఒక భవనము గలదు. అచ్చటికి శ్రీ స్వామివారు వచ్చి కొన్నాళ్లు గడిపిరి. స్వామివారు బయలు దేరుటకుముందు కొందరు శిష్యులు 'స్వామీజీ, మీరు వెళ్లరాదు. మీ పాఠములన్నియుజరుగుచున్నవి' అనిరి. శ్రీవారు వారివైపు తిరిగి గంభీరముగా 'ఆ, పాఠములా, అవి నావియా? నేను వెళ్లెదను' అని చెప్పి వెళ్లిరి. ఆ భవనమున నుండగా నా సోదరి పిల్లల తోడి పరిచయము శ్రీ స్వామివారికి గలిగెను. ఆపిల్లలకు పండ్రెండు పదునాలుగేండ్ల ప్రాయము. కొన్నాళ్ల తర్వాత శ్రీ స్వామివారు న్యూయార్కు నగరమునకు దిరిగివచ్చి మును పటివలెనే పాఠములు చెప్పుచుండిరి. అపుడు మా సోదరి బిడ్డలును వచ్చిరి. వారిని జూచి నట్లే శ్రీవారు బయలుపఱుపలేదు. ఇదేమిటి మమ్ము శ్రీవారు గుర్తింపలేదే యని వారు మమ్మడిగిరి. 'పాఠములు ముగియనిండు' అని చెప్పితిని. పాఠము ముగిసినది. శ్రీవారు మా దగ్గరకువచ్చి బిడ్డలజూచి 'ఓహో వత్సలారా మిమ్ముజూచిన ఎంత ఆనందముగా నున్నది?' అని పలికి వారిని మఱచిపోలేదన్న విషయమును స్ఫురింపజేసిరి; బిడ్డలు చాల సంతోషించిరి.

బహుశ యీ కాలముననందే ఈ క్రింద నుల్లే ఖింపబడిన సంభవము జరిగినది.

న్యూయార్కు పట్టణమునందు శ్రీ స్వామి వారు మా యథితిగా నున్నపుడు ఒకనాడు బయటికివెళ్లి తిరిగివచ్చినయనంతరము ఎంతో గంభీరముగా నుండిరి. ఎన్నియో గంటలు గడచిపోయినవి కాని శ్రీవారు ఒక్కమాట యైనను బలుకలేదు. చివరకు మేము 'స్వామీ! ఈరోజు మీరేమి చేసితిరి' యని యడిగితిమి. అందులకు శ్రీ స్వామివారు 'ఈరోజు మిక్కిలి యద్భుతమగు వింతనొకదానిని జూచితిని. ఇది యమెరికాయందే జూడనగునుగాని మరెందును వీలుగాదు. నేను ట్రాముననందు పోవుచుంటిని. నాకొకవైపున శ్రీమంతురాలు (Helen Gould) కూర్చొనియుండెను, మరియొకవైపున ఒకానొక నీగ్రో చాకలి తా నుదికిన బట్టల మూట నొడిలో బెట్టుకొని కూర్చొనియుండెను. అమెరికాలోదప్ప మరియెచట నిట్టి దృశ్యము గోచరింపగలదు?'

ఆ సంవత్సరము జూన్ నెలయందు శ్రీ స్వామివారు Parcy Camp అను స్థలమునకు వెళ్లిరి. అచట నుండగ ప్రక్కన నుండిన భూర్జరవనమునకు బోయి ఘంటలకొలది ధ్యానము చేయుచుండెడివారు. ఒకనాడు శ్రీవారు (Birch) భూర్జపత్రగ్రంథములు రెండు తయారుచేసి మాకిచ్చిరి. అందొకదానియందు సంస్కృత లిపియు, నింకొకదానియందు ఆంగ్ల లిపియు వ్రాయబడియుండెను.

నేను నా చెల్లెలు పారిస్ వెళ్లినపుడు శ్రీ స్వామివారు సహస్రద్వీపవనము (Thousand Island Park) న ఎన్నియో ఉపన్యాసములొసగిరి. అవియన్నియు అత్యంతో త్కృష్టములై నాకు గోచరించెను. ఏలనన అవియన్నియు శ్రీవారితో ఎంతగానో కలిసి మెలసి యుండిన శిష్యులకొఱకే ఉపదేశింపబడి నవి! శ్రీవారి హృదయవికాసము మరియే

యితరగ్రంథమునందును అంత చక్కగా ప్రతి ఫలించినట్లు గోచరింపదు.

శ్రీవారు లగ్గెట్టు (Leggett) తో కలిసి పారిస్ నగరమునకు వచ్చిరి. నేనును నా చెల్లెలును కలిసి ఒక హోటలునందు విడిసితిమి. శ్రీవారును లగ్గెట్టు మరియొక హోటలున దిగిరి. ఆ కాలమున లగ్గెట్టునకు ఒక సేవకు డుండువాడు. అతడు శ్రీవారిని మా యువ రాజని పిలుచువాడు. అపుడు శ్రీవారు 'నేను యువరాజును గాను. హైందవ సన్న్యాసిని' అనిరి. ఆ సేవకుడు 'మీరేమైనను జెప్పుకొన వచ్చును. కాని నే నెందరో యువరాజుల జూచి తిని. నా పనియంతయును వారితోడనే. వారిని జూడగనే గుర్తుపట్టగలను' అనెనట. శ్రీ స్వామి వారి ముఖవైఖరియు వారి ప్రవర్తనము అందర కును హృదయమున సదభిప్రాయమును కలి గించినది. 'మీరు చాల ఠీవి (dignified) గా నున్నారు' అని యొకడు వచించెను. శ్రీ స్వామి వారిట్లు చెప్పిరి: 'అది నా నడక'.

మఱుచటి మాసమున (సెప్టెంబరు 9 న) మా చెల్లెలికిని లగ్గెట్టునకును వివాహము జరిగి నది. ఆ మరునాడే శ్రీ స్వామివారు లండను నకు వెళ్లి యచ్చట E. T. Sturdy గారి యతి థులై యుండిరి. 'పాఠములు ప్రారంభింపబడి నవి. మీరు త్వరగా రండు' అని మా కచటి నుండి యుత్తరము వ్రాసిరి. మేము వెళ్లినప్ప టికే శ్రీవా రుపన్యసించుచుండిరి. 'ప్రిన్సెసెస్ హాల్' అనుచోట అసాధారణ ప్రతిభతో శ్రీవారు ఉపన్యసించిరి. ఆ మరునాడు అచటి వార్తాపత్రికలన్నియు భారతదేశమునుండి యొక యోగీశ్వరుడు లండను నగరమునకు వచ్చినట్లు ప్రకటించినవి. శ్రీవారికి అచ్చట జరిగిన ఆదరణ, గౌరవము చెప్పనలవిగావు. మేము లండనునుండి డిసంబరు పదునైదవ తారీఖున కలిసికట్టుగా తిరిగివచ్చితిమి. కొన్నాళ్లయనంతరము శ్రీ స్వామివారు అమెరికాజేరి మరల తమకార్యమును ప్రారం భించిరి. ఆ మరుసటి సంవత్సరము ఏప్రిల్ నెల లండను వెళ్లి వేదాంతసంబంధములగు పాఠ ములు కొన్ని జరుపుచు వారికార్యమునకు నిర్దిష్టరూపమును గలిగించిరి. ఇదంతయు 1896-వ సంవత్సరమున జరిగినది. వేసవికాల మంతయు నిట్లు కార్యమును కొనసాగించి జూలై నెల సేవియర్ (Sevier) కుటుంబముతో స్విడ్జర్లాండునకు వెళ్లిరి.

శ్రీ స్వాములవారి మేధాశక్తి అత్యద్భుతము. ఒకనాడు నా మేనకోడలు ఆల్బెర్టా స్ట్రర్జస్ (Alberta Struges) రోము నగరమున వివిధ ప్రదేశములను జూపుటకై శ్రీవారిని దీసికొని వెళ్లెను. అపుడు పురాతన శిలాస్థూపము లెందెం దున్నదియు ఆమెకు శ్రీవారే ముందుగాజెప్పి యామెను ఆశ్చర్యాంబుధిమగ్నను గావించిరి. సెయింట్ పీటర్స్ చర్చికి బోవునప్పటికి ఆ క్యాథొలిక్ మతచిహ్నము లన్నింటియందును శ్రీవారు గనుపఱచిన గౌరవము ఆమెకు మరింతఆశ్చర్యమును కలుగజేసెను. ఆ చర్చిలో వారు తమ మహాపురుషుల ఆభరణములు, దుస్తులు అన్నియు జూపగా వాని నన్నింటిని శ్రీవారు కండ్ల కద్దుకొనిరి. అంతట ఆమె 'స్వామీ! సాకారభగవంతునియందు నమ్మ కములేని మీరు వీని నిట్లు గౌరవించుట లేల?' అని యడిగెను. అందులకు స్వామివారు యిట్ల నిరి: 'ఆల్బర్టా! నీవు సాకారభగవంతుని విశ్వసించునపుడు మాత్రము ఉత్కృష్టమయిన వస్తువులనే భగవంతునకు అర్పింతువుసుమా!'

(సశేషము)

# కర్మయోగసారము

తలవనితలంపుగా మనకు జరుగుచున్న కష్టనష్టములనెల్ల 'అది మన కర్మము' అని తలంచుచుందుము. అనగా మనము పూర్వజన్మములలో జేసిన పనుల ఫలితములనే ఈ ప్రస్తుత జన్మమున ననుభవించుచున్నామని భావము. కాని ఈ కర్మమే మనకు మేలునుగలిగించునట్లు చేసికొనవచ్చును. పూర్వకర్మము లెట్లున్నను మన ప్రస్తుతకార్యములను మనకు మేలుకలిగింపగల సత్కర్మలగా జేసికొనవచ్చును. అట్టి సత్ప్రవర్తనవలన సౌఖ్యమును సంపాదించి మోక్షమంది బ్రహ్మానందమును బడయగలము. అది ఎప్పుడు? ఈ జన్మమున మనము ఆచరించు ప్రతికార్యమును కర్మయోగముగా మార్పగలిగినపుడే!

ఎన్నియోవిధములగు యోగములు గలవు. ఆ యోగములన్నింటియందును అత్యంతవిచిత్రమయినది కర్మయోగము. భగవద్దర్శనమునకు ఆత్మసాక్షాత్కారమునకు అడవులకు బోనవసరములేదు. గుహలలో ముక్కుమూసికొని కూర్చొననవసరములేదు. సంసారమునువదలి త్యాగులగుట అంతకంటెను అనవసరము. మానవు లెట్టిస్థితియందున్నను, ఎట్టికార్యము లాచరించుచున్నను, ఎట్టిజాతికి జెందినను స్త్రీపురుషభేదములుగూడ లెక్కింపక అందరును యోగమునందునట్లు చేయునదియే కర్మయోగము. సాధారణముగా మనముచేయు కార్యము లన్నింటిని ఆధ్యాత్మికముగా పరివర్తింప జేసికొనుటయే దీని విశేషము. అందుచేత ఈ కర్మయోగమున కర్హులు కాజాలనివారెవరు? ఎల్లరును అర్హులే.

మరియు కర్మయోగము పరమోత్కృష్టమైన బ్రహ్మానందానుభవమునకు మార్గదర్శియై యుండుటయే కాక సమస్తకార్యములను నిర్వర్తింపవలయు సక్రమ మార్గమును సూచించుచుండును. ఐహిక జీవితసంబంధమును విడువకయు, ఎట్టిపనులు చేయవచ్చును? ఎట్టిపనులు చేయరాదన్న విచక్షణ నాసింపకయు, మనము చేయు సమస్తకార్యములను చేయవలయు పథమును దృష్టిని నిర్ణయించుటయే కర్మయోగము లక్ష్యము. కావున 'అయ్యో! భగవచ్చింత ఏమాత్రమును జేయక నాజీవితకాలమంతయు ఈ పాడు పొట్టకై పాటుపడి చచ్చుచుంటిని గదా' యని ఎవరును వాపోవ వవసరము లేదు. తాను చేయవలసినవి చేసియే తీరవలయును. కాని ఏవిధముగ, ఎట్టి దృష్టితో, చేసినచో ఈ పనులు మనకు మేలుకలిగించునో యన్న నిర్ణయము కావించుటయే కర్మయోగి యొక్క మహత్త్వము. కర్మయోగి తన పనులను విరామములేక ఆచరించుచుండును. కాని తానాచరించిన కర్మముల ఫలితములమీద ఆతని కావంత తలంపును నుండదు. అందువలన నతడు తన సంపూర్ణదృష్టిని తన కార్యమునందే కేంద్రీకరింపగలుగుచున్నాడు. ఫలాసక్తి లేకుండ నెవరైన పనిచేయగలరా? తానొనర్చుచున్న కార్యమున కొంతయైన నపేక్ష లేక ఎవరు పనిచేయగలరు? పోనీ అట్లు చేయ

చున్నాడే యనుకొందము. అది హృదయశూన్యమగు యంత్రప్రాయమేయగునుగదా? అన్న వివిధ ప్రశ్నలు మనకు స్ఫురింపవచ్చును. కాని ఇట్టి నిరర్థక ప్రశ్నలు కర్మయోగికి పొడచూపవు. ఏలయన అతడు కార్యనిర్వహణమునందే తనదృష్టిని కేంద్రీకరించును. కావున అతడు నానాటికి తనకర్మములనుండి తన్ను విడదీసికొనుశక్తిని అభివృద్ధిచేసికొనుచుండును. తనయెదుటనున్న కార్యమునందే తన దృష్టిని కేంద్రీకరించును. ఆసమయమున తానొనర్చుచున్న కార్యమునుదప్ప తదన్యములగు కార్యములగన్నెత్తియైన జూడడు. ఇది యందరును చేయజాలరు. ద్రోణుడు తరుశాఖాగ్రస్థమగు పక్షినేత్రమును గుఱిపెట్టుమని శిష్యులను బంచినపుడు చెట్టు, కొమ్మలు, కాయలు, పూవులు— సమస్తమును జూచినవారే కన్పించిరి. ఆ పక్షి నేత్రమునుమాత్రమే చూచినవాడు, ఆ పక్షి నేత్రమునందే తన దృష్టిని కేంద్రీకరించినవాడు—అర్జును డొక్కడే! మర్కటమువంటి మనస్సు ఎల్లప్పుడు పండ్లకై గంతులువేయుచునే యుండును. నేనింతటిపాటు పడితిని గదా! నాకెంతటి లాభము కలుగునను తలంపు మాటిమాటికి మనకు స్ఫురించుచుండును. కాని కర్మయోగి యిట్టి మనోచాంచల్యమునకు చోటొసంగడు. ‘ఇది నా కర్తవ్యము’ అన్న భావమే అతనిచే పనిచేయించును. అతనిదృష్టియందు ఆ కార్యములలో ఉత్కృష్టమయినదిగాని, నీచమయినదిగాని కనిపించదు. సమస్తమును అతనికి సమానముగనే కన్పించును. ఈ సమదృష్టివలన అతడెట్టి స్థితియందైనను జరింపగలడు. ఇది హేయమయినది, ఇది మేలైనది యను తారతమ్యభావము లేకపోవుటవలన అట్టివాడు సభాముఖమున ప్రసంగములు చేయుచున్నను, మురికిదొడ్లను పరిశుభ్రము గావించుచున్నను సమానదృష్టిని సమాన మానసిక భావమును గలిగియుండును. అందువలన అతడు రెండుపనులను సమానముగనే చక్కగనే నిర్వహించును. శ్రీ వివేకానందస్వాములవారు మఠమునందలి బ్రహ్మచారులను మొట్టమొదట దేవాలయమునకు జెందిన పాత్రముల శుభ్రపఱుప నియోగించెడివారు. ఆ పని చేయించిన యనంతరమే యతడెంతవఱకు సాధుజీవనమునకర్హుడో నిర్ణయించెడివారు. ‘ఇది యేటిపని? నేను కళాశాలయందు జదివినవాడను. గిన్నెల దోముట దాసీపని’ అని తలచినచో ఆపని సక్రమముగా జరుగదు. అతని మనోభావమును అతని కార్యమే నిరూపించును.

‘ఫలాకాంక్షలేక పనిచేయుటెట్లు? నేను ఎన్నియో గ్రంథములను జదువుచున్నాడను. పరీక్షాఫలము నపేక్షింపక— పరీక్షయందగ్రశాఖయందుత్తీర్ణుడగావలయునన్న ఆశలేకుండ జదువుట సంభవమా!’ యని విద్యార్థి ప్రశ్నింపవచ్చును. నేను వివిధకర్మ రంగములలో పని చేయునపుడు ఆయా కార్యానుకూలములగు ఫలము గలుగవలయునన్న కోరిక అణుమాత్రమునులేక ఆ కార్యజాలము నాకెట్లు రుచింపగలదు?’ అని యుద్యోగి యడుగవచ్చును. కాని ఆలోచించినకొలది యిట్టి ప్రశ్నలు అర్థరహితములుగ మనకు గోచరించును. ఏలయన విద్యార్థి పరీక్షలలో నెగ్గుటయో యుద్యోగి ధనము సంపాదించుటయో—వారి కర్తవ్యములు. (నిజమునకు విద్యాలాభమేకాని పరీక్షాఫలిత మాకాంక్షణీయము కాకపోయినను) విద్యార్థి ధనము ఖర్చుపెట్టి చదువుచున్న ప్రస్తుతయుగ పరిస్థితి ననుసరించి పరీక్షలలో నుత్తీర్ణతపొందుటయే అతని లక్ష్యము. ఇట్లే

స్వకీయ క ర్తవ్యమును ప్రతివ్యక్తియు గుర్తింప గలిగినచో నిట్టి నిరర్థక సందేహము లుద్భవింప జాలవు.

ఇట్లు కర్మములయందు కర్తృత్వబుద్ధిని వదలి ఫలాపేక్షారహితముగ నొనరించినచో నదియెట్లు యోగము కాగలదను విషయమును కొంత విచారింతము. యోగమున మనస్సు పరమాత్మతో లీనమగును. 'తాను' అన్న యభిమాన మణుమాత్రమయిన నుండదు. పని యందు నిమగ్నులై యున్నవారికి బాహ్య ప్రపంచము కనిపింపదన్న విషయము విదితమే కదా! అట్టి కర్మయోగి తన్నుతాను మఱచి పోవును. ఇందులకు ఉదాహరణముగా శ్రీరామ కృష్ణులవారు ఈ కథను నచించువారు :

''ఒక జాలరి ఒక నీటిగుంటలో గాలము వేసి చేపలు పట్టుచుండెను. ఒక బాటసారి వానిని సమీపించి, 'తమ్ముడా, అల్ల ఆచోటునకు బోవుటకు మార్గమేది?' అని పలుమాఱు అడిగెను. ఆ సమయముననే చేప యెఱను గొఱుకుచున్నట్లు గాలపుబెండు తెలియజేయు చుండెను. అందుచే అతడేమియు మాఱుబలు కక తనగాలముననందే దృష్టిని నిలిపియుండెను. చేప గాలమునకు తగుల్కొనిన తర్వాత అతడు వెనుకకుదిరిగి చూచెను. కోపముతో బాటసారి వెడలిపోవనుండెను. అతనినిబిలిచి ''అయ్యా! తమరేమి సెలవిచ్చుచుంటిరి?' యని యడి గెను.''

ఇట్టి చిత్తైకాగ్రతయే కర్మయోగ సాధన మున-ప్రప్రథమ సోపానము. ఈ ఏకాగ్రత సిద్ధించుట అత్యంతదుర్లభము. ఏలయన నిట్టి సమయములందు మానసికములగు నితర భావ ములు, అహంకారమమకారములు మధ్యే పనిగట్టుకొని మన చిత్తైకాగ్రతను చాం చల్యమునకు గుఱిచేయుచుండును.

ఇట్టి కర్మములనుండి సంపూర్ణముగా తప్పిం చుకొని మనస్సును స్వాధీనపఱచుకొనుటకు సరియైన, ముఖ్యమైన, మార్గము భగవద్భక్తి. సమస్త కర్మములను ఈశ్వరార్పణము గావిం చుటయే యిందలి లక్ష్యము. ఇందుమూలమున మనమెంతో శ్రేయస్సునందగలము. ''ఎవరి యొద్దనుండి ఈ చరాచరజగత్తు సమస్తమును జనించుచున్నదో, ఈ ప్రపంచమంతయు ఎవ నిచే వ్యాపింపబడియున్నదో అట్టి పరమేశ్వ రుని తన కర్మముల మూలమున ఆరాధించు వాడు సిద్ధినిపొందును.

శ్లో. యతః ప్రవృత్తిర్భూతానాం
యేన సర్వమిదం తతమ్,
స్వకర్మణా తమభ్యర్చ్య
సిద్ధిం విందతి మానవః.

—(భగవద్గీత 18_46)

''నేను చయుపని సమస్తమును భగవ దర్థమే. అది అతని ఆరాధనగా, అర్చనగా, భావించుచున్నాను.'' అన్నభావముతో కర్మ నిమగ్నులగు భక్తులెంతయో మేలును పొంద గలరు. అంతట మనముచేయు కార్యము లన్నియు ఈశ్వరార్చనలుగా మారును. దీనినే లక్ష్యముగానెంచి శ్రీ వివేకానందస్వాముల వారు ప్రజాబాహుళ్యమును దేశసేవకు పురి కొల్పిరి. ''ఆబ్రహ్మస్తంభ పర్యంతము ప్రేమ స్వరూపియగు ఆ పరాత్పరుడే విరాజిల్లు చున్నాడు. మిత్రమా! నీ మనోవాక్కాయ ములన్నింటిని ఆయన పాదపద్మముల సన్నిధి నర్పింపుము. బహురూపములతో ప్రకాశించు ఆ మహామహునివిడిచి యీశ్వరునికై ఎందు

వెదకుచుంటివి. సమ స్తజీవరాసులను భేదబుద్ధి రహితుడై సమానముగ ప్రేమించువాడే శ్రేష్ఠ మయిన భగవద్భక్తుడు'' అని శ్రీ స్వాముల వారు నుడివియున్నారు. యుగయుగములందును ప్రతివ్యక్తియు ననుసరింపవలయు, అనుసరించి తీరవలయు సందేశమిది. పూర్వకాలమున ఋషులు, మునులు భక్తులు సమస్త ప్రపంచ మును విష్ణుమయముగా దర్శించిరి. 'సర్వం విష్ణు మయం జగత్' అన్న వచనమును జదివియే యున్నాము గదా!

ఎటుజూచినను ఏమిబల్కినను ఎచ్చట సేవించినను, పూజించినను నీ దర్శనమే కలుగ వలెనని పూజించుచున్నాను రామా—అని శ్రీ త్యాగరాజు రాముని వేడికొనెను.

నీకే తెలియకపోతే నేనేమిసేయుదురా
లోకాధారుడవై నాలో ప్రజ్వలించే జాలి
ఎందెందుజూచిన ఎందెందు బలికిన
ఎందెందు సేవించిన ఎందెందు పూజించిన
అందందు నీవని తోచేటందుకు నీపాదార
విందమును ధ్యానించిన దెందుకని
త్యాగరాజసన్నుత.

ఇక భక్తాగ్రేసరుడగు రామదాసు భగవం తుని సర్వసాక్షిత్వమును అనుభవించి—

"అంతా రామమయం ఈ జగమంతా
రామమయం"

అని చెప్పినాడు.

ఈ మహావాక్యమునే మన కార్యములందు నిరూపించి, మనలను కృతార్థులజేసికొనవలయు ననియే శ్రీస్వామివారి ఆశయము. ఇందు మరియొక విశేషముగలదు. ఏది లక్ష్యమో అదియే మార్గము. ఇట్లు సమస్తజీవరాసులును భగవదంశములుగా భావించి తానొనరించు సమస్త కార్యములను సంపూర్ణ ప్రేమార్ద్రు డైన భగవంతునకు ఆరాధనగా, పూజగా, అర్చనగా జేయుటయే కర్మయోగ సాధన మున సులభోపాయము. తనకుటుంబమును సైతము కర్మదృష్టితో జూచుచు ఏబాధ్యతయు కలిగించుకొనక జీవింపగలిగినచో జీవితమును ఉన్నతస్థాయినందింపగలము. ఒక శరముతో రెండు పక్షుల గొట్టినట్లు స్వీయముక్తికి మార్గ మును కల్పించుకొనుటతోపాటు జగద్ధితమును ఒనరింపవచ్చును. ఇది అత్యద్భుతసాధన

---

మీరు భక్తులు కాదలచినయెడల కృష్ణుడు మథురలో పుట్టెనా? వ్రేప ల్లెలో పుట్టెనా? ఆత డేమిచేయుచుండెను.? లేక గీతాప్రబోధ మొనర్చిన సరియగు తేదీయేది? ఈ విషయములను మీరు ఎంతమాత్రము తెలిసికొన నక్కఱలేదు. కాని భక్తియోగమునుగూర్చి, కర్మయోగమునుగూర్చి, గీతలలో జెప్పబడిన మనోహరధర్మములను ఆచరించుటకై వ్యాకులపడు టయే మీకు కావలసినది. గీతలనుగూర్చిన, గీతాకర్తనుగూర్చిన వివ రములన్నియు పండితుల వినోదముకొఱకుగాని మనకుగాదు. వారికి గావలసిన యా యానందము అంతయు వారినే పొందనిండు. వారి ప్రజ్ఞా వాదములకు 'శాంతి' చెప్పి మనము కార్యసాధనకు బూనుదము.

-శ్రీ వివేకానందస్వామి

# శ్రీ వాసుదేవ మననము

## ద్వితీయ వర్ణకము

శ్రీ మాచిరాజు శ్రీరామకృష్ణ

(గతసంచిక తరువాయి)

"సీ. గురుపదాంభోజముల్ గొలువక కల్గునే ప్రవిమలవైరాగ్య భాగ్యమహిమ। గురుపాద తీర్థంబు గ్రోలక కల్గునే జ్ఞానవిజ్ఞానయోగానుభవము। గురు సుప్రసాదంబుగొనకున్న గల్గునే ప్రతిలేని చిత్తోపరతిసుఖంబు। గురుతత్త్వమాత్మ గన్గొనకున్న గల్గునే నిరతిశయంబైన పరమపదము! అట్లు గావున విద్యార్థియైన యోగి। వినయ భయభక్తులెదలోన బెనగొనంగ। నల చతుర్విధ శుశ్రూషలాచరించి। కొనుచు ననిశంబు గురువుల గొలుచుననఘ ॥" (సీతా రామాంజనేయము 3-134) సద్గురు పాదపంకజములను సేవింపకుండ పరిశుద్ధమైన వైరాగ్యసంపన్నత ప్రాప్తముకాదు. అనగా చిన్మాత్రమైన స్వాత్మయొక్క వివర్తరూపమును, స్వాత్మవిచారణయం దుపాయభూతమును అగు తత్త్వంపదముల – జీవేశ్వరుల – యాథార్థ్యమును సద్గురూపదేశపూర్వకముగ శ్రవణముచేయకుండ వినిర్మలవైరాగ్యము దృఢముకానేరదు. సద్గురు పాదతీర్థమును గ్రహించకుండ జ్ఞాన – విజ్ఞాన – యోగానుభవము సిద్ధించదు. అనగా పరబ్రహ్మముయొక్క పాదరూపములైన తత్త్వంపదముల అర్థముయొక్క వివరణకారణములగు వేదాంతమహావాక్యార్థములయొక్క స్వారస్యమును మననముచేయకుండ పరోక్షజ్ఞానముయొక్కయు – అపరోక్షజ్ఞానముయొక్కయు – సమాధియొక్కయు అనుభవము లభింపదు. సద్గురుప్రసాదమును భుజింపకుండ సాటిలేని చిత్తశాంతి – నిరతిశయసుఖము – సమకూరదు. అనగా సద్గురునిచేత ననుభూతమై ఉపదేశపూర్వకముగ శిష్యునిచేత ననుభావ్యమైన అప్రతిబద్ధ స్వస్వరూప జ్ఞానమనెడి సద్గురు ప్రసాదముయొక్క నిధిధ్యాసనము నభ్యసింపకుండ సకల ద్వైతభావనివృత్తియు – స్వస్వభావసుఖసంప్రాప్తియు స్థిరపడదు. సద్గురు తత్త్వమును స్వాత్మయందు స్వాభిన్నముగ జూడకుండ నిరతిశయమైన పరమపదము సిద్ధింపదు. అనగా తత్పదలక్ష్యార్థమైన సచ్చిత్సుఖాత్మక సద్గురుస్వభావ యాథార్థ్యమును త్వంపదలక్ష్యార్థమైన ప్రత్యగాత్మయగు స్వాత్మయందు స్వాభిన్నముగ అద్వితీయాఖండైకరసత్వముచే ఐక్యార్థము నధిగమించకుండ సర్వోత్కృష్టమైన కైవల్యసార మనుభవసిద్ధముకాదు. అందువలన అధికారియైన బ్రహ్మవిద్యార్థి సద్గురూపసదనము చేసి సద్గురునియందు ప్రభుపన్నగ భాగధేయములయందువలె వినయ భయభక్తి ప్రపూర్ణుడై ప్రసిద్ధములైన సానాంగ భావాత్మరూప

చతుర్విధ శుశ్రూషలను (అనగా పరబ్రహ్మ పరమునందు.—1. 'స్థానశుశ్రూష' యనగా ప్రణవమాత్రలైన అకార ఉకార మకారములకు లక్ష్యార్థమైన ద్రష్టృస్థానమును ఎఱుక మఱపులులేని యునికితో విచారణచేయుటయే స్థానశుశ్రూష. 2. 'అంగశుశ్రూష' యనగా సూర్యచంద్ర బ్రహ్మవిష్ణు రుద్రాదులే చక్షురాద్యవయవములుగాగల విరాడ్రూపమున పరబ్రహ్మమును, సూర్యచంద్రాది రూపావయవములద్వారా విమర్శించి యెఱుంగుట అంగశుశ్రూష. 3. 'భావశుశ్రూష' యనగా సచ్చిత్సుఖలక్షణ పరమాత్మయే ప్రత్యగాత్మయైన స్వాత్మయని బ్రహ్మాత్మైకత్వప్రత్యయభావనా సంతతీకరణము – బ్రహ్మాత్మైకత్వజ్ఞానావృత్తిని జేయుట – భావశుశ్రూష. 4. 'ఆత్మశుశ్రూష' యనగా ఆత్మకు ఆత్మయే ప్రియమైనట్లు సతీసుతస్వాపతేయాదులు ప్రియతమములుగావు గనుక కూటస్థాభిన్నమైన పరబ్రహ్మమగు తనయందు తాను స్థైర్యమునుబొంది స్వస్థుడై తప్పకయుండుట ఆత్మశుశ్రూష – అని చతుర్విధ శుశ్రూషలను తెలియవలయును.) అప్రమత్తుడై అభ్యసించుచు సంతతము సద్గురుని ఉపాసించుచు అప్రతిబద్ధమైన ఆత్మజ్ఞానము నుపలంభింపవలయును.

ఇటుపైని ఆచార్యునియొక్కయు అంతేవాసి (శిష్యుని) యొక్కయు లక్షణములు చెప్పబడుచున్నవి.

"ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః। యోగజ్ఞో యోగనిష్ఠశ్చ సదా యోగాత్మకశ్శుచిః। గురుభక్తి సమాయుక్తః పురుషజ్ఞో విశేషతః। ఏవం లక్షణసంపన్నో గురురిత్యభిధీయతే॥" (అద్వయతారక. ఉ.) ఆచార్యః="ఆచినోతిహి శాస్త్రార్థా నాచారే స్థాపయత్యపి। స్వయమాచరతే యస్మాత్తస్మాదాచార్య ఉచ్యతే॥" సార్థముగను సరహస్యముగను సకలశాస్త్రములను సంగ్రహించి తత్సారమైన పరబ్రహ్మసాక్షాత్కారమునుపొంది, శాస్త్రప్రతిపాదితార్థములను శిష్యులకు ప్రవచనము చేయుచు శాస్త్రోక్తాచారమును శిష్యులచేత నాచరింపజేయుచు తానును ఆచరించుచుండునతడు ఆచార్యుడనబడును. అని 'ఆచార్య' శబ్దార్థము చెప్పబడుచున్నది. ఇందువలన శాస్త్రప్రతిపాదితమైన యర్థమును దెలిసి యుపదేశించునతడే ఆచార్యుడుగాని స్వబుద్ధిచేత గొన్ని అర్థముల నూహించి యుపదేశించునతడు ఆచార్యుడు గానేరడని తెలియబడుచున్నది. వేదసంపన్నః="బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః షడంగో వేదో అధ్యేతవ్యో జ్ఞేయశ్చ॥" సాంగవేదమును అర్థజ్ఞాన సహితముగ నధ్యయనముచేయుట బ్రాహ్మణునకు అవశ్యముగ నిర్వర్తింపవలసిన నిర్హేతుక ధర్మమై (విధియై) యున్నది. అని కృష్ణయజుర్వేదము మైత్రాయణీశాఖయందు చెప్పబడియున్నది. వేదాభ్యాసమనగా – "వేదస్వీకరణం పూర్వం విచారోఽధ్యయనం జపః। తద్దానం చైవ శిష్యేభ్యః వేదాభ్యాసోహి పంచధా॥" మొదట సద్గురూపదిష్టముగ వేదము నధ్యయనము చేయుటయు, సద్గురుముఖమున వేదార్థ విచారణమును, నిత్యము స్వాధ్యాయమును, జపమును, ప్రతిఫలాపేక్షశూన్యముగ శిష్యులకు ప్రవచనమును అని వేదాభ్యాసము పంచ ప్రకారములుగ విధింపబడుచున్నది. "నా వేదవిన్మను తేతం బృహంతం" (తై. బ్రా. 3-12-9.) వేదవిదుడు కానివాడు బ్రహ్మజ్ఞానమును బడయజాలడు. "నా బ్రహ్మవిత్పరమం ప్రైతిధామ"

(శాట్యాయనీ. ఉ.) బ్రహ్మవిదుడుగాకున్న పరమపదమును బడయనేరడు. కనుక స్వాధ్యాయ సంపన్నుడు ప్రవచనకుశలుడు. విష్ణుభక్తః=విష్ణుభక్తుడు – "చతుర్ముఖాదీనాం సర్వేషామపి వినావిష్ణు భక్త్యాకల్పకోటిభిః మోక్షోనవిద్యతే॥" (మ.నా.ఉ. 8 ఖం) విష్ణుభక్తివినాగా బ్రహ్మాదులైన సకలమైన వారికి గూడ అనేకకోట్ల కల్పములచేతనైనను మోక్షము లభించదు. విమత్సరః = మాత్సర్యశూన్యుడు. "మత్సరోఽన్యశుభద్వేషే" = ఒరుల సంపద నోర్వలేమి మత్సరము." యోగజ్ఞః=యోగమన.— "వృత్తిహీనం మనః కృత్వా క్షేత్రజ్ఞం పరమాత్మని। ఏక కృత్య విముచ్యేత ముఖ్యోఽయంయోగఉచ్యతే॥" మనస్సును వృత్తిశూన్యముగజేసి క్షేత్రజ్ఞుడగు ప్రత్యగాత్మను పరమాత్మయం దైక్యమొనరించి విముక్తుడగును. ఇదియే ముఖ్యమైన యోగము. అట్టి ప్రత్యగ్బ్రహ్మైక్యానుసంధాన యోగము నెఱింగినవాడు. యోగనిష్ఠః=అట్టి యోగనిష్ఠుడు. సదా యోగాత్మకః=సర్వదా అట్టి యోగస్వరూపుడును, శుచిః=పవిత్రుడును, గురుభక్తిసమాయుక్తః = ఆత్మగురునియందప్రతిహతమైన పరమభక్తిగలవాడును, విశేషతః పురుషజ్ఞః=సర్వత్రాత్మదర్శనుడును అనునీలక్షణసంపన్నుడు సద్గురువనిపేర్కొనబడును. మఱియు "మాతృతః పితృతః శుద్ధః శుద్ధభావో జితేంద్రియః। సర్వాగమానాం సారజ్ఞ॥ సర్వశాస్త్రార్థ తత్త్వవిత్। పరోపకారనిరతో జపపూజాది తత్పరః। అమోఘవచనః శాంతో వేదవేదార్థపారగః। యోగమార్గానుసంధాయీ దేవతాహృదయంగమః। ఇత్యాదిగుణసంపన్నో గురురాగమసమ్మతః॥" (శారదాతిలకము. 142-144) కులక్రమాగత సదాచార సంపన్నత్వముచేతను సచ్ఛీలత్వముచేతను బరిశుద్ధమైన సత్వాంశమునం దుద్భవించిన జననీజనకులుగలవాడును, స్వధర్మకర్మము నేమఱక పరిపాలించుటవలన పరిశుద్ధమైన అంతఃకరణగలవాడును, విజితేంద్రియుడును, సమస్త వేదసారజ్ఞుడును, సకలశాస్త్రార్థతత్త్వసంవేదియు, పరోపకార పారీణుడును, భగవంతుని జపపూజాది తత్పరుడును, అమోఘవచనుడును, సకల ద్వైతభావ నివృత్తి స్వానందప్రాప్తిరూప శాంతిగలవాడును, వేదవేదార్థపారదర్శియు, యోగమార్గానుసంధానపరుడును, దేవతలకు గూడ ప్రియమైనవాడును అను నిత్యాది లక్షణసంపన్నుడు సర్వాగమ సమ్మతుడైన సద్గురువగును. "సత్సంప్రదాయసంయుక్తః బ్రహ్మవిద్యావిశారదః। ఏవమాది గుణోపేతో దేశికోఽశేషవందితః॥" (శా.తి.) బ్రహ్మవిద్యాసంపాదనయందు సత్సంప్రదాయము అనగా సద్గురు పారంపర్యముగలవాడును బ్రహ్మవిద్యావిశారదుడును అను నిత్యాది గుణవిశిష్టుడగు దేశికుడు నిఖిలలోకవందితుడు. "గురురేవ పరంబ్రహ్మ గురురేవ పరాగతి। గురురేవ పరావిద్యా గురురేవ పరాయణం॥" (అద్వయతారక. ఉ.) అటువంటి సద్గురుడే పరబ్రహ్మము. అతడే పరమశ్రేయోపాయము. అతడే పరబ్రహ్మవిద్య. అతడే పరమాశ్రయము. "భగవద్దృశేభ్య ఆచార్యాద్ధైవవిద్యావిదితా సాధిష్టం ప్రాపదితి॥" (ఛాం.ఉ. 4-9-3.) భగవదవతారమైన అటువంటి సద్గురు కటాక్షముచేత ప్రాప్తమైన బ్రహ్మవిద్యయే అప్రతిహతఫలప్రదమగును. "శ్రోత్రియోఽవృజినోఽకామహతోయో బ్రహ్మవిత్తమః। బ్రహ్మణ్యుపరతశ్శాంతో నిరింధన ఇవానలః। అహేతుకదయాసింధు ర్బంధురానమతాంసతామ్। తమారాధ్య

గురుం భక్త్యా ప్రహ్వప్రశ్రయసేవనైః। ప్రసన్నం తమనుప్రాప్య పృచ్ఛేత్ జ్ఞాతవ్యమాత్మనః॥" (వి.చూ. 35, 36) వేదవేదాంతముల యొక్క తత్త్వజ్ఞానవిదుడును, అనఘుడును, రాగద్వేషాది విరహితస్వాంతుడును, తృష్ణాశూన్యుడును - అకామయమానుడును అనగా కోరికలు లేనివాడును, బ్రహ్మవిత్తముడును, నిరంతర బ్రహ్మాకారాకారితబుద్ధివృత్తి గలవాడును, సమిధలు లేని యగ్నిచందమున శాంతాత్ముడును, నిర్హేతుకదయాసముద్రుడును వినమ్రులగు సత్పురుషులకు ముఖ్యబాంధవుడును అగునటువంటి సద్గురువునుపొంది భక్త్యాసక్తి వినయసేవనములచే సంతృప్తిపఱచి ప్రసన్నునిగ జేసికొని తాను తెలిసికొనవలసిన బ్రహ్మవిద్యనుగూర్చి యర్థించవలయును. "ఆ॥ ఇట్టి గురుని జేరకెన్నిపోకలుబోవ। చిత్తశుద్ధిలేదు చింతపోదు। మాయమాయలాడి మటుమాయమంత్రాల। దొలగిపోదు ఆత్మ దెలియనీదు॥" (శ్రీరామ స్తవరాజము).

"విద్యా హ వై బ్రాహ్మణమాజగామ గోపాయ మా శేవధిష్టేఽహమస్మి। అసూయకాయాఽనృజవేఽయతాయ న మా బ్రూయా వీర్యవతీ యథా స్యామ్॥" విద్యా = బ్రహ్మవిద్య, బ్రాహ్మణం = 'బ్రహ్మణి పరబ్రహ్మణి నిష్ఠావత్త్వాత్ బ్రాహ్మణః'=పరబ్రహ్మనిష్ఠగల బ్రహ్మవిదుడు బ్రాహ్మణుడు-అట్టి బ్రాహ్మణునిగూర్చి, ఆజగామ = వచ్చి, ఆహ వై = ఇట్లు పలుకుచున్నది. ఓ బ్రాహ్మణుడా! మా = నన్ను, గోపాయ- యథా వీర్యవతీ స్యామ్ = ఏవిధమున పెంపొందుదాననగుదునో ఆ విధమున పరిపాలింపుము. అహం= లెస్సగ నీచేత పరిపాలింపబడిన నేను, తే= నీ కొఱకు, శేవధి అస్మి= మహానిధిని అగుచున్నాను. మా= నన్ను, అసూయకాయ = నీయందసూయాపరుడును, అనృజవే= కపటియు, అయతాయ= ఇంద్రియ నిగ్రహము లేనివాడును అగు శిష్యునికొఱకు, న బ్రూయాః= ఉపదేశింపవలదు.

"య ఆతృణత్త్యవితథేన కర్ణావదుఃఖం కుర్వన్నమృతం సంప్రయచ్ఛన్। తం మన్యేత పితరం మాతరం చ తస్మై న ద్రుహ్యేత్కతమచ్చనాహ॥" ౨॥ యః = ఏ బ్రహ్మవిద్గురువు, దుఃఖం అకుర్వన్ = దుఃఖమును కలుగజేయక, అమృతం సంప్రయచ్ఛన్ = అమృతస్వరూప బ్రహ్మానందమును లెస్సగ గలుగజేయుచు, కర్ణౌ = రెండు చెవులను, అవితథేన - ఆతృణత్తి= సత్యముచేత అనగా సఫలమైన బ్రహ్మవిద్యోపదేశముచేత నిండించునో అనగా తృప్తిపఱచునో, తం ఆచార్యం= ఆయాచార్యుని, పితరం మాతరంచ మన్యేత = తల్లిదండ్రులుగనే తలంపవలయును. 'మాతరం పితరంచైవ సాక్షాత్ప్రత్యక్షదేవతాం। మత్వా గృహీ నిషేవేత సదా సర్వప్రయత్నతః॥' (మహానిర్వాణతంత్రము. 8-25.) జననీ జనకులనే సాక్షాత్తుగ ప్రత్యక్ష దైవతములుగ భావించి గృహస్థుడు సర్వదా సర్వ ప్రయత్నములచేతను మాతాపితరులను లెస్సగ సేవించవలయును. "మాతాపితృసమం దైవం సర్వేషాం నహి విద్యతే। తస్మాత్సమర్చయేన్నిత్యం పితరౌ దేవరూపిణౌ॥" సకల లోకమునకును జననీజనక సమానమైన అన్య దైవము నిశ్చయముగ నెక్కడను లేదు. అందువలన దైవస్వరూపులైన మాతాపితరులను నిత్యము పూజింపవలయును. స్వాత్మజ్ఞానప్రదుడగు సద్గురుడును జననీ జనక సమానుడేయగుటంజేసి యాచార్యుని మాతాపితరులుగనే భావించి సేవించవలయును. "మాతృదేవోభవ। పితృదేవోభవ। ఆచార్యదేవో

భవ॥'' (తై.ఉ. 1-11-2.) జననీజనక సద్గురువులను దైవతములని దలంచి భజించవలయునని శ్రుతి. తస్మైనద్రుహ్యేత్ =అట్టి ఆచార్యుని గుఱించి ద్రోహచింత చేయవలదు అని కతమచ్చనాహ = ఇట్టి నియమములను బ్రహ్మవిద్య విశేషముగ బోధించును.

''అధ్యాపితాయే గురుం నాద్రియంతే విప్రా వాచామనసాకర్మణావా। యథైవతేన గురోర్భోజనీయా స్తథైవతాన్న భునక్తిశ్రుతం తత్॥'' 3. యే విప్రాః = ఏ శిష్యులు, అధ్యాపితా = సద్గురునిచే బ్రహ్మవిద్యాబోధితులై, గురుం = బ్రహ్మవిద్య నుపదేశించిన ఆచార్యుని, వాచా మనసాకర్మణావా = మనోవాక్కాయములచే త్రికరణశుద్ధిగా, న ఆద్రియంతే=పూజించరో, తే=ఆ శిష్యులు, యథాగురోః నభోజనీయాః= ఏ ప్రకారము ఆచార్యునివలన బ్రహ్మవిద్య ననుభవింపదగినవారు కారో, తథైవ=ఆ ప్రకారమే, తత్ శ్రుతం = ఆ యధీత విద్యయు, తాన్ = ఆ శిష్యులను, నభునక్తి = అనుభవింప జేయదు అనగా అనుభవసిద్ధము - ఫలప్రదము - కాదు.

''యమేవ విద్యా శుచి మప్రమత్తం మేధావినం బ్రహ్మచర్యోపపన్నం। యస్తే నద్రుహ్యేత్ కతమచ్చనాహ తస్మై మాబ్రూయా నిధి పాయ బ్రహ్మన్॥'' 4. బ్రహ్మన్ = ఓ బ్రాహ్మణుడా? యం శిష్యం = ఏ శిష్యుని, శుచిం=శిష్టాచార సంపన్నత్వముచే బరిశుద్ధునిగను, అప్రమత్తం=అప్రమత్తునిగను, మేధావినం = మేధావంతునిగను ('ధీర్ధారణావతీ మేధా' = ధారణాశక్తిగల బుద్ధి మేధ యనబడునని యమరము), బ్రహ్మచర్యోపపన్నం = ''బ్రహ్మ భావే మనశ్చారో బ్రహ్మచర్యం ప్రచక్షతే॥'' (దర్శన. ఉ. 1-14) నిత్యము బ్రహ్మనిష్ఠం దగిలిన చిత్తప్రవర్తనము బ్రహ్మచర్యమనబడును—అట్టి నైష్ఠిక బ్రహ్మచర్యము గలవానినిగను, విద్యాఏవ=నిశ్చయముగ దెలిసికొనుచున్నావో, యః = ఏ శిష్యుడు, తే = నీ యెడల, నద్రుహ్యేత్ = ద్రోహమును తలంపడో, నిధిపాయ తస్మై=బ్రహ్మవిద్యానిధిని పరిపాలింప దక్షుడగునటువంటి శిష్యునికొఱకు, మాం=నన్ను, బ్రూయాః=ఉపదేశింపుము అని కతమత్ చనాహ=బహువిధముల బ్రహ్మవిద్య విధించెను. అని శ్రీ విద్యారణ్య విరచిత ఋగ్వేదభాష్యమునందును;

''వేదాంతే పరమం గుహ్యం పురాకల్పే ప్రచోదితం। నా ప్రశాంతాయ దాతవ్యం నా పుత్రాయా శిష్యాయ వా పునః॥'' (శ్వే. ఉ. 6-22). ఉపనిషత్తులయందు దనాదిగ ప్రతిపాదింపబడిన పరమరహస్యమైన పరతత్త్వజ్ఞానము - బ్రహ్మవిద్య - ను, ప్రశాంతచిత్తుడు గానివానికిని, పుత్రునివలె నుపచరింపనివానికిని శిష్యభావము లేనివానికిని ఉపదేశింపగూడదు. ''తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్ప్రశాంత చిత్తాయ శమాన్వితాయ। యే నాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచతాం తత్త్వతో బ్రహ్మ విద్యాం॥'' (ముం. ఉ. 1-2-13). బ్రహ్మవేత్తయగు ఆ సద్గురువు శాస్త్రోక్త శిష్ట సంప్రదాయానుసారము గురూపసదన మొనర్చిన వాడును, ప్రశాంతచిత్తుడును అనగా రాగద్వేషాది దోషరహితుడును, సాధన చతుష్టయ సంపన్నుడును అగు శిష్యునకు ఏ బ్రహ్మ విద్య చేత, సత్యస్వరూపమును అక్షరమును అగు పురుషుని - పరిపూర్ణ పరమాత్మను - తెలిసికొనుచున్నాడో అనగా పరబ్రహ్మ మెఱుంగబడునో, అట్టి బ్రహ్మవిద్యను చక్కగా బోధించవలయును. అని శ్రుతులయందును;

"శిష్యః కులీనః శుద్ధాత్మా పురుషార్థ పరాయణః। అధీతవేదః కుశలో దూరముక్త మనోభవః॥ ౧॥ హితైషీ ప్రాణినాం నిత్యమాస్తిక స్త్యక్త నాస్తికః। స్వధర్మనిరతో భక్త్యా పితృ మాతృ హితోద్యతః॥ ౨॥ వాఙ్మనః కాయవసుభిః గురుశుశ్రూషణేరతః। త్యక్తాభిమానో గురుషు జాతి విద్యా ధనాదిభిః॥ ౩॥ గుర్వాజ్ఞా పాలనార్థం హి ప్రాణవ్రయ రతోద్యత। విహాత్య చ స్వకార్యాణి గురుకార్య రతస్సదా॥ ౪॥ దాసవన్నివసేద్యస్తు గురౌ భక్త్యా సదా శిశుః। కుర్వన్నాజ్ఞాం దివారాత్రౌ గురుభక్తిపరాయణః॥ ౫॥ ఆజ్ఞాకార గురో మనోవాక్కాయ కర్మభిః। యో భవేత్సదా గ్రాహ్యో నేతరః శుభకాంక్షయా॥" ౬॥ (శారదాతిలకము).

సత్కులసంజాతుడును, రాగద్వేషాది విరహితముగ పరిశుద్ధ స్వాంతుడును, చతుర్విధ పురుషార్థములయం దత్యంతాసక్తుడును, స్వాధ్యాయసంపన్నుడు ప్రవచనకుశలుడును, మారవికారదూరుడును, నిత్యము సకలప్రాణిహితాభిలాషియు, ఆస్తికుడును, త్యక్తనాస్తికుడును, స్వధర్మనిరతుడును, మాతాపితృహితమును భక్తితో నిర్వర్తించువాడును, మనోవాక్శరీర ధనములచేత సద్గురుశుశ్రూషాపరతుడును, సద్గురువులయందు జాతి విద్యా ధనాదులచే నిరభిమానియు, గుర్వాజ్ఞా పరిపాలనార్థము స్వప్రాణ పరిత్యాగమునైన జేయ సంసిద్ధుడును, నిజ కార్యమును పరిత్యజించియైనను సద్గురుకార్యమును చక్కబఱచుటయందే సదా అభినివేశ సహితోత్సాహాసక్తులుగలవాడును, దాసునివలె నివసించుచుండువాడును, గురుకులవాసియై రాత్రిందివములు సర్వదా సద్గురుని ఆజ్ఞలను భక్తితో బాలకునిభంగి చేయుచుండువాడును, గురుభక్తిపరాయణుడును, త్రికరణశుద్ధిగ గుర్వాజ్ఞాకారియు, నగు బ్రహ్మవిద్యార్థియే శిష్యుడుగ సదా గ్రాహ్యుడు, శుభకాంక్షచే నితరుడుకాడు. మఱియు—

"మంత్రపూజా రహస్యాని యోగో పయతి సర్వదా। త్రికాలం యో నమస్కుర్యా దాగమాచార తత్త్వవిత్॥ ౧॥ ప్రణమ్యోప విశేత్పార్శ్వే తథా గచ్ఛేదనుజ్ఞయా। ముఖావలోకీ సేవేత కుర్యాదా దిష్టమాదరాత్॥ ౨॥ అసత్యం న వదే దగ్రేన బహుప్రలపేదపి। కామం క్రోధం తథాలోభం మానం ప్రహసనం స్తుతిం॥ ౩॥ చాపలాని జిహ్మాని కార్యాణి పరిదేవనం। ఋణ దానం తథా దానం వస్త్రానాం క్రయ విక్రయః॥ ౪॥ న కుర్యా ద్గురుణా సార్థం శిష్యో భూష్ణుః కదాచన। శరీరం వసు విజ్ఞానం వాసః కర్మగుణానసూన్॥ ౫॥ గుర్వర్థం ధారయేద్యస్తు స శిష్యో నేతరస్మృతః। స ఏవ శిష్యః కర్తవ్యో నేతరః స్వల్పజీవినః॥ ౬॥ ఏతాదృశో గుణోపేతః శిష్యో భవతి నాపరః॥" (శారదాతిలకము).

మంత్రపూజారహస్యములను సర్వదా గోప్యముగ నుంచువాడును, త్రికాలములయందును సంధ్యాప్రణుతిని తప్పక చేయువాడును, ఆగమాచారతత్త్వవేత్తయు, ఆచార్యున కభివందన మొనరించి వారి పార్శ్వమున గూర్చుండువాడును, అట్లే ఆచార్యుని అనుజ్ఞానుసారముగ వెడలువాడును, సర్వదా సద్గురుముఖము నవలోకించుచు సేవించుచుండువాడును, ఆచార్యుని ఆదిష్టమును అనగా ఆదేశమును ఉపదేశమును ఏర్పాటులను అధికాదరముతో నడుపువాడును, సద్గురుని మ్రోల అసత్యభాషణమును అతిప్రలాపములను కామక్రోధలోభములను ఆత్మోత్కర్షమును ప్రహసనము (పెద్దనవ్వు)ను

స్తుతిని చేయనివాడును, చాపలములు కుటిలములు నగు కార్యములను చేయనివాడును, పరిదేవనమును చేయనివాడును అగు బ్రహ్మవిద్యార్థియే శిష్యుడుగ గ్రహింపదగినవాడు. శిష్యుడు కాగలవాడు ఆచార్యునకు ఋణదానమును దానపూర్వకముగ ధనాదుల నొసంగుటయు, ఆచార్యునితో వస్తుక్రయవిక్రయ వ్యాపారమును ఎన్నడును చేయగూడదు. తన తను మానస ధనవాసములను, గుణకర్మ ప్రాణములను నిజసద్గురునిప్రయోజనముకొఱకే ధరించుచుండు శిష్యుడే శిష్యుడగును కాని యన్యుడు కాడని యభిప్రాయము. అట్టివాడే శిష్యుడుగ స్వీకరింపదగినవాడు. అల్పబుద్ధులైన యన్యులు కారు. ఉపర్యుక్త గుణవిశిష్టుడైన బ్రహ్మవిద్యార్థియే శిష్యుడగును. పరుడు కానేరడు. అని 'శారదాతిలకము'నందును శిష్య ధర్మములు చెప్పబడినవి. "గురు శిష్యాది భేదేన బ్రహ్మైవ ప్రతిభాసతే॥" (ఆత్మ. ఉ.) బ్రహ్మమే గురుశిష్యాది భేదముచేత ప్రతిభాసించుచున్నది.

(సశేషము)



# శ్రీ తురీయానంద లేఖావళి

శ్రీహరిశరణమ్

రామకృష్ణ సేవాశ్రమము,
కనఖలు, 23 మే, 1913.

ప్రియ సీతాపతి,

నీవు 17 వ తేదీన వ్రాసిన లేఖను జూచి సంతోషించితిని. నాకు కనఖలున కాశీయందు కన్న కొంత మేలే కనబడుచున్నది. ఐనను వ్యాధి ఏమాత్రము కుదిరినట్లు కనిపించుట లేదు. రాత్రులయందు నిద్రలేకపోవుట మొదలగు ఉపద్రవములు పీడించుచునే యున్నవి. కొంచెము కొంచెముగా దుర్బలుడనగుచున్నాను.

మాకు ఏదియో జరుగవలసినది జరిగినది. మీరందరు మేల్కొని, భగవత్ కైంకర్యముల చేసి కృతార్థులు కావలెను. ఇది నా ముఖ్యాభిలాష. శ్రీ వివేకానందస్వాములవారి "ఆత్మనో మోక్షార్థం జగద్ధితాయ చ" అన్న వచనము సార్థకమగుగాక. ఇప్పుడు నీ మనసు బాగుగా సంకల్పమందు దృఢమైనట్లు విని సంతోషించుచున్నాను. మనకు కావలసినది ఇదియే. ఇక మరి కోరవలయున దేమియున్నది? 'సన్నిమిత్తే వరం త్యాగో వినాశే నియతే సతి' ఇది పుస్తకములతోనే ముగియుటయేనా? దీనినంతయు జీవితానుభవమునకు గొనిరావలదా? నీవు చక్కగా చేయుచున్నావు. అంతయు చదివి గ్రహించి అట్లు నడుచుకొనకపోయినచో నీ విద్య విద్యగాదు. అది అవిద్యయే. దౌర్బల్యమును నీదరి జేరనీయకుము. శ్రీ రామకృష్ణుల వారియొక్కయు, శ్రీ వివేకానందస్వాముల వారియు లక్ష్యములను జీవితములను లక్ష్యముగా నుంచుకొని సూటిగా నడిచిపొమ్ము. ఏమియు భయములేదు. జగదీశ్వరి నిన్ను రక్షించును. ఇన్నాళ్లనుండియు ఆమె నిన్ను రక్షించుచు వచ్చుచున్నది. ఈ విషయము

కొంత యోచించినచో నీకే చక్కగా కనిపింప గలదు. ఆమె నిన్ను పట్టుకొనియుండకపోయిన యెడల నీకు రక్షణ యుండెడిదా? ఎన్నడును నుండెడిది కానేకాదు. దేవి తనంతట తానే తన మార్గమును శుభ్రపఱచి నిన్ను తనవైపునకు దీసికొనివచ్చినది. కాన భయమెందులకు. జగన్మాతయొద్దకు బొమ్ము. ఆమెతోడి సంబంధమును స్థిరముగా దృఢపఱచుకొనుము. ఆమె సంగము గాక యితర సంగము ఏమియు లేదని నిశ్చయించుకొనుము, అటుపైన తల్లి తన కృపతో 'నేనుతప్ప నితరమేదియు లేదని' నీకు జూపును. 'ఘట ఘట రామ రామాయ్యా!' అను మాటను వింటివిగదా. సమస్త ఘటములందును జగదీశ్వరియే విరాజిల్లుచున్నది. బ్రహ్మామయి సర్వఘటములందున్నట్లు నీకు స్పష్టముగావించును. అది కలిగినచో సమస్తమును (పరిపూర్తియై) సమకూరినట్లే. ఆపిమ్మట 'నేను, నాది' అన్న భావము నశించి అంతయు దేవీమయముగా గోచరించును. నీవుచెప్పినట్లిక జగజ్జనని యాప్తులనే తనవారుగా భావించి ఆనందింపవలయును. వారే నిన్ను జగదీశ్వరుని సన్నిధికి దోడ్కొనిపోవుదురు. భగవానునినుండి విడివడజేసి దూరముగా మనల దీసికొనిపోవువారెవరో వారినుండి మనము దూరముగా తొలగి వర్తింపవలయును. జగన్మాతతోడనే యిక మన సంబంధము. ఇతరసంబంధమేదియును లేదు. ఇక ముఖ్యసారాంశమిది: 'నేను జగదీశ్వరివాడను. ఆమె నాకు జెందినది' ఈ విషయమును రూఢిగా మనసున నిలుపుకొనుము. ఎట్లయినను సరియే, ఎన్ని ఆటంకములు కలిగినను సరియే. దీని కొఱకు నీ చేతితో నీ గుండె బ్రద్దలుగొట్టుకొనవలసివచ్చినను దానిని వదలకుండుటకు—స్వీకరించుటకు—సంసిద్ధుడవు కావలయును. మరి ఇక నేమి కలదు? నీవు బుద్ధిమంతుడవు. నీకు నేను జెప్పవలసినదేమికలదు? దేవియే నీకు సమస్తజ్ఞానము నిచ్చును. పూరీక్షేత్రమునకు శ్రీ బ్రహ్మానందస్వామివారు వత్తురు. వారితో కాలముగడిపిన నీ కెంతయో మేలు చేకూరును. వారి సాంగత్యము అమోఘము, అత్యంత దుర్లభము. ఈ మాట నేను మీకు జెప్పనవసరము లేదు. నీ కోరికల నెఱవేర్చుమనుటయే భగవానునకు నేను గావించు నిష్కపటమగు ప్రార్థన. 'నేను భగవానుని సంతానమను. ప్రభువు దాసుడను.' అన్న భావముతో తన్మయుడవగుటయే శ్రేష్ఠమయిన లాభమని తలంచుట తప్ప వ్రాయుట కింకేమి యున్నది.

తే—బయట ఎన్నో పనులు చక్కగా నిర్వర్తించుచున్నాడని విని సంతోషించుచున్నాను. తు—స్వామివారి పనికూడ నాకు ప్రియమే. భగవంతుని పని సమస్తమును ఆయనయే నిర్వర్తించుకొనును. మనమందరము నిమిత్తమాత్రులమే. తమ్ము యంత్రస్వరూపముగ భావించి భగవానుని కార్యముల నెవరు కొనసాగింతురో వారు కృతార్థులు.

ఇచ్చట నెల్లరును కుశలముగా నున్నారు. శ్రీ శివానందస్వాములవారు, 'మ.'—వీరందరును సౌఖ్యముగా నున్నారు.

నీకు నా శుభాశీర్వచనములు,

ఇట్లు,

శ్రీ తురీయానంద



# కీర్తిశేషులు శ్రీ వెదురుమూడి వేంకటకృష్ణరావుగారు

రామకృష్ణ ప్రభకు సహాయ సంపాదకులుగ నుంటున్న శ్రీ వెదురుమూడి వేంకట కృష్ణరావుగారు గతమాసము 24 వ తేదీ సోమవారము దివంగతులైరని పాఠకలోకమునకు తెలియజేయుటకు మిక్కిలి చింతించుచున్నారము.

బాల్యమునుండియు శ్రీ కృష్ణరావుగారి జీవితము ఆధ్యాత్మికచింతతోనే సాగినది. అనుక్షణము వారిముఖమున ఆధ్యాత్మికావేశమే తాండవించుచుండెడిది. ఒరుల కపకారమనునదే యెరుగని అమాయకపు జీవి. పిన్నలకు పెద్దలకు ఆప్తమిత్రులు. ఏ విషయముననుతొందరపాటే యెరుగని శాంతస్వభావులు. మూర్తీభవించిన శాంతము! శ్రీ రామకృష్ణులు చెప్పెడి గృహస్థ సన్న్యాసమున జీవితమును చాలించిన ధన్యజీవి.

రామకృష్ణ వాఙ్మయమును సుమారు 20 సంవత్సరములకు పూర్వమే తెలుగునాడునకు పరిచయము కావించినారు. శ్రీ రామకృష్ణ లీలామృత మను గురుమహారాజుగారి జీవితము (ప్రథమ ముద్రణము) వీరి అనువాదము. చివరి దినములలో వీరనుభవించిన కష్టములకు వీరి నిష్కపటజీవితము, నిర్లిప్తత, గృహస్థసన్న్యాసము కారణములు.

శ్రీ కృష్ణరావుగారు 1887 ఫెబ్రువరి 14 వ తేదీని జన్మించినారు. జన్మస్థానము తూర్పు గోదావరిజిల్లా, కాకినాడ. చిన్నతనములో కాకినాడ, విజయనగరములందు విద్యాభ్యాసము ముగించిరి. 1902 ప్రాంతమున రాజమహేంద్రవరమున ఒక సత్కుటుంబమునకు చెందిన వనితను పెండ్లాడిరి. భర్తకు తగిన భార్య, ప్రపంచ స్వభావమే యెరుగని ముగ్ధ ఈమె. వీరి సంతానము మాంగల్యవతియగు యేకైకపుత్రికారత్నము.

విద్యాభ్యాసము ముగించిన తరువాత మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో 1911 వ సంవత్సరమున పట్టభద్రులై స్వగ్రామమును చేరి అచ్చట కలక్టరు ఆఫీసులో 1912 నుండి 1917 వరకు చిన్నఉద్యోగములో నుండిరి. 1918 వ సంవత్సరమున మద్రాసు గవర్నమెంటు ట్రాంసులేటరు ఆఫీసులో అసిస్టెంటుగా జేరి 1938 వ సంవత్సరములో ప్రధాన అనువాదక పదవిని స్వీకరించి 1944 సంవత్సరములో రిటైరై ఉపకారవేతనమును స్వీకరించుచుండిరి.

చిన్ననాటినుండియు ఆధ్యాత్మికాభిలాష కలవారై వారు మద్రాసు చేరినప్పటినుండి శ్రీరామకృష్ణమఠముతోడను, తత్సంబంధమగు స్వాములవారితోడను, రామకృష్ణ వాఙ్మయము

తోడను ఎక్కువ పరిచయము కలవారైరి. 1918 వ సంవత్సరమున మఠమునకు ప్రెసిడెంటుగా నుండిన రామకృష్ణానందస్వాముల వారి దయకు పాత్రులై వారి సదుపదేశములను పొంది ధన్యులైనారు. జీవితము, సంసార చక్రమున తిరుగుచున్నప్పటికి, త్యాగభావముతో జీవితమును గడపిన మహావ్యక్తి. వీరితో ఒకసారి పరిచయము కల్గించుకొనినవారు ఆ సాధుశీలుని, ఆ శాంతమూర్తిని మరచిపోలేరు. వారి ఇష్టాగోష్ఠులలో ఎన్నెన్నో ఆధ్యాత్మిక విషయాలు దొర్లుచు శ్రోతలను తన్మయపరచెడివి. ప్రతిక్షణము "గురుమహారాజు, అమ్మగారు, స్వాములవారు స్మరణలతోనే తన్మయులై యుండెడివారు."

"శ్రీ రామకృష్ణ ప్రభ" సహాయ సంపాదకులుగ నుండి వివేకానందస్వాములవారి **(What is Religion?)** అను గ్రంథమును "ధర్మపరిశీలన" అను శీర్షిక క్రింద అనువదించిరి. గవర్నమెంటు ఓరియంటల్ లైబ్రెరీ యాజమాన్యమున "బ్రహ్మవిద్యాసుధార్ణవ" మను వేదాంత గ్రంథమును సంస్కరించినారు. శ్రీ రామకృష్ణ లీలామృతము వీరి చిరస్మరణీయమగు అనువాదము. పవిత్రమాతయగు శ్రీ శారదాదేవి గారి సంభాషణలను తెనుగించి, శ్రీ దేవివారి జీవితవిశేషాంశముల అందరికి తెలియునట్లు చేసిరి. వీరి కృషి ఇట్టి ఆధ్యాత్మికమందే కాదు—సంగీతకళయందుకూడ వికసించినది. గాత్రపాటవము లేకపోయినను సంగీతమునందు వీరికి గల అభిలాష వారప్పుడప్పుడు ప్రచురించిన పాటలయందే విదితమగుచున్నది. భక్తశిరోమణి, వాగ్గేయకారకుడగు శ్రీ త్యాగరాజు భక్తులు వీరు. రావుబహదుర శ్రీ సి. రామానుజాచార్యులవారి యాజమాన్యమున ప్రకటింపబడనున్న "త్యాగరాజు - భక్తి" అను ఆంగ్ల గ్రంథమున త్యాగరాజ కీర్తనల ఆంగ్లానువాదము వీరిది. చివరిదినములలో "స్వయంవర" మను ఒక సాంఘిక నాటకమును రచించి దాని తప్పొప్పులు దిద్దుకొనుచుండెడివారు.

ఆంధ్ర వాఙ్మయమున అనువాదకులుగా పేరుగడించి భక్తలోకమున భక్తశ్రేష్ఠుడను పించుకొనిన అమృతహృదయులు స్వర్గమునకు తరలిరి.

వీరి యాత్మకు శాంతి కల్గుగాక !



లాల్‌జి గోధు & కంపెనీవారి
ఎల్.జి
ఇంగువను
మార్కు గమనించి
కొనుడు
మోసపోకుడు
WHEN BUYING ASAFOETIDA
Specify
L.G the
Mark of Quality
ASAFOETIDA
L.G
లాల్‌జి గోధు అండ్ కో
సౌకార్‌పేట, మదరాస్
(L.G. 9-6)

# శ్రీ రామకృష్ణమఠ ప్రచురణములు

## శ్రీ రామకృష్ణ లీలామృతము

496 పుటలు దివ్యమగు ద్వితీయ ముద్రణము! రూ. 5-0-0

## బ్రహ్మానంద బోధనలు

344 పుటలు ప్రజ్వలమగు ప్రథమ ముద్రణము! రూ. 3-8-0

## శ్రీ రామకృష్ణ బోధామృతము (సంగ్రహ జీవితసహితము)

**540 పుటలు** సర్వాంగ సుందరమగు చతుర్థ ముద్రణము వెల రూ. 3-4-0

## శ్రీమద్భగవద్గీత

**480 పుటలు** శ్రీధరీయ టీకాసార ప్రతిపద టీకాతాత్పర్య విశేషార్థ సహితము రూ. 3-0-0

## శ్రీ వివేకానంద జీవిత చరిత్ర

**432 పుటలు** పండిత పామర రంజకమైన శైలి. అందమగు 6-వ కూర్పు రూ. 3-0-0

## శ్రీ శారదాదేవి చరిత్ర

**256 పుటలు** ఇంటింటను ఉండతగిన దివ్యగ్రంథము. ముద్దులొలుకు రెండవ కూర్పు వెల రూ. 1-12-0

## శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

**186 పుటలు** (ఆదర్శప్రాయుడగు గృహస్థుని జీవితము) వెల రూ. 1-4-0

| | | | | |
|---|---|---|---|---|
| శారదా ప్రసంగములు ... | 2 8 0 | గురూపదేశములు ... | | 0 8 0 |
| ప్రబోధరత్నాకరము ... | 2 4 0 | నాసంస్కరణ యుద్ధవిధానము ... | | 0 6 0 |
| రాజయోగము ... | 2 4 0 | నా గురుదేవుడు ... | | 0 6 0 |
| కర్మయోగము | 1 8 0 | శ్రీ పరమహంస జీవిత సంగ్రహము | | 0 4 0 |
| భక్తియోగము ... | 1 4 0 | నవీన భారతదేశము ... | | 0 4 0 |
| వివేకానంద లేఖావళి (మొదటి భాగము) | 1 8 0 | ముక్తిమార్గము ... | | 0 8 0 |
| వివేకానంద లేఖావళి (రెండవ భాగము) | 1 8 0 | సర్వం విష్ణుమయం జగత్ (తెలుగు) | | 0 8 0 |
| అనుష్ఠాన వేదాంతము ... | 1 4 0 | శ్రీ రామనామ సంకీర్తనము ... | | 0 1 0 |
| వివేక సూర్యోదయము ... | 1 0 0 | యతిగీతము (పద్యకావ్యము) ... | | 0 1 0 |
| శ్రీ పరమహంస నీతికథా రత్నములు | 0 12 0 | నా మతము | 0 0 6 | డజను 0 5 0 |
| భక్తిమార్గము ... | 0 8 0 | సింహగర్జన | 0 0 6 | డజను 0 5 0 |
| చికాగో నగరోపన్యాసములు ... | 0 8 0 | | | |

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

**వేదాంతకేసరి (ఆంగ్లము) శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)**

అను మాస పత్రికలును మాయొద్ద దొరకును

ఇట్లు వ్రాయుడు:

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, చెన్నపురి.

సంపాదకులు: శ్రీ ఋతజానందస్వామి

శ్రీ కే. ఎస్. ఎస్. రాజన్ గారిచే ది జ్యూపిటరు ప్రెస్సు లిమిటెడ్ (జి. టి. మద్రాసు) న ముద్రింపబడి,
శ్రీ శుద్ధసత్త్వానందస్వామిచే శ్రీ రామకృష్ణమఠము (మైలాపూరు) నుండి ప్రచురింపబడినది. 15-12-52.